శ్రామిక సాహిత్య మాల - 1

# కార్మికోద్యమ కర్తవ్యాలు





మరుడు కా. శంకర్ గుహ నియోగి

మరణం : 28-9-1991

రచన : కామ్రేడ్ శంకర్ గుహ నియోగి

## అంకితం

అమరుడు కామ్రేడ్ శంకర్ గుహ నియోగి దివ్యస్మృతి ప్రేరణలో
నవ సమాజ నిర్మాణం కోసం అకుంఠిత దీక్షతో
పోరాటపథంలో సాగిపోతున్న ఛత్తీస్‌గఢ్ శ్రామిక ప్రజలకు ... ...

శ్రామిక సాహిత్య మాల - 1

# కార్మికోద్యమ కర్తవ్యాలు

రచన : కామ్రేడ్ శంకర్ గుహ నియోగి

అనువాదం : ఇంగువ మల్లికార్జున శర్మ




6-3-1243/116, డి. సంజీవయ్య నగర్,
హైదరాబాదు - 500 482

ప్రచురణ సం. 17.
శ్రామిక సాహిత్యమాల - 1

తొలి ముద్రణ 700 సాదా + 300 మేలి ప్రతులు
1993 సెప్టెంబరు

సాదా ప్రతి వెల పదహారు రూపాయలు
√ మేలి ప్రతి వెల నలభై రుపాయలు

ప్రతులకు 1 మార్క్సిస్టు అధ్యయన వేదిక
6-3-1243/116, హైదరాబాదు - 500 482
2 నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదుటి వీధి,
కాచిగూడ చౌరస్తావద్ద, హైదరాబాదు - 500 027
3 ప్రగతి బుక్ హౌస్,
మ్యూజియం రోడ్డు, విజయవాడ - 520 002
4 మైత్రీ బుక్ హౌస్, మసీదు వీధి,
ఏలూరు రోడ్, విజయవాడ - 520 002

లేజర్ కంపోజింగ్ · ప్రసాద్ గ్రాఫిక్స్, హిమాయత్ నగర్, హైదరాబాద్-29
ఆఫ్‌సెట్ ముద్రణ : వంశీ ఆర్ట్ ప్రింటర్స్, ఖైరతాబాదు, హైదరాబాదు-4
ఫాక్స్ 24 27 87, ఫోను 23 64 20.

# ముందు మాట

అమరుడు కామ్రేడ్ శంకర్ గుహ నియోగి రాసిన 11 వ్యాసాలను మార్క్సిస్టు అధ్యయన వేదికవారు తెలుగులోకి అనువదించి ప్రచురిస్తున్నారని తెలిసి మేము ఎంతో సంతోషిస్తున్నాము

కామ్రేడ్ నియోగి ఛత్తీస్‌గఢ్ కార్మికులు, కర్షకుల నాయకుడు ఈ దోపిడీదారీ వ్యవస్థను అంతంచేసి ఒక దోపిడీరహిత నవసమాజం నిర్మించాలనే విప్లవభావనలతో ఆయన ప్రజలను సదా ప్రేరేపిస్తూండేవాడు నేటికీ లక్షలాదిమంది కార్మికులు, రైతులు ఆయన భావనల వెలుగులో వర్గ పోరాట మార్గంలో పయనిస్తున్నారు

తెలుగు పీడిత ప్రజలకుకూడ ఆయన అభిప్రాయులు ప్రేరణ నిస్తాయనే మేము దృఢంగా విశ్వసిస్తున్నాము కా నియోగి రచనల ఈ సంకలనానికి విశేష జనాదరణ లభించాలని కోరుకుంటాను

ఎర్ర దండాలు.

22-7-1993 | మీ పోరాట సహచరుడు
---|---
రాజ్‌హరా - 491 228 | ఛబీలాల్ సాహు

ప్రధాన కార్యదర్శి

ఛత్తీస్‌గఢ్ గనికార్మిక సంఘం (CMSS)

* * * * *

# మా మాట

అత్యవసర పరిస్థితి రద్దు అయిన కొంతకాలాని కనుకుంటా, నేను శంకర్ గుహా నియోగిని మొదటగా ఢిల్లీలో కలిసాను అతనితో కొద్ది నిమిషాల సంభాషణతోనే అతని ధైర్యసాహసాలు, దీక్షా దక్షతలు, సూక్ష్మ గ్రహణశక్తి నాకు బాగా వ్యక్తమయిపోయాయి మామూలుగా అనేకమంది యువకుల్లాగే అతడూ మొదట తన బతుకు తెరువు కోసం వెదుకులాట ప్రారంభించాడు ఆ క్రమంలో అతడు అచిరకాలంలో జీవితం హక్కుకు సంబంధించిన రాజకీయాలతో తలపడాల్సి వచ్చింది కాని, అలాంటప్పుడు మనలో అత్యధికులు చేసేట్లు, చేసినట్లు అతడేమీ వైయక్తిక విమోచనకోసం తాపత్రయపడలేదు పై సంఘర్షణ క్రమంలో వ్యవస్థనే ఎదిరించి పోరే ప్రమాదకర మార్గంలోకి అతడు నుళ్లిపోయాడు ఇక నేనతడ్ని కలిసే నాటికే అతడు మధ్యప్రదేశ్‌లో ఒక పేరు పొందిన కార్మిక నాయకుడై వుండినాడు అయితే ఆర్థిక వాదాన్ని ఆచరిస్తూ, తద్వారా నిశ్చయంగా లభించే అధికార వైభవం, ముదుపుల మూటలు, సుఖసౌకర్యాలతో విలాసవంతంగా జీవితం గడిపే మామూలు రకం ట్రేడ్ యూనియనిస్టయితే కాడతడు లేదా తన ప్రత్యర్థుల్ని ఏరివేయడంద్వారా మంది మార్బలం పోగుచేసుకునే ట్రేడ్ యూనియన్ దాదా అయినా కాదు నిజానికి అతడు ఆచరణలో నెలకొల్పిన ట్రేడ్‌యూనియన్ సంస్కృతి ఈ రెండు రకాల అవాంఛనీయ కార్యకలాపాలను ఎండగట్టింది ఇలాంటి రాజీలేని నైతిక తత్వమే అతడికి ఎందరో శత్రువులను గడించిపెట్టిందికూడ

తాను మార్క్సిస్టునని, కాని ఏదో ఒక పెద్ద ఆర్గనైజేషనులో చేరి అందులో నాయకత్వ నిరంకుశత్వానికి అణకువగా తలవొగ్గుతూ, ఓ మోస్తరు శక్తియుక్తులతో పనిచేసే ఏదైనా ఒక విభాగపు అధిపతిగా వుండిపోవడ మనేది తనకు సుతరామూ యిష్టంలేదని అతడొక ఇంటర్వ్యూలో చెప్పివున్నాడు

అతడి అభిప్రాయాలన్నింటితో మన మేకీభవించకపోవచ్చు కాని, దోపిడీ వ్యవస్థను ఎదిరించి పోరే అతడి విప్లవ నిబద్ధతను, మనోనిబ్బరాన్ని మాత్రం మనం శంకించలేము పని స్థలంలో సైతం కార్మికునికి ఆత్మసమ్మాన హక్కు వుంటుందని అతడు వాదిస్తాడు ఈ అంశాన్ని నొక్కి చెప్పడమంటే మేనేజిమెంటు అనుసరించే అనేకానేక వృథా పద్ధతుల్ని ఎదిరించే హక్కుకూడ కార్మికులకు వున్నదనడమే పని పరిస్థితుల్ని విమర్శించే హక్కు కార్మికుల కున్నదని అతడు విశ్వసించాడు అలాగే నిర్వాహకుల వివేచన (managerial discretion) అని న్యాయశాస్త్రంలో చెప్పబడేది యజమానులకుమాత్రమే వుంటుందనే వాదనను అతడు ఖండితంగా నిరసించాడు

అర్జున్ సింగ్ మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రిగా వుండిన రోజుల్లో నియోగి ఒకసారి దల్లీ-రాజ్‌హారా కార్మికులందరినీ సమావేశపరిచి తామంతా యిక సారా తాగడం మానేస్తామనే దృఢ ప్రతిజ్ఞ వారిచే చేయించాడు తాము చేసిన ప్రతిజ్ఞను వారు పాలించే పద్ధతుల్ని సైతం అతడు కనిపెట్టాడు అతడిపై ఆ కార్మికులకు అపార భక్తివిశ్వాసా లుండినాయి ఆ మరుసటి రోజునుండి వారంతా సారా దుకాణాలకు వెళ్లడం పూర్తిగా మానేసారు అయితే ప్రభుత్వంవారు మాత్రం సారావ్యాపారాని కిలా తగిలిన దెబ్బను రాజ్యభద్రతకే ముప్పుగా పరిగణించి అతడ్ని విచారణ లేకుండానే ఖైదుచేశారు

అంటే, ప్రజాస్వామ్య హక్కులకోసం, రాజ్యాంగం సునిశ్చయం గావించిన హక్కుల కోసమే పోరాడినా, దాన్ని కూడ [ఈ పాలకులు] తిరుగుబాటు కార్యకలాపాలుగానే పరిగణిస్తారని, న్యాయపాలన పేరిట వాటిని చట్టవిరుద్ధ కార్యకలాపాలుగా ప్రకటిస్తారని, ఒకవేళ యిలా చేయడం తగదనిపిస్తే ప్రైవేటు బీభత్సాన్ని రెచ్చగొట్టి యిలాంటి ధీరుల నోళ్లు నొక్కివేస్తారని మనకు నియోగి జీవితమే పాఠాలు నేర్పుతుంది ఆనక యిలా ప్రైవేటు బీభత్సం సృష్టించిన నేరస్తుల్ని విచారించి, శిక్షించాల్సి వచ్చినప్పుడు ఈ రాజ్యమే అందుకు మన చట్టాలు తగినట్లుగా లేవని చేతులెత్తేసి అసహాయత నటిస్తుందికూడ

ఇటువంటి ధీరోదాత్త కార్మికనాయకుడి రచనలు అనువదించి తెలుగు పాఠకుల ముందుంచ గల్గుతున్నందుకు మేమెంతో సంతోషిస్తున్నాము ఒక కార్మికునిగా, ఒక ట్రేడ్ యూనియనిస్టుగా నియోగి జీవితానుభవాలు ఈ రచనల్లో ప్రతిఫలిస్తాయి అలాగే పాతచింతకాయ పచ్చడి తరహా ట్రేడ్ యూనియనిజం నుండి, నేటి వామపక్షాలను మింగేస్తున్న ఫార్ములా (చాదస్తపు) మార్క్సిజంనుండి బయటపడటానికి నియోగి చేసిన విశేష ప్రయత్నాలు ఎంతో ముఖ్యమైనవి అతడి యీ ప్రయత్నాలపై ఈ రచనలు వెలుగు ప్రసరింపజేస్తాయి

8-9-1993
హైదరాబాదు

కె.జి. కన్నభిరన్
[ప్రముఖ న్యాయవాది, పౌరహక్కుల నాయకుడు,
మార్క్సిస్టు అధ్యయన వేదిక జీవిత సభ్యుడు]

* * * * *

# అమరుడు శంకర్ గుహ నియోగి

డాక్టర్ పుణ్యబ్రత గుణ్

అది 1991 సెప్టెంబరు 28వ తేదీ తెల్లవారు జాము వేళ భిలాయి ఉక్కు నగరం, హుడ్కో కాలనీలోని ఒక ఇంటిలో ఒక కార్మిక నాయకుడు ఏదో పుస్తకం చదువుతూ అలాగే తలవాల్చి నిద్రపోతూండినాడు ఆకస్మికంగా మృత్యువు ముంచుకొచ్చింది భిలాయి పారిశ్రామికవేత్తల కిరాయిగూండాల రూపంలో తెరిచివున్న కిటికీ నుండి నిదురిస్తున్న ఆ కార్మికనాయకునిపై ఆ కసాయి గూండాలు తూటాలు పేల్చి ప్రాణాలు బలిగొన్నారు ఆ వ్యక్తి అలా చనిపోయాడు, కాని ఆయన భావాలు మాత్రం యింకా సజీవంగానే వున్నాయి ఆ వ్యక్తి ఏ ఆలోచనా ధోరణికి ఆధారస్రవంతిగా వుండినాడో ఆ స్రవంతి నేటికీ అక్కడ ప్రవహిస్తూనే వున్నది .

ఆయనే అమరుడు కామ్రేడ్ శంకర్ గుహ నియోగి నేడాయన ఒక వ్యక్తి కాదు ఒక శక్తి ఒక ఆలోచనా ధోరణి.

అవిభక్త భారతదేశపు అవిభక్త బెంగాల్ రాష్ట్రంలోని దినాజ్‌పూరు జిల్లాకు చెందిన ఒక గ్రామంలో ఒక దిగువ మధ్యతరగతి కుటుంబంలో 1943 ఫిబ్రవరి 14వ తేదీనాడు జన్మించాడీ శంకరుడు చిన్నప్పటి పేరు ధీరేశ్ గుహ నియోగి తండ్రి హేరంబకుమార్ గుహ నియోగి ఒక స్వాతంత్ర్య సమరయోధుడు తల్లి కల్యాణి ధీరేశ్ శైశవంలోనే కన్నుమూసింది

ధీరేశ్ ప్రాథమిక విద్య అస్సాంలోనూ, మాధ్యమిక (secondary) విద్య అసన్‌సోల్ బొగ్గు గనుల ప్రాంతంలోనూ సాగింది అస్సాంలోని మనోహర ప్రకృతిపరిసరాల ఆకర్షణ, అసన్‌సోల్ బొగ్గు గనుల శ్రామికుల జీవితవిశేషాల ప్రగాఢ ప్రభావం నియోగి కిశోరహృదయంపై బలమైన ముద్రవేశాయి

1959లో స్కూల్ ఫైనల్ పాసయిన పిదప నియోగి జల్పాయిగురి కాలేజీలో I.Sc.లో చేరాడు అప్పట్లో బెంగాలులో ఆహార ఆందోళన

(Food movement) ప్రబలంగా నడుస్తూండింది ఆ ఉద్యమ ప్రభావంలో నియోగి వామపక్ష బెంగాల్ రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ (B P S F)కు చేరువయ్యాడు అనతికాలంలోనే ఆ ఫెడరేషన్‌కు చెందిన ఒక కుశల కార్యకర్తగా రూపొందాడు అదే సమయంలో నియోగి మార్క్సిజం-లెనినిజం పట్ల ఆకర్షితుడయ్యాడు అతి పిన్న వయస్సులోనే అప్పటి అవిభక్త కమ్యూనిస్టు పార్టీ (C P I) సభ్యత్వం (student card-holder)గా అతనికి లభించింది

I Sc పాసయిన దరిమిలా పదిహేడున్నర సంవత్సరాల నవయువకునిగా నియోగి భిలాయికి వచ్చాడు 18 ఏళ్లు నిండగానే శిక్షణార్థి (trainee)గా భిలాయి ఉక్కు పరిశ్రమలో చేరాడు శిక్షణ పూర్తయిన పిదప కోక్ ఓవెన్ (coke oven) విభాగంలో ఒక నిపుణ కార్మికుడయ్యాడు కార్మికుడుగా పనిచేస్తూనే నియోగి ప్రైవేటుగా B Sc పాసయ్యాడు. ఆ తర్వాత A M I E డిప్లొమాకూడ సాధించాడు అప్పట్లో నియోగి కార్మికోద్యమ ఆర్గనైజరుగాను, విద్యార్థి ఉద్యమ ఆర్గనైజరుగాను రెండువిధాలా కర్తవ్యాలు నిర్వహిస్తూండేవాడు

1964లో భారత కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక వచ్చినప్పుడు నియోగి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) లో చేరాడు అనక 1967లో నక్సల్బరీ సాయుధ రైతాంగ తిరుగుబాటు ప్రేరణతో మార్క్సిస్టు పార్టీని వదిలి వచ్చి మొదట అఖిల భారత కమ్యూనిస్టు విప్లవకారుల సమన్వయ కమిటీ (A I C C C R) ఆధ్వర్యంలోనూ, పిదప కొంతకాలంపాటు C P I (M-L)లోనూ పని చేసాడు అయితే ప్రజాసంఘాలు, ప్రజావుద్యమాల సమస్యపై భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) నాయకత్వంతో ఆయనకు తీవ్ర విభేదాలు తలయెత్తాయి దానితో చాల అప్రజాస్వామిక రీతిలో ఆ పార్టీనుండి బహిష్కరణకు గురయ్యాడు అంతకుమునుపే 1968లో భిలాయి ఉక్కు పరిశ్రను (B S P)లోని కోక్ ఓవెన్ విభాగంలో ఒక గొప్పపోరాటం ఆర్గనైజు చేసినందుకుగాను ఆయన్ను B S P (Bhilai Steel Plant) నుండి తొలగించివేశారు C P I (M-L)నుండి తొలగించబడిన పిదప నియోగి తన సహచర కామ్రేడ్స్‌తో చర్చించి స్వతంత్రరూపంలో పనిచేయ నారంభించాడు 'నిప్పురవ్వ' (स्फुलिंग) అనే ఒక పత్రిక నడుపుతూ తన విప్లవ భావాలను కార్మికుల్లో ప్రచారం చేయసాగాడు

1970నుండి సుమారు 6 ఏళ్లపాటు నియోగి ఛత్తీస్‌గఢ్ జనజీవితాన్ని అవగాహనచేసుకునే ఉద్దేశ్యంతో పలుమార్లు వివిధవృత్తులు అవలంబిస్తూ ఛత్తీస్‌గఢ్ ప్రాంతంలో ఊరూరూ తిరుగుతూవచ్చాడు ఒకప్పుడు వ్యవసాయ కార్మికునిగా, మరొకప్పుడు చేపలుపట్టేవానిగా, ఒక సందర్భంలో అటవీశ్రామికు నిగా, మరో సందర్భంలో మేకల కాపరిగా, యిలాయిలా వివిధ రూపాల్లో పని చేస్తూ ఆయన ఛత్తీస్‌గఢ్ జనజీవితాన్ని అర్థం చేసుకోసాగాడు అదేసమయంలో ఆయన యిక్కడ అనేక ప్రజావుద్యమాల్నికూడ ఆర్గనైజుచేశాడు వాటిలో బస్తరు జిల్లా ఆదివాసుల పోరాటం, అధికవేతనాలకోసం దయిహాన్ గ్రామశ్రామికుల పోరాటం ముఖ్యమైనవి ఈ కాలంలోనే ఆయన దానీటోలా క్వార్ట్‌జైట్ గనుల్లో కార్మికునిగా పనికి కుదురుకుని అక్కడ ఒక కార్మిక సంఘం స్థాపించాడు అక్కడే ఆశ అనే మహిళా కార్మికురాలిని పెళ్లి చేసుకున్నాడు

1976లో అత్యవసర పరిస్థితి కాలంలో నియోగిని మీసా (M I S A) కింద అరెస్టుచేసి జైల్లో తోసారు 1977 మార్చి 3వ తేదీనాడు ఛత్తీస్‌గఢ్ మైన్స్ శ్రామిక్ సంఘ్ (C.M S S) స్థాపించబడింది ఉరకలువేస్తున్న గని కార్మికుల వుద్యమాన్ని అణచివేయడానికిగాను క్రూర ప్రభుత్వం 1977 జూన్ 2-3 తేదీల్లో కార్మికులపై కాల్పులు జరిపించి 11మందిని బలిగొన్నది తద్వారా ఒక బీభత్స వాతావరణం సృష్టించి కార్మికసంఘాన్ని భగ్నం గావించాలనేది ప్రభుత్వలక్ష్యం, అయితే అది నెరవేరలేదు పైగా ఈ కార్మిక సంఘం మెట్టుమెట్టుగా పురోగతి సాధిస్తూ మరింత బలవత్తరంగా రూపొందింది.

C M S S లో నియోగి ఒక కొత్త ప్రయోగం ప్రారంభించాడు కార్మికుల జీవితంలో రోజుకు 8 గంటల (పని గంటల) సమయాన్ని మాత్రమేగాక మొత్తం 24 గంటలను అంటే వారి జీవిత సర్వస్వాన్ని గురించి ఈ సంఘం పట్టించుకునేట్లు చేశాడు ఆరోగ్యం, విద్య, సంస్కృతి, ప్రకృతి పరిసరాలు, స్త్రీ విముక్తి, జాతీయ విముక్తి, రైతాంగ విమోచన మొదలైన అంశాలన్నీ C M S S. కార్యక్రమంలో పొందుపర్చారు ఈ సాంఘిక వుద్యమాలన్నింటిలో కార్మికనాయకత్వం సాధించారు

ఆరోగ్య వుద్యమం సందర్భంగా పారిశుధ్య వుద్యమం నడిపారు శ్రామికుల ఆరోగ్యం కోసం శ్రామికుల స్వీయ కార్యక్రమం నినాదంతో షహీద్ హాస్పిటల్ (అమరవీరుల స్మారక ఆస్పత్రి) నిర్మాణం జరిగింది వర్తమాన దోపిడీదారీ సమాజ వ్యవస్థ లోపలే ఒక దోపిడీరహిత సమాజ బీజం (embryo) లాగ ఈ షహీద్ హాస్పిటల్ పుట్టి పెరుగుతున్నది దీనివల్ల దోపిడీ దౌర్జన్యాలను నిర్మూలించే సమాజం కోసం పీడిత ప్రజలు పోరాటం చేసేందుకు ప్రేరణ లభిస్తున్నది కార్మికుల పిల్లలకు మంచి విద్య గరపడానికిగాను యూనియన్ 6 పాఠశాలలు కూడా నెలకొల్పింది ఈ వత్తిడితో ప్రభుత్వం, B S P మేనేజ్‌మెంట్లు కూడ కొన్ని పాఠశాలలు నెలకొల్పక తప్పలేదు కార్మిక, కర్షక కుటుంబాల పిల్లలకు వృత్తి శిక్షణ ఇచ్చేందుకుగాను షహీద్ ఇంజనీరింగ్ వర్క్ షాపు స్థాపించబడింది విప్లవకర ప్రజాతంత్ర సంస్కృతి ప్రచారం కోసం నవా అంజోర్ (ఉషాకిరణ) లోక్ సాంస్కృతిక్ మంచ్ ఏర్పాటయి చురుగ్గా పనిచేస్తున్నది ప్రకృతి పరిసరాల పరిరక్షణోద్యమంలో భాగంగా "మీ అడవుల గురించి మీరు తెలుసుకోండి" (Know you forest) వుద్యమం చేపట్టడం జరిగింది స్త్రీలపై దోపిడీని ఎదిరించి పోరాడడానికి మహిళా ముక్తి మోర్చా ఏర్పాటు చేయబడింది పీడిత జాతి ముక్తి కోసం ఛత్తీస్‌గఢ్ ముక్తి మోర్చా నెలకొల్పబడింది ఈ సాంఘిక వుద్యమాలన్నీ కూడ కార్మికవర్గ నాయకత్వంలోనే ముందుకు సాగుతూవస్తున్నాయి

"ఛత్తీస్‌గఢ్ వాసులంటే ఎవరు?" అనే ప్రశ్నకు జవాబుగా కామ్రేడ్ నియోగి ఒక విశిష్టమైన అభిప్రాయం వెలిబుచ్చాడు "ఛత్తీస్‌గఢ్ భూభాగంలో నివసిస్తూ శ్రమ ద్వారా జీవిక గడించుకునే వాళ్లు, ఛత్తీస్‌గఢ్ ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసం ప్రాణాలు బలియివ్వడానికి సిద్ధపడేవాళ్లు, ఆర్థిక పరిభాషలోగాని లేక మరోవిధంగాగాని భూస్వామ్య వర్గమని చెప్పబడే దానికిందకు రానివాళ్లు, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలను అంతం చేయగోరే వాళ్లు , ఒక ప్రజాస్వామిక ఛత్తీస్‌గఢ్ అభివృద్ధి పథంలో అడ్డంకులు కల్పించకుండావుండేవాళ్లు, ప్రపంచ కార్మికులందరి పట్ల సోదరభావంతో మెలిగే వారు - వీళ్లే ఛత్తీస్‌గఢ్ వాసులు" అని ఆయన పేర్కొన్నాడు

దీనికి తోడ్తోడుగా కా నియోగి రాజ్‌హారా కార్మికుల పోరాటాలెన్నింటికో విజయవంతంగా నాయకత్వం వహించాడు 1977కి పూర్వం మురాకార్మికుల రోజుకూలి 2-3 రూపాయలకు మించి వుండేది కాదు కాని, నేడో వారి కనీస రోజు కూలి సుమారు 90 రూపాయలదాకా వుంది నేడు రాజ్‌హారా కంట్రాక్టు కార్మికులకు సంబంధించి వారి కుటుంబాలకంతటికీ పూర్తి వైద్య సౌకర్యాలు, ఏటా ఐదు రోజులు పండగ శెలవులు, ఏడు రోజులు కాజువల్ లీవు, గ్రాట్యుయిటీ మొదలైనవన్నీ లభిస్తున్నాయి

కా నియోగి నడిపిన ఈ పోరాటాలన్నింటి వెనుక మనకు "పోరాటం మరియు నిర్మాణం" అనే రాజకీయ సిద్ధాంతం కనిపిస్తుంది "పోరాటం కోసం నిర్మాణం, నిర్మాణం కోసం పోరాటం" అనేది ఈ రాజకీయ సిద్ధాంతపు నినాదం పోరాటం మరియు నిర్మాణం అనే కా నియోగి రాజకీయ సిద్ధాంతం మార్క్సిజం - లెనినిజం మావో ఆలోచనా విధానానికి ఒక కొత్త దోహదం దీనిపై విస్తృత చర్చ జరగాల్సిన అవసరం వుంది.

రాజ్‌హారా కార్మికుల విజయవంతమైన ఉద్యమాల ప్రేరణతో మరి అనేక చోట్ల కార్మికులు కూడా ఛత్తీస్‌గఢ్ ముక్తి మోర్చాలో చేరారు హిర్రీ, బారాద్వార్, దానీటోలా, చాందీ డోంగ్రి, ఆరీ డోంగ్రిల వద్దగల గనుల్లో ఛత్తీస్‌గఢ్ గని కార్మిక సంఘం (C M S S) శాఖలు ఏర్పాటయినాయి రాజ్‌నంద్‌గావ్ B N.C మిల్లు కార్మికులు రాజ్‌నంద్‌గావ్ వస్త్ర పారిశ్రామిక కార్మిక సంఘం (R K M S) స్థాపించుకున్నారు ఈ కార్మికులు సంఘటితమై, పోరాట శిక్షణ పొందిన దరిమిలా చుట్టుపక్కల రైతాంగాన్ని, యితర శ్రామిక వర్గాలనుకూడ సంఘటితం చేస్తూవస్తున్నారు

ఎట్టకేలకు 1990లో భిలాయి పారిశ్రామికప్రాంత కార్మికులుకూడ ఛత్తీస్‌గఢ్ ముక్తిమోర్చా యొక్క ఎరుపు - ఆకుపచ్చరంగుల జెండాను చేతబట్టారు ప్రగతిశీల రవాణా కార్మిక సంఘం, ప్రగతిశీల సిమెంట కార్మిక సంఘం, ప్రగతిశీల ఇంజనీరింగు కార్మిక సంఘం, ఛత్తీస్‌గఢ్ కెమికల్ మిల్సు కార్మికసంఘం ఏర్పాటయినాయి జీవనయోగ్య వేతనాలు, శాశ్వత పరిశ్రమల్లో శాశ్వత కార్మికులు మొదలైన రాజ్యాంగబద్ధ హక్కులకోసం భిలాయి, ఉర్లా, టేడ్‌సరా, కుమ్హారీ, రీవా, గహన్, బలోదా బజార్‌లకు చెందిన కార్మికులు పోరాటాలు ప్రారంభించారు

ఈ న్యాయ సమ్మతమైన కార్మిక పోరాటాల్ని భగ్నం చేయడానికిగాను పెట్టుబడిదారీ వర్గాలు, ప్రభుత్వం, పోలీసులు, రాజకీయ నాయకుల దుష్ట సంఘటన లాఠీచార్జీలకు, కాల్పులకు, ఖైదు శిక్షలు తదితర దమన పద్ధతులకు పూనుకున్నది దీనితోకూడ కార్మికోద్యమం అణగకపోతే అప్పుడు కా నియోగిని 1991 ఫిబ్రవరి 4వ తేదీనాడు 32 తప్పుడు అభియోగాలపై అరెస్టు చేశారు ఏప్రిల్ 3వ తేదీనాడు కా నియోగి జైలునుండి విడుదల కాగానే ఆయన్ను ఛత్తీస్‌గఢ్ ప్రాంతపు ఐదు జిల్లాల నుండి బహిష్కరణ (Externment) గావించే ప్రయత్నాలు చేయసాగారు చివరికి 1991 సెప్టెంబరు 28వ తేదీనాడు కా నియోగి దారుణంగా హత్య గావించబడ్డాడు

అయితే కా నియోగి ఏ స్వప్నానికి ప్రతీకగా నిలిచాడో ఆ స్వప్నమైతే అంతంకాలేదు. ఆయన ఏ నూతన ఉద్యమ ధోరణికి ప్రతీకగా నిలిచాడో, ఆ ఉద్యమ ప్రవంతి నేడు మరింత ఉరవడితో, మరింత లోతుగా, మరింత విస్తృత ప్రాంతంలో వ్యాపిస్తూ వున్నది కా నియోగి భావనలు అజరామరమైనవి

[డాక్టర్ పుణ్యబ్రత గుణ్ గత అనేక సంవత్సరాలుగా నిస్వార్థ సేవాభావంతో, పోరాటదీక్షతో షహీద్ హాస్పిటల్‌లో పనిచేస్తున్నారు. కా. నియోగి సన్నిహిత సహచరుల్లో ఈయన ఒక ప్రముఖుడు.]

* * * * *

# ఇందులో... ...



★ ★ ★ ★ ★

# 1. భారతదేశ ట్రేడ్ యూనియన్ ఉద్యమ సమస్యలు

*[ఈ దేశంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి సుమారు వంద ఏళ్ల చరిత్ర వుంది ఇంగ్లండు, తదితర అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల [కార్మికోద్యమాల] ప్రేరణతో మనదేశంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం జన్మించింది అయితే (ఎక్కడైతే పారిశ్రామిక విప్లవాలు పూర్తయ్యాయో అలాంటి) అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలకు, మనలాంటి వెనుకబడిన దేశాలకు పరిస్థితుల్లో ఎంతో తేడావుంది వెనుకబడిన దేశాల్లోని ట్రేడ్‌యూనియన్ ఉద్యమం సకల దేశభక్తవర్గాల సంఘటనను ఏర్పాటుచేసి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం చేసే దిశలో ముందుకు సాగనట్లయితే, అప్పుడది నిస్సందేహంగా ఆర్థికవాద గోతిలో కూరుకుపోయి వికృతరూపం ధరిస్తుంది దురదృష్టవశాత్తూ మనదేశంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి ఈ దుస్థితే పట్టింది*

*వెనుకబడిన దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమాలకు సమస్యలు, బాధ్యతలు రెండూ ఎక్కువే ఈ పరిస్థితుల్లో మనదేశంలో ట్రేడ్ యూనియన్ వుద్యమ వికాసానికి సంబంధించి ఎంతో చర్చ జరగవల్సిన అవసరం వుంది ఈ అవసరాన్ని ఉపలక్షించి అమరుడు కా నియోగి రాసిన ఈ వ్యాసాన్ని ఛత్తీస్‌గఢ్ ముక్తిమోర్చాకు చెందిన లోక్ సాహిత్య పరిషద్‌వారు 1991 డిసెంబరులో ప్రచురించారు దాని తెలుగు అనువాదమే యిది ]*

ఏ దేశమైనా అభివృద్ధిచెందాలంటే అక్కడ వివిధ పరిశ్రమల స్థాపన, వాటి నిరంతర వికాసం ఎంతో అవసరం గత శతాబ్దాంతందాకా భారత దేశంలో పారిశ్రామికాభివృద్ధి చెప్పుకోదగినంతగా జరగలేదు ఇనుము, ఉక్కు, భారీయంత్రాలు, బట్టలు, మందులు మొదలైనవన్నీ ఇంగ్లీషువాళ్లు

తమదేశంనుండే తెప్పించుకుని వాటితో యిక్కడ తమ వృత్తులు, వ్యాపారాలు నడుపుకుంటూండేవాళ్లు లాభాలు పోగుచేసుకోవడమే ఆంగ్లేయుల ఏకైక లక్ష్యంగా వుండింది

1947 పిదప ఇంగ్లీషు వాళ్లయితే వెళ్లిపోయారుగాని వాళ్ల వ్యాపారాలు, పరిశ్రమలు మాత్రం యిక్కడ యథాతథంగా వుండిపోయాయి ఆ తర్వాత వివిధ బహుజాతి కంపెనీలు, ప్రత్యేకించి అమెరికా, జపాన్, ఫ్రాన్సు, జర్మనీ దేశాల కంపెనీలు, భారత పారిశ్రామికరంగంలో కాలుపెట్టాయి జనహంతక యూనియన్ కార్బైడ్ కంపెనీకూడ ఇటువంటి వాటిల్లో ఒక్కటే

ప్రస్తుతం భారతదేశంలోని పరిశ్రమలు ప్రధానంగా మూడురకాల యాజమాన్యాల చేతుల్లో వున్నాయి

(అ) ప్రభుత్వరంగ యాజమాన్యం : ఇప్పుడు మనదేశంలో ప్రభుత్వ రంగంలో 40 వేలకోట్ల రూపాయలకుమించిన పెట్టుబడులుగల పరిశ్రమలు, ఫ్యాక్టరీలు నడుస్తున్నాయి ఉక్కు, విద్యుత్తు, వస్త్రాలు, రైల్వేలు, బొగ్గు, చమురు మొదలైన పరిశ్రమల్లో అత్యధికభాగం ప్రభుత్వరంగంలోనే వున్నాయి

(ఆ) బహుజాతి కంపెనీలు : విదేశీ కంపెనీలు, ప్రత్యేకించి సామ్రాజ్యవాద దేశాలకు చెందినవి, సమస్త ప్రపంచంలోని పారిశ్రామిక సంస్థలపై తమ పట్టు నెలకొల్పుకుని వున్నాయి కేవలం సోషలిస్టు [అప్పటి సోవియెట్ యూనియన్, తూర్పు యూరప్, చైనా తదితర] దేశాల్లో మాత్రమే వాళ్ళపట్టు బలహీనంగావుంది సామ్రాజ్యవాదదేశాల యాజమాన్యవర్గాలు మనదేశంలోకూడ ఇంజనీరింగు, ఆటోమొబైలు, తేయాకు, రబ్బరు, మందులు, రసాయనాలు మొదలైన రంగాల్లో పరిశ్రమలు నడుపుతున్నారు

(ఇ) గుత్త పెట్టుబడిదారులు : ఇక మనదేశానికే చెందిన గుత్త పెట్టుబడిదార్లు మూడవ రకం బిర్లా, టాటా, దాల్మియా, కిర్లోస్కర్, మహేంద్ర తదితరులు వీరిలో భాగం దేశంలోని జౌళి, రసాయనాలు, [కొంతవరకు] ఉక్కు, తదితర అనేకానేక పరిశ్రమలు వీరి గుప్పిట్లోనే వున్నాయి

వీరేగాక మరికొందరు పెట్టుబడిదారులుకూడ స్వీయపరిశ్రమల వృద్ధికోసం నిర్విరామకృషి జరుపుతూనేవున్నారుగానీ వీళ్లు అంతగా సఫలంకాలేకపోతున్నారు వీళ్లు అసంఘటితంగా వుండడంమూలంగా ప్రభుత్వం, బహుళజాతి కంపెనీలు అవలంబించే విధానాలవల్ల దుష్ఫలితాలు పొందుతున్నారు దానితో వీళ్లు తమ కసినంతా తమ పరిశ్రమల్లో పనిచేసే కార్మికులపైకి మళ్లిస్తున్నారు

ఛత్తీస్‌గఢ్‌లో పరిశ్రమలు నానాటికీ వృద్ధి చెందుతున్నాయి ఇక్కడ పారిశ్రామికాభివృద్ధి అవకాశాలుకూడ పుష్కలంగా వున్నాయి ఇప్పటికే జరిగిన అభివృద్ధికూడ తక్కువేమీకాదు

---

*ఛత్తీస్‌గఢ్‌లో ఒక గుణాత్మక సాంఘిక మార్పు తీసుకురావడానికి వలసిన నిర్ణయాత్మక, ఉక్కు నాయకత్వాన్ని అక్కడి పారిశ్రామిక కార్మికవర్గం మాత్రమే సమర్పించగలదు.*

---

అయితే ఛత్తీస్‌గఢ్‌లో జరుగుతున్న పారిశ్రామికాభివృద్ధికి అనుగుణంగా యిక్కడి ప్రజల స్థితిగతులు మెరుగుపడడంలేదెందుకు అనే ప్రశ్న మాటిమాటికీ ఎదురవుతూంటుంది సంఘటిత కార్మికవర్గం మాత్రమే యీ ప్రశ్నకు తగిన జవాబు నివ్వగలదు సంఘటిత కార్మికవర్గం గనుక తమ కార్మికసంఘాన్ని ఒక పాఠశాలలానూ, ఒక ఆయుధంలానూ ఉపయోగిస్తూ పోరాటం-నిర్మాణం అనే సిద్ధాంత ప్రాతిపదికపై తమ కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోతూంటే అప్పుడు - అప్పుడు మాత్రమే, ఛత్తీస్‌గఢ్ కార్మికులు ఈ ప్రాంతంలో జరిగే అభివృద్ధితో సమంగా ఎదగగల్గుతారు స్వార్థపర పెట్టుబడిదారీ వర్గాల చేతుల్లో కిరాయితొత్తులుగా, ఆటబొమ్మలుగా వుండడంమాని ప్రతిరంగంలో తమ ప్రభావం నెలకొల్పుకొనగల్గుతారు

వివిధ పరిశ్రమలలోని ట్రేడ్‌యూనియన్లలో ఎక్కడా యిప్పటికీ ఒక ఉక్కు నాయకత్వం లేదు ఎందుచేత ? ఎందుకంటే .

1. దేశప్రజలు వివిధ వర్గాలుగా (కార్మికులు, కర్షకులు, పెట్టుబడి దారులు, చిన్న పారిశ్రామికవేత్తలు, భూస్వాములు మొదలైన వర్గాలుగా), వివిధ జాతికలు(nationalities)గా చీలివున్నారు (ఛత్తీస్‌గఢ్, మరాఠీ, ఒరియా, తెలుగు, తమిళ, బెంగాలీ, బీహారీ, పంజాబీ, జార్ఖండ్, ఉత్తరఖండీ మొదలైన జాతికలుగా - భారత దేశంలో యిలాంటి జాతికా సముదాయాలు 42 దాకా వున్నాయి) ప్రతివర్గానికి, అలాగే ప్రతిజాతికి వాటి ప్రత్యేక స్వీయ ప్రయోజనాలు వుంటాయి ఇప్పటిదాకా భారతదేశంలోని వివిధ పీడిత వర్గాలు, విభిన్న జాతికలకు చెందిన ప్రజలమధ్య ఒక శాస్త్రీయ పద్ధతిలో, ఒక శాస్త్రీయ ఆలోచనా విధానంతో ఐక్యతా ప్రాతిపదిక ఏదీ నెలకొల్పబడలేదు ఈ కార్యార్థం ట్రేడ్‌యూనియన్లు నిర్వహించాల్సివున్న ప్రత్యేక పాత్రను కూడ నిర్లక్ష్యం చేయబడింది

2 దోపిడీవర్గాలు తాము సృష్టించిన వ్యవస్థ ఆసరాతోనే సజీవంగా వుండగల్గుతున్నారు మనం ఏదైనా ఒక ప్రాంతం(దేశం)లోని దోపిడీ, పీడనల పునాదిపై నెలకొన్న దోపిడీ వర్గ వ్యవస్థను ధ్వంసం చేయాలంటే, అది అక్కడి ప్రజల అవసరాలకు అనుగుణంగా, అక్కడ లభించే ముడిసరుకుల్ని పూర్తిగా వినియోగించుకుంటూ ఒక నూతన ఉత్పత్తి విధానం ఆధారంగానూ, అక్కడి జనశక్తి ఆధారంగానూ ఒక ప్రత్యామ్నాయ వ్యవస్థ నెలకొల్పడానికి పోరాటం చేయడంద్వారా మాత్రమే సాధ్యం ఈ విషయమై సృజనాత్మకంగా ఆలోచించి, సరియైన దిశానిర్ణయించేసే ప్రయత్నం మన ట్రేడ్ యూనియన్లు ఎప్పుడూ చేయనేలేదు

3 సమాజంలోని కొన్ని వర్గాలు ఉన్న వ్యవస్థను అట్టిపెట్టాలని కోరుకుంటే, మిగతావర్గాలు ఈ వ్యవస్థను అంతంచేసి ఆ స్థానే ఒక కొత్త వ్యవస్థను ఏర్పాటు చేయగోరుతున్నాయి ఈ పరస్పర విరుద్ధ ప్రయోజనాలు గల వర్గాల్లో విజయం ఎవరిని వరిస్తుంది, ఎవరి మాట తుదకు చెల్లుతుంది అనే ప్రశ్నకు స్పష్టమైన జవాబు ఒకటే - బుద్ధిబలం, భుజబలం రెండూ ఏ వర్గానికి ఎక్కువ వుంటే అదే విజయం సాధిస్తుంది.

మరి వర్తమానంలో పెట్టుబడిదారీ, భూస్వామ్యవర్గాలు మాత్రమే అధికశక్తి సంపన్నులు, అధిక బుద్ధికుశలురు అనేది నిశ్చయమే కనుక వారి బుద్ధిబలంతో తూగేటట్లు మనం మన బుద్ధికుశలతను పెంపొందించుకొవాల్సి వుంటుంది ఇందుకుగాను మనం ఒకే సమయంలో నాలుగు క్రియలు - వర్గపోరాటం, ఉత్పత్తి కొరకు పోరాటం, శాస్త్రీయ ప్రయోగం, చరిత్ర అధ్యయనం - నిర్వర్తించాల్సివుంటుంది మన శక్తియుక్తుల్ని వికసింపజేసుకోవాలంటే మనం నిరంతరం విస్తృత ప్రజానీకాన్ని జాగృతంచేసే కార్యక్రమంలో నిమగ్నమై వుండాలి అయితే నేటి ట్రేడ్‌యూనియన్ వుద్యమం ఈ పద్ధతులు ప్రయోగించకపోవడమే కాదు; ఈ మాటలేవీ దానికేమాత్రం నచ్చడంలేదు కూడ

చరిత్రలో సంభవించే ప్రతి సంఘటననుండి, భౌతిక పరిస్థితుల విశ్లేషణద్వారా పెట్టుబడిదారీ వర్గాలు, అన్ని రకాల సామ్రాజ్యవాదులు అయితే పాఠాలు నేర్చుకొంటున్నారుగాని, నేటి భారత ట్రేడ్‌యూనియన్ ఉద్యమకారులు మాత్రం సదా పాత విషయాలు పునశ్చరించడానికే అలవాటు పడిపోయారు ఈ పద్ధతి పూర్తిగా అశాస్త్రీయమైనది

4 మనలాంటి వెనుకబడిన దేశంలోని పెట్టుబడిదారీవర్గాలు కార్మికులకు ఏవైనా ట్రేడ్‌యూనియన్ హక్కులు ప్రసాదిస్తున్నాయంటే అది -

(అ) దోపిడీ, పీడనలతో విసిగివేసారి కార్మికులు ఏదైనా ఆకస్మిక తిరుగుబాటు చేసే అవకాశం లేకుండా చేయడానికి,

(ఆ) యజమానివర్గాలు పరిశ్రమల్లో నిర్దేశించే నిర్బంధపూరిత నియమ నిబంధనలను, రకరకాల యితర చట్టపరబంధనాలను ఈ ట్రేడ్‌యూనియన్ నాయకులచే నచ్చజెప్పించడంద్వారా కార్మికులు వాటికి స్వచ్ఛందంగా ఒప్పుకొనేటట్లు చేయడానికి,

(ఇ) కార్మికుల ఆలోచనాసీమను వారి పరిశ్రమలమట్టుకే పరిమితం చేయడానికి, కేవలం ఆర్థికపోరాటాల దిశగా కార్మికుల్ని ప్రోత్సహించడానికి,

(ఈ) [శాంతియుత] సహజీవన సూత్రాన్ని
భావనలను] అన్నిస్థాయిల్లో ప్రచారంచేసి, పాదుకొనజేం

ఈనాడు మనదేశంలోని కేంద్ర కార్మిక సంఘా
నివర్గాల పై ఉద్దేశ్య పరిపూర్తికే పాటుపడుతున్నాం

5 వివిధ జాతికలున్న మనదేశంలో యిప్పుడు
విధానంకూడ ట్రేడ్‌యూనియన్లు బలపడకుండా అడ్డ
కారణంగా వుంది

బ్రిటిషు సామ్రాజ్యవాదులు 1917 రష్యా అక్టోబ
తగు గుణపాఠాలు తీసుకున్నారు. అలాంటి విప్లవం
సంభవిస్తుందేమోనన్న భయంతో, అలా రాకుండా
వారు ఒక ఉద్యోగకల్పనావిధానం (employment
దించారు భారత దేశంలో జనతా ప్రజాస్వామిక
నాయకత్వంలో వచ్చి విజయవంతం అవుతుందేమో,
వారు తగు దూరదృష్టితో ఈ చర్య తీసుకున్నారు
అనుగుణంగా ఏదైనా ప్రాంతంలోని పరిశ్రమల్లో ఆ ప్రా
అన్యప్రాంతాలనుండి వచ్చినవారిని నియమించడం
మధ్యప్రదేశ్‌లోని, జార్ఖండ్‌లోని బొగ్గుగనుల్లో గోరఖ్
అదీ కేంద్ర రిక్రూట్‌మెంట్ ఆఫీసుద్వారానే - నియమి
బెంగాల్‌లలోని తేయాకు తోటల్లో ఛత్తీస్‌గఢ్, జ
నియమించారు పోతే జార్ఖండ్, బెంగాల్‌లలోని బొగ్గు
గోరఖ్‌పురీ కార్మికుల్ని తీసుకున్నారు

ప్రాంతాల అభివృద్ధిలో ఆయా ప్రాంతప్రజల భాగ
అది జాతీయాభివృద్ధికి గ్యారంటీ కాగలదు ప్రాంతా
ప్రాంతాలనుండి వచ్చిన కార్మికులు అంత శ్రద్ధాస
ఎందుకంటే, వారి జాతితత్వం, వారి ఆర్థిక నేపథ్యం
కనుక పరిశ్రమల్లో పనిచేసే కార్మికుల్లో అత్యధిక భాగ
లనుండి వచ్చిన వారైవుండడం వల్ల ఈ కార్మికవర్గం
నాయకత్వం వహించే మాట అటుంచి, అసలా

దూరంగా వుండిపోతుంది ఈ కార్మికుల ఆర్థిక, సాంఘిక మూలాలు మరెక్కడోవుండడం మూలంగా వాళ్లు స్థానిక అభివృద్ధి కార్యక్రమాలు, అభివృద్ధి యోచనలతో తమ మనసు కలుపుకోలేకపోతారు ఫలితంగా చాల వికృతమైన, ఎంతో అసమతూకంగల ఒక రకమైన అభివృద్ధిమాత్రమే సంభవిస్తుంది.

భారతదేశంలోని వివిధ పరిశ్రమలు, ఫ్యాక్టరీలలో తెల్లదొరలు అవలంబించిన ఈ ఉద్యోగకల్పనా విధానాన్నే నేటి నల్లదొరలు సైతం ఎంతో భక్తివిశ్వాసాలతో అమలుచేస్తున్నారు భిలాయిలోని కార్మికుల్లో 90 శాతం మందిదాకా యితర ప్రాంతాలనుండి వచ్చినవాళ్లే అలాగే బొకారోలోనూ దక్షిణ బీహార్‌కు చెందిన కార్మికులు 20 శాతానికి మించిలేరు అదేవిధంగా దుర్గాపూర్ ఉక్కుపరిశ్రమలోకూడ స్థానిక ప్రజల నియామకం తక్కువగా వున్నది ఈ యథార్థమే అక్కడి గ్రామసీమల్లో ప్రత్యేక జార్ఖండ్ రాష్ట్రం కావాలనే డిమాండ్‌ను ఉధృతం గావించింది ఇక టాటా పరిశ్రమల్లో కూడ జార్ఖండ్‌వాసులు మీకు అతితక్కువగానే కనిపిస్తారు

ఒకవైపు అన్నిహంగులు, సౌకర్యాలతో నిండి, మట్టితొట్టెలో శ్రద్ధగా పెంచిన అందమైన గులాబీ మొక్కలాగ అలరించే ఉక్కునగరం, మరోవైపు దారుణ దారిద్ర్యాంధకారంలో మగ్గే గ్రామసీమలు ఒకవైపు అధికవేతనాలు పొందే సంఘటిత కార్మికవర్గం, మరోవైపు గ్రామసీమల్లో పస్తులు, ఆకలిచావుల పాలయే వ్యవసాయ కార్మికులు, పేదరైతులు, నిరుద్యోగులు ఇటువంటి క్రమంద్వారానే పాలకవర్గం కార్మికుల్ని రెండు ముక్కలుగా చీల్చి వుంచుతుంది. ఆఫీసర్లు, మేనేజిమెంటు ఉద్యోగులు దాదాపు అందరూ బయటిప్రాంతాలనుండి వచ్చినవాళ్లయి వుంటారు వాళ్లకు ప్రాంతీయాభివృద్ధిపట్ల ఎలాంటి శ్రద్ధాసక్తులు లేకపోవడమేకాదు; తెలిసి తెలిసీ కావాలని ప్రాంతీయాభివృద్ధికి వలసిన సాధన సంపత్తిని నాశనం చేసివేస్తూంటారుకూడ

ఈ పరిశ్రమల్లో ఉత్పత్తి మొదలైనపిదపే ట్రేడ్ యూనియన్లు వెలకొంటాయి కనుక ఈ ట్రేడ్‌యూనియన్లు మురికినీటిలోని క్రిమికీటకాల్లా అక్కడికక్కడే మొసలుతుంటాయి ఇలాంటి స్థితిగతులు

వెలకొల్పడంలో కేంద్ర కార్మిక సంఘాలు ప్రభుత్వానికి, పెట్టుబడిదారులకు పూర్తి మద్దతు నిస్తుంటాయి కూడ

6 ట్రేడ్ యూనియన్ల విధానాలు, కార్యక్రమాలుకూడ యితరేతర రాజకీయ సిద్ధాంతాలలాగ ఆలోచనాపరంగా దివాలాతీసి వున్నాయి ట్రేడ్ యూనియన్ అంటే కార్మికుల సంఘటన వర్తమాన వ్యవస్థకు గోరీకట్టి నూతన రాజ్యాధికారం నెలకొల్పుకునే దిశగా కార్మికవర్గ శాస్త్రీయ సిద్ధాంతం వారిని (ట్రేడ్ యూనియన్లను, కార్మికులను) ప్రేరేపిస్తుంది అది పాతను తుంచి, క్రొత్తను నిర్మించే రాజకీయ సిద్ధాంతం ట్రేడ్ యూనియన్లుకూడ యిదే సిద్ధాంతం వెలుగులో పనిచేస్తాయి, చేయాలని మనం ఆశించడం సహజమే అయితే తనకే గోరీకట్టే యిలాంటి ట్రేడ్‌యూనియన్లను ప్రస్తుత వ్యవస్థ సమ్మతించజాలదు ట్రేడ్‌యూనియన్ కార్యకలాపాలు తనకు వ్యతిరేకంగా నడుస్తున్నాయని గమనించినప్పుడు ఈ వ్యవస్థ ట్రేడ్ యూనియన్ చట్టాలనే తుడిచివేయగలదు కాని నిజమైన పోరాటశీల ట్రేడ్ యూనియన్లకు సంబంధించిమాత్రం అవి సమాజంలోని అత్యంత అభివృద్ధినిరోధకమైన, మిక్కిలి ద్వేషింపబడే శక్తుల్ని తమ శత్రువులుగా నిర్దేశించుకుని యితర అన్ని వర్గాలతో సామరస్యసహకారాలు నెలకొల్పుకునే ఒక నూతన సైద్ధాంతిక ప్రాతిపదిక ఏర్పరుచుకుంటాయా లేదా అనే దాన్ని బట్టి; అభివృద్ధినిరోధకుల మధ్యవేగల పరస్పరవైరుధ్యాలను తీవ్రతరం చేయడానికి కృషిచేస్తూ, ఒక మెతకపాటి (flexible) పనిపద్ధతితో ప్రతి సమస్యలోనూ అగ్రగామిపాత్ర వహిస్తాయా లేదా, తద్విధంగా ఒక మౌలిక సాంఘిక పరివర్తన దిశగా కార్మికవర్గాన్ని జాగృతం చేస్తాయా, లేదా అనేదాన్నిబట్టి అవి ఉంటాయా, ఊడుతాయా అనే విషయం ఆధారపడుతుంది

కాని, నేటి ట్రేడ్‌యూనియన్లు మట్టుకు పైదిశలో ఏదో ఒకరకం విధానం అవలంబించడానికి బదులు ప్రభుత్వపు రాజకీయ వత్తిడిని ఉపయోగిస్తూ, మేనేజ్‌మెంటుతో లాలూచీపడుతూ, సంఘబలం చూపించి బేరసారాలాడుతూ దుకాణాలు నడుపుకుంటున్నాయి వాటి వాటి పైపైకి అగుపించే రూపాలేమైనా కావచ్చుగాక, నేటి కేంద్ర కార్మిక సంఘాలన్నీకూడ యిలాంటి దళారీ వ్యవహారాల్లో ఛాంపియన్‌షిప్ గెలుచుకోవడానికే తీవ్రంగా పోటీపడుతున్నాయని చెప్పవచ్చు

7 పోతే రాజకీయ పండితుల విశృంఖలత్వం కారణంగాకూడ భారతదేశ ట్రేడ్ యూనియన్ వుద్యమం సరియైన తీరులో వికసించలేకపోయింది ఆంగ్లేయులకాలంలో ఐటక్ (A I.T U C)కి చెందిన కమ్యూనిస్టు విభాగం పోషలిస్టు విప్లవ నినాదాన్ని చేపట్టి ఒక తీవ్రవాద పంథా నవలంబిస్తూ కార్మికోద్యమాన్ని సర్వనాశనం చేసివేసింది (షోలాపూర్ చరిత్ర యిక్కడ గమనార్హం) 1946-47లో కూడ బి టి రణదివే పోషలిస్టు విప్లవం పేరిట తెలంగాణా సాయుధ పోరాటాన్ని తప్పుదారి పట్టించాడు. అదే సమయంలో ఐటక్‌కు చెందిన కాంగ్రెసు విభాగం యాజమాన్యవర్గాల తొత్తులా వ్యవహరిస్తూ పరిశ్రమల్లో పోరాటాలు సాగనీయకుండా అడ్డుకుంటూ వచ్చింది ఈ ముక్క స్వాతంత్ర్యానంతరం ఇంటక్ (I N T U C)గా మారి సర్కారీ ట్రేడ్‌యూనియన్ రూపం ధరించింది మరి నేడు కమ్యూనిస్టు, మార్క్సిస్టు పార్టీల యూనియన్లుకూడ ఇంటక్ యొక్క ఉదార వైఖరికి ఉబ్బితబ్బిబ్బయిపోతున్నాయి పోతే చారు మజుందార్ నాయకత్వంలోని నక్సలైటు వుద్యమం [మొదట్లో] కార్మిక వర్గంలో కొత్త ఆశలు రేపింది గాని అచిరకాలంలో వారుకూడ ట్రేడ్‌యూనియన్ల సంస్కరణవాద (అవకాశవాద) నాయకత్వానికి వ్యతిరేకంగా పోరాడడం మాని, "ట్రేడ్‌యూనియన్లను బహిష్కరించండి !" అనే ఒక పలాయనవాద విధానం అవలంబించారు

విశృంఖల వర్తనులైన ఈ రాజకీయ పండితుల దయాదాక్షిణ్యాల మూలంగా మనదేశంలోని ట్రేడ్ యూనియన్లు ఎప్పుడేగానీ, ఎక్కడేగానీ శ్రామిక ప్రజానీకం యిష్టాయిష్టాలకు అనుగుణంగా తమను మలుచుకోలేక పోయాయి ఇదంతా 'వచ్చిన వాడూ ఏడ్చాడు, రానివాడూ ఏడ్చాడు' అన్నట్లయింది. నేటికీ ఏ ట్రేడ్‌యూనియన్ సభ్యులైనాగానీ తమ వ్యక్తిగత ప్రయోజనాలు, తమ ప్రత్యేక పరిశ్రమలోని కార్మికుల ప్రయోజనాలను యావద్దేశ ప్రజానీకం ప్రయోజనాలతో మేళవించి, అంటే విశేషాన్ని (ప్రత్యేకతను), సాధారణత్వంతో మేళవించి చూడలేకపోతున్నారు కనుకనే పశ్చిమ బెంగాల్ పారిశ్రామిక కార్మికుల్లో *"ఓటుకు మూడురంగుల జెండా, కూటికి ఎర్రజెండా"* అనే నానుడి వ్యాప్తిలో వుంట ఈ వరసలోనే యిప్పుడు *"దెబ్బకొట్టాలంటే సొంతసోదరుడ్నే !"* అనే లోకోక్తి కూడ పుట్టుకొచ్చింది

భారతదేశ ట్రేడ్ యూనియన్లు రాజకీయ పార్టీలపై ప్రభావం చూపించ లేకపోయాయి సరిగదా, నిరాశోపహతులైన రాజకీయ నాయకులే ట్రేడ్‌యూనియన్లపై పట్టు సాధించి కార్మికోద్యమాన్ని సంకుచిత ప్రయోజనాల విషవలయంలో దూర్చివేశారు

8 కార్మిక వర్గం చేతిలోని ఆయుధం ట్రేడ్ యూనియన్ ఈ ఆయుధాన్ని సరిగ్గా ఉపయోగించడానికి ఒకే పద్ధతి - కేంద్రీకృత ప్రజాస్వామ్యం. పోరాట నిర్ణయం, నిర్మాణ సమస్యలపై తీర్పు ప్రజాస్వామిక పద్ధతిలో చేయాలి తీసుకున్న నిర్ణయాలను కేంద్రీకృత పద్ధతిలో అమలుచేయాలి అయితే భారీ సంఖ్యలో వున్న లేక దూరదూరంగా వెదజల్లబడివున్న కార్మికులకు సంబంధించి ఈ పద్ధతిని ఉపయోగించడం సాధారణంగా లేక అప్పుడప్పుడూ అతి కష్టమవుతుంది ఇలాంటి పరిస్థితిలో వివిధ యూనిట్లలో విస్తృత చర్చలు జరిపి 'ప్రజలనుండి ప్రజలవద్దకు' పద్ధతిలో కార్మికులకు తగు భాగస్వామ్యం కల్పించడం, సమస్యలపట్ల వారికి తగు చైతన్యం కలిగించడం అవసరమవుతుంది

---

ట్రేడ్ యూనియన్లు నడిపేందుకు సరియైన పద్ధతి కేంద్రీకృత ప్రజాస్వామ్య పద్ధతి ఒక్కటి మాత్రమే.

---

కాని నేటి ట్రేడ్‌యూనియన్లేవీ ఈ పద్ధతిని ప్రయోగించడం లేదు కాగా నాటిల్లో నిర్ణయాలు పై నాయకత్వంనుండి కింది శ్రేణులకు రుద్ద బడుతాయి కార్మికుల యథార్థ సమస్యలను, క్రూర దోపిడీ వర్గాలు అమలు జరిపే నిర్బంధం, దాన్ని ఎదిరించవల్సిన కార్మికవర్గ ఆలోచనా విధానం మొదలైన అంశాలను ట్రేడ్ యూనియన్ల నాయకత్వం నిర్లక్ష్యం గావిస్తూంటుంది. తద్విరుద్ధంగా కార్మికచట్టాలపై, వాటిని అమలుచేసే పరిపాలనాయంత్రాంగంపై, చట్టవ్యవస్థ సంబంధిత అవసరాలపై ఈ ట్రేడ్‌యూనియన్లు అధిక శ్రద్ధాసక్తులు చూపుతుంటాయి పై అంశాల్లో కార్మికుల అజ్ఞానం, అసహాయతలను ఆసరాగా తీసుకుని నిరంకుశాధికార లేదా కేవల కేంద్రీకృత పద్ధతులద్వారా సమస్యలను చేబట్టడమో లేక తిరస్కరించడమో చేస్తుంటారు ఈ విధంగా నేటి ట్రేడ్‌యూనియన్లు

ఒక దారుణ పరిస్థితి సృష్టించాయి ఇందుమూలంగా ట్రేడ్ యూనియన్లను అట్టిపెట్టివుంచుకోవడంవల్ల ఆఖరుకు పెట్టుబడిదారుల అవసరాలు సైతం తీరడం లేదు ఇక వాటిని శ్రామిక ప్రజల చేతుల్లో ఆయుధాలుగా వాడడం గురించి ప్రస్తావించడమెందుకు?

కార్మికులలో ఈ ట్రేడ్‌యూనియన్లకు ఎలాంటి పలుకుబడి వుండ డంలేదు కార్మికులు [ఉత్సాహంగా] ట్రేడ్ యూనియన్లలో సభ్యులు కావడంగాని, సభ్యత రుసుము చెల్లించడంగాని వుండదు కాగా సభ్యత్వ రిజిష్టర్లను దొంగ పేర్లతో నింపివేయడం కద్దు ఒకే కార్మికుని విషయమై మా సభ్యుడంటే, కాదు మా సభ్యుడని అనేక ట్రేడ్‌యూనియన్లు కుమ్ములాడుకోవడం కూడ అప్పుడప్పుడూ జరుగుతూంటుంది అంతా మోసమే - తాను వివిధ ట్రేడ్ యూనియన్లవారిని బురిడీ కొట్టించానని కార్మికుడు నవ్వుకుంటే, కార్మికులు మూర్ఖులయిపోయారు లెమ్మని ట్రేడ్‌యూనియన్ల నాయకులు నవ్వుకుంటుంటారు. ఈ ఉభయులూ పరమ మూర్ఖులేనని పెట్టుబడిదారులు నవ్వుకొంటారు, వీరివల్ల తమకు అధిక భద్రత లభించిందని భావిస్తారు ఈ ట్రేడ్ యూనియన్ నాయకులు కార్మికుల అతిసామాన్య సమస్యనుసైతం గుత్తపద్ధతిలో (కంట్రాక్టు పద్ధతిన) చేబట్టుతుంటారు ఈ నిరంకుశాధికార పద్ధతి వల్ల యజమానుల లక్ష్యాలుకూడ పరిపూర్తి చెందక పోయినా వాళ్లు (యజమానులు) సంతోషంగానే వుంటారు వాళ్లు (యజమానులు) తమవద్దగల కార్మికుల్లోంచి తమకు యోగ్యులనిపించినవారిని ఒక 10-2( శాతంమందిని ఎంపిక చేసుకుంటారు అలాంటివారికే ప్రమోషన్లు, ఓవర్‌టైములు, పనిచేయకున్నా రాయితీలు, తదితర సౌకర్యాలు కల్పిస్తూ మేనేజిమెంటు పరిశ్రమ నిర్వహణలో తనకు మద్దతువిచ్చే ఒక ముఠాను సృష్టించుకొంటుంది ఈ ముఠావాళ్లు ప్రతి యూనియన్‌లోనూ దూరుతుంటారు అలాంటి పరిశ్రమలో కార్మికుల పరిస్థితి బానిసలకంటే కనాకష్టమైపోతుంది నిరంకుశ పద్ధతులు విస్తృతంగా అమలులో వుంటాయి పోతే యజమానుల కాళ్లునాకే ఈ కుక్కలు కూడ తమ మెడలకు తగిలించిన పటకాలనే పూలమాలలుగా భావిస్తూ, అందువల్ల తమకు గొప్ప గౌరవసన్మానాలు లభించినట్లు పొంగిపోతారు

నిరంకుశాధికార లేక కేంద్రీకృత పద్ధతితోబాటు మరొక ప్రమాదం కూడ మనకు కనిపిస్తుంది అదే ట్రాట్స్కీవాద పంథా కేవల ప్రజాస్వామ్య విధానానికి అవసరానికి మించి ప్రాధాన్యం యిచ్చే అతి ప్రజాస్వామిక పంథా యిది ఆ మాటకు ఈ పద్ధతి అయినా ప్రజాస్వామ్యక్రమాన్ని కేవలం పని పద్ధతుల్లోనే అమలు చేస్తుందిగాని పని విధానం మాత్రం ఎక్కడో అదృశ్యస్థలంనుండి ఊడిపడినట్లు వచ్చి గుద్దెరజేస్తుంటుంది అయితే నిర్మాణపు విశాల ప్రమాణాన్ని సాకుగా చూపించి ఈ విషయం దాటవేస్తుంటారు ఇక వీళ్ళు పనిపద్ధతుల్లో ప్రజాస్వామ్యక్రమం అమలు చేయడం గురించంటారా, ఆ క్రమంలో ప్రజలు మాయమై కేవలం వివాదాలు మెండుగా సాగుతాయి ఎన్ని తలకాయలున్నాయో అన్ని అభిప్రాయాలు, అన్ని పరిష్కారమార్గాలు సూచించబడుతుంటాయి ఈ విధంగా ఒక బహుకేంద్రక పరిస్థితి [బహు నాయకత్వ ప్రమాదం] తలయెత్తి, కార్మిక సంఘ నిర్మాణం కేన్సరుతో బాధపడే శరీరంలా అవుతుంది నేటి అనేక పోషలిస్టు ట్రేడ్ యూనియన్ల దుస్థితి యిదేనండి ఈ రకం ట్రేడ్‌యూనియన్లకు పెట్టుబడిదారులు అధిక ప్రాముఖ్యత నిస్తుంటారుగాని నిజానికి నిరంకుశాధికార ట్రేడ్ యూనియన్లే కార్మికవర్గ ఐక్యతా భావనవల్ల లాభపడుతూ, అధిక విజయాలు సాధిస్తుంటాయి

9 కార్మిక వర్గానికి చెందిన ఒక సరియైన రాజకీయ పార్టీ లేకపోవడం వల్ల, సరియైన ట్రేడ్‌యూనియన్లు లేకపోవడం వల్ల నేడు నాయకుడు అనే పదం అపఖ్యాతి పాలయివుంది పరమ స్వార్థపరులు, నీతిమాలిన విశృంఖల జీవితం గడిపేవారు అయిన సంఘవ్యతిరేక శక్తులు, క్రూరకృత్యాలు జరిపే గూండాలు కూడ నేడు మైకుముందు నిలబడి నోటికి వచ్చినట్లు వాగుతున్నారు; పోలీసు అధికారులను మచ్చికచేసుకుని పదవీ సింహాసనాన్ని పట్టుజారకుండా తమ చేతుల్లో వుంచుకొంటున్నారు; దేశరాజధానిలో, రాష్ట్ర రాజధానుల్లో ప్రముఖ వ్యక్తులతో, ముఖ్య కేంద్రాలలో సంబంధాలు పెట్టుకొని ఫక్తు పైరవీకారులుగా మారి సాధారణ ప్రజల్ని హామీలు, ఓదార్పుల విషవలయంలో యిరికించి తిప్పుతున్నారు ఇలాంటి వ్యక్తులే నేడు నాయకులుగా చెలామణీ అవుతున్నారు కనుక ఇలాంటి నాయకుల్ని ప్రజలు తీవ్రంగా [మనోవాక్కాయకర్మలద్వారా] అసహ్యించుకొంటున్నారు.

మరొక రకం నాయకులున్నారు వీళ్లకు మార్క్స్, లెనిన్‌ల పుస్తకాల పేర్లు కొన్ని తెలిసివుంటాయి సందర్భం వచ్చినా, రాకున్నా ఆ పేర్లను ఉల్లేఖిస్తూ తమ పాండిత్యాన్ని చాటుకుంటూవుంటారు దరఖాస్తులు, వినతిపత్రాలు (అపీళ్లు) రాయడంలో వీరు నిపుణులై వుంటారు కాని వీళ్లు ఉత్పత్తి వ్యవహారాలపట్ల విముఖులైవుంటారు పోతే ఇంటి తగవుల్ని సైతం అంతర్జాతీయ, చరిత్రాత్మక ఘటనలతో ముడిపెట్టి, ఆ వెలుగులో వ్యాఖ్యానంచేస్తుంటారు వాదాలు, చర్చల్లోనే వీళ్లు ఎన్ని రాత్రులయినా ఊదేస్తారు కాని చెప్పింది చేయరు చేసేది చెప్పరు వీళ్లవద్ద సిరిసంపదలు అంతగా వుండవుగాని సుఖమయ జీవితం పట్ల వ్యామోహంమాత్రం బాగానే వుంటుంది ఇలాంటి నాయకుల్ని వారికింద వుండే కార్మికులు విశ్వసించరు ఇక ఈ నాయకులకూ తమ కార్మికులంటే నమ్మకం వుండదు ఇలాంటి నాయకులతో వెలిగిపోయే ట్రేడ్ యూనియన్లు కార్మికుల జీవితాల్ని దుర్భరం గావించివేస్తాయి

---

మామూలు మనుషుల తప్పులవల్ల హెచ్చు మందికి నష్టం కలగక పోవచ్చు గాని నాయకుల తప్పుడు పనుల వల్ల లక్షలాది ప్రజల జీవితాలకు తీవ్ర నష్టం వాటిల్లవచ్చు. నాయకత్వం తన వర్గంలో అత్యధికవర్గ చైతన్యంగల అగ్రగామి అంశమై వుండాలి.

---

సంఘ నిర్మాణం (ఆర్గనైజేషన్) అయినా, ఉద్యమ నిర్వహణ అయినా నాయకత్వ సమస్య ఒక మహత్తర సమస్య మామూలు మనుషుల తప్పుడు ఆలోచనలు లేక తప్పుడు పనుల వల్ల అంత ఎక్కువమంది ప్రజలకు నష్టం కలగకపోవచ్చు గాని ఈ నాయకుల తప్పుడు ఆలోచనలు, తప్పుడు పనుల వల్ల లక్షలు, కోట్లాది ప్రజల జీవితాలపై తీవ్ర దుష్ప్రభావం పడగలదు అందుకే నాయకత్వం గురించి సరైన ఎరుక అవసరం నాయకత్వం తన వర్గంలో మిగతా అందరికంటె అధికవర్గ చైతన్యంగల అంశమై వుండాలి ఇది కార్మికవర్గానికి ఎంత అవసరమో, పెట్టుబడిదారీ వర్గానికైనా అంతే

అందరికంటే ఎక్కువగా వర్గచైతన్యం సముపార్జించుకునేందుకు సరియైన నాలుగు సూత్రాల - వర్గపోరాటం, ఉత్పత్తి కొరకు పోరాటం, శాస్త్రీయ ప్రయోగం, చరిత్ర అధ్యయనాల - పద్ధతిని గురించి మనమి దివరకే ప్రస్తావించాము ప్రస్తుత ట్రేడ్ యూనియన్లలో నాయకత్వం వర్గపోరాటంతో ప్రమేయంలేకుండానే నెట్టుకువస్తున్నది కాని ఈ వ్యవస్థను ఎదిరించి పోరాటం చేయాలంటేమాత్రం ట్రేడ్‌యూనియన్‌ల నాయకత్వం భూస్వామ్య, పెట్టుబడిదారీ, తదితర అభివృద్ధినిరోధక శక్తులకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో ధైర్యసాహసాలతో స్వయంగా పాల్గొనవల్సివుంటుంది అయితే తరచూ మనం గమనించేదేమంటే ప్రజలు ఉద్యమిస్తూ ముందుకు సాగుతూంటే నాయకులు మౌనంగా ముఖం తిప్పుకుని వెనక్కు పారిపోతూంటారు కర్ఫ్యూలు, 144 సెక్షన్లు అమలులోనున్న కాలంలో గాభరాతో జుట్టు పీక్కునే వాళ్లే పరిస్థితులు చల్లబడిన తర్వాత నాయకులయిపోతారు ఇందువల్ల కార్మికోద్యమం పెట్టుబడిదారీ మార్గంలో నడవడమే జరుగుతుంది

వర్గ పోరాటంలో నిర్భయంగా పాల్గొనడమే సరియైన నాయకత్వానికి మొదటి అగ్ని పరీక్ష ఇక రెండో గీటురాయి ఉత్పత్తికొరకు పోరాటం ఉత్పత్తి కార్యకలాపాలలో ఎలాంటి శ్రద్ధాసక్తులు లేని పనిదొంగలు నాయకత్వానికి అయోగ్యులు దీపావళి పండుగ ముందు ఇంట్లో పట్టిన బూజు, దుమ్ము, సాలెగూళ్లు అన్నీ దులిపి ఎలా శుభ్రం చేస్తూంటామో అలాగే కార్మికవర్గం కూడ యిలాంటి ఉత్పత్తి విముఖులైన నాయకులను తమ ట్రేడ్ యూనియన్ గృహంనుండి దులిపివేయాలి

సాధారణ పరిస్థితులను, ప్రత్యేక పరిస్థితులతో జోడించగల ప్రజ్ఞ వున్నప్పుడే నాయకత్వం సరియైన విధానాలు నిర్ణయించగలదు సరియైన పని పద్ధతులు అమలు చేయగలదు ఎప్పుడైనా సమ్మె చేయాలంటే ముందుగా సమ్మెలో ప్రధాన డిమాండు ఏది వుండాలి, సమ్మెకట్టేందుకు సమయం సరిగావుందా లేదా అనే యోచన, అవగాహన నాయకత్వానికి వుండి తీరాలి. నాయకత్వం గనుక ఈ విషయమై సరియైన నిర్ణయం తీసుకొనలేకపోతే అప్పుడు ఉద్యమం విఫలమయ్యే ప్రమాదం ఎంతైనా వుంటుంది సాధారణ పరిస్థితుల పరిజ్ఞానం శాస్త్రీయ ప్రయోగం,

చరిత్ర అధ్యయనాలద్వారా మాత్రమే సాధ్యం విజయవంతమైన నాయకత్వానికి గీటురాయి - సాధారణ పరిస్థితులగురించి సంపూర్ణ పరిజ్ఞానం, ఆ జ్ఞానాన్ని ప్రత్యేక పరిస్థితులకు అన్వయింపజేయగల శక్తి సామర్థ్యాలే నాయకత్వం వ్యక్తిగత మహాభిలాషలు కలిగివుండరాదు మనిషి బ్రతకడానికి శ్వాసనిశ్వాసాలు ఎంత ముఖ్యమో నీతినిజాయితీలు, త్యాగదీక్ష నాయకత్వానికి అంత ముఖ్యం అప్పుడే ఆ నాయకత్వం జనాదరణ పొందగల్గుతుంది అలాంటి నాయకత్వాన్ని విశ్వసించి లక్షలాది ప్రజలు అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకొని పోరాటంలోకి లంఘించడానికి ముందుకువస్తారు

10. ఆర్థికవాదం : ఆర్థిక డిమాండ్ల కోసం పోరాడడమే ఆర్థికవాదమని చెప్పలేము గాని పోరాటం కేవలం ఆర్థిక డిమాండ్ల కోసంమాత్రమే చేస్తూ, అవితప్ప యితర రాజకీయ, సాంస్కృతిక, సాంఘిక సమస్యలన్నిటినీ పక్కకు నెట్టేసేటప్పుడు అలాంటి విధానాన్ని మాత్రం ఆర్థిక వాదమనే అంటారు ఇది ఒక ప్రమాదకర విధానం నేటి ట్రేడ్ యూనియన్లు యిలాంటి ప్రమాదకర మార్గంలోనే పయనిస్తున్నాయి అందువల్ల ట్రేడ్ యూనియన్ జీవితంలో జీవమే లేకుండాపోయింది వడ్రంగి దుగోడా (చిత్రిక)తో ఎండుకట్టెను ఎలా తురిమివేస్తాడో అలాగే ట్రేడ్ యూనియన్ నాయకత్వం ఈ విధానంతో కార్మిక జీవితంలోని సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ పక్షాలను తురిమివేస్తూ ఒక నిరాశా జనకమైన కృత్రిమ వాతావరణం సృష్టిస్తుంటారు, పెట్టుబడిదారులే సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ ఆలోచనా ధోరణుల్నే కార్మికులపై రుద్దుతుంటారు

అయితే మనకు యిలాంటి చిత్రికపట్టిన ఎండుకట్టె అక్కరలేదు మనం ఒక సజీవ సుందర వృక్షంలా జనజీవాలను యిముద్చుకో గోరుతున్నాము కార్మికుల్ని అసంపూర్ణంగా, వికృతంగా, బలహీనంగా వుంచివేయాలనే పెట్టుబడిదారులు చూస్తారు కార్మికుల్ని చౌకపాటి మృతప్రాయ వస్తువులుగా చేసివుంచాలని వాళ్లు కోరుకుంటారు ఎందుకంటే అందువల్ల వారి సిరిసంపదలు గడించే క్రమం నిరాఘాటంగా, భద్రంగా సాగిపోతుందనే గ్యారంటీ వుంటుంది.

బూర్జువా ఆలోచనాధోరణులు గల అవకాశవాదులు కార్మికోద్యమాన్ని తప్పుదారి పట్టించడానికి ఆర్థికవాదాన్ని చొప్పించారు ఈ అవకాశవాదులనే సంస్కరణవాదులని (కూడ) అంటారు వీళ్లు కార్మికవర్గ శాస్త్రీయ ఆలోచనాధోరణిని వ్యతిరేకిస్తూ పెట్టుబడిదారులు చూపే మార్గంలో కార్మికుల్ని నడిపించడానికే శాయశక్తుల పాటుపడుతుంటారు

తత్ఫలితంగా ఈనాడు మనదేశంలోని సకల ట్రేడ్ యూనియన్లకూ ఏడాది కొకసారి బోనసు గురించి, మూడు లేక ఐదేళ్ల కొకసారి వేతనస్థాయి పెంపుదల గురించి పోరాడడంమినహా మరో కార్యక్రమం ఏదీ లేకుండా పోయింది. ప్రమోషన్ల కోసం సిఫారసులు చేయడమో లేక చార్జిషీట్లకు జవాబులు రాయడమో తప్ప మరే పనీ లేని విధంగా నేడు కేంద్రకార్మిక సంఘాలన్నింటి వ్యవహారాలు చిల్లరకొట్టు వ్యాపారాల్లా తయారయ్యాయి

ఉత్పత్తి విధానాన్ని పెట్టుబడిదారే నిశ్చయంగావిస్తాడు దీనివల్ల యాంత్రీకరణ భూతం ఎప్పుడో ఒకప్పుడు ఆకస్మికంగా కార్మికుల మీద పడివారి(ఉద్యోగాల)ని తినేయడం జరుగుతుంది నేడు రాజకీయాలు నడిపే బాధ్యతంతా కంట్రాక్టర్లు, దళారీ ఏజంట్లు మొదలైన పీడకవర్గాలవారికే అప్పగించబడివుంది

మన సంస్కృతి (ప్రచారం, ప్రదర్శనల) పై బొంబాయి నగరపు స్మగ్లర్ల (అక్రమ రవాణాదారుల) కు, పెట్టుబడిదారులకు గుత్త (monopoly) అప్పగించబడివుంది వీళ్లు నగ్ననృత్యాలు, ఢిషుం-ఢిషుం కొట్లాటల కుసంస్కృతినే ప్రజాసంస్కృతిగా చెలామణీ చేయడానికి ఓవరుటైం (అహోరాత్రాలు) శ్రమిస్తున్నారు

సారామత్తులో దేశమంతా జోగుతున్నది స్త్రీలపై అత్యాచారాలు పెచ్చరిల్లిపోతున్నాయి కాని యిక్కడి ట్రేడ్ యూనియన్ల వద్దో, ఒకే కార్యక్రమం వుంది - "బోనస్ కావాలి, బోనస్ యివ్వండి !" అని కేకలు వేయడమే. అందువల్ల కార్మికులకు లభించే డబ్బులు (కాస్త) ఎక్కువవుతాయి నిజమే , అయితే ధర వరలు మరింతగా పెరుగుతాయి దానితో కార్మికుల జేబులు (మరింత శీఘ్రంగా) ఖాళీ అయిపోతాయి.

వాళ్లు వడ్డీవ్యాపారుల పంజాల్లో చిక్కుకుపోతారు పని కాంట్రాక్టరు కాస్తే పైసలు ఎక్కువయిచ్చినా వాటినికాస్త సారాకాంట్రాక్టరు ఎగరేసుకు పోతాడు తాగివచ్చిన కార్మికుడు ఇంట్లో పెళ్లాన్ని మక్కెలిరగదన్నుతాడు, పిల్లలు తిండిలేక పస్తులుండాల్సి వస్తుంది సారామత్తులో కార్మికులు మురికి గుడిసెల్లో అలా జోగుతూ పడివుంటారు

నేడు బాంకులు, జీవిత భీమా సంస్థ మొదలైన (సంఘటిత) పరిశ్రమల్లో ఆర్థికవాదం ఎంత బలీయంగా పాతుకుపోయి వుందంటే అక్కడి వుద్యోగులకు తమ పరిశ్రమల విషయాలేతప్ప మరే యితర పరిశ్రమలకు చెందిన కార్మికుల సమస్యలుగాని, పోరాటాలుగాని పట్టనే పట్టవు ఈ పరిశ్రమల్లోని ట్రేడ్ యూనియన్ నాయకత్వం కార్మికులను సంవేదనాహీనులుగా, ఆత్మాశ్రయవాదులుగా రూపొందిస్తుంది

ఆర్థికవాదానికి సంబంధించి మరొక నమూనా మనకు రైల్వే పరిశ్రమలో అగుపిస్తుంది ఇక్కడైతే ప్రతికార్మికుడు తన ప్రత్యేక విభాగపు ప్రాధాన్యం, అందులోని సమస్యలను గురించి యోచిస్తూ వుంటాడు అక్కడ గార్డు సాహెబు పచ్చ జెండా చూపించితే యిక్కడ గాంగుమెన్లు ఎర్రజెండాలు పట్టుకుని పట్టాలపై బైరాయిస్తారు కాని ఈ ఎరుపు - పచ్చలన్నింటినీ మేళవించి మొత్తం రైల్వేకార్మికులందరినీ సుసంఘటితం గావించే ప్రయత్నం ఏదీ అక్కడ నేడు జరగడంలేదు 1974నాటి చరిత్రాత్మక రైల్వే సమ్మె సమయంలో కొంతకాలం పాటు ఈ ఆశ రగిలింది గాని ఆ సమ్మెబండి కూడ కేంద్ర సంఘాల జాలంలో చిక్కి పట్టాలు తప్పి పడిపోయింది తత్ఫలితంగా సుమారు 146 స్వతంత్ర (రైల్వే) యూనియన్లు ఎంత నిరంకుశ దాడులకు గురయ్యాయంటే నేటికీ అవి సరిగ్గా లేచి నిలబడలేకపోతున్నాయి ఉక్కు పరిశ్రమలో కూడ యిలాంటి సంస్కరణవాద ప్రయత్నాలే జరుగుతున్నాయి ఈ కారణంగానే చార్జిమెన్లు, క్రేన్ ఆపరేటర్లు, హార్త్‌మెన్లు (కొలిమి కార్మికులు) మొదలైన వారందరినీ వేరు వేరు సంఘాలలో సమీకరించే ప్రయత్నాలు జరుగుతున్నాయి అయితే ఉక్కుపరిశ్రమకున్న సమగ్రభావ వ్యవస్థ దృష్ట్యా ఇలాంటి ప్రయత్నాలకు మేనేజిమెంటువైపునుండి పూర్తి మద్దతు లభించడం లేదనుకోండి

ఆర్థికవాద మార్గావలంబకులు ఆర్థిక డిమాండ్ల గురించి ఎంత గొంతు చించుకున్నా నేటి ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలకు ఈ కింది విషయాలు బాగా అనుభవమే

(1) 1947 లేదా 1960 ధరల సూచికలతో నేటి ధరవరల్ని పోలిస్తే ఈ 43 లేదా 30 ఏళ్ల కాలంలో కార్మికుల వేతనాలు రాసిలో పెరిగాయిగాని వాసిలో తగ్గిపోయాయి అంటే [కొనుగోలుశక్తి దృష్ట్యా] అసలు వేతనాలు పడిపోయాయి అంటే ఆర్థికపోరాటాలు, ఒప్పందాలు ఎన్ని జరిగినా కార్మికులకు నిజంగా దక్కిందేమీ లేదు; పైగా దోపిడీ, పీడనలు మరింతగా పెరిగిపోయాయి

(2) ఆర్థిక డిమాండ్ల విషయంలో ట్రేడ్‌యూనియన్ల బుర్రల్ని ప్రభుత్వం మెదడే శాసిస్తున్నట్లు తెలుస్తోంది వేతనాల సవరణ (pay revision) సందర్భంగా ప్రతి తడవా మనం గమనించేదేమంటే ప్రతిపాదిత సవరణలపై పునరాలోచనకని ఒక నిర్ణీత వ్యవధి యివ్వబడుతుంది ప్రభుత్వ ప్రకటన (నోటిఫికేషన్)లోని అంశాలను, వివిధ కమిషన్లు చేసిన సిఫారసులను మేనేజిమెంట్లు తమ తమ కార్మికులముందు, ట్రేడ్‌యూనియన్లముందు వుంచి వారిని ప్రలోభపెడుతుంటాయి

(3) ప్రభుత్వంవారు వివిధ కార్మికచట్టాల కలగూర గంపను సృష్టించి ఈ వ్యవస్థలోపలే మేలుజరిగే అవకాశం వున్నట్లు ఎండమావుల్ని చూపెడుతుంటారు

(4) ప్రాంతాల ప్రాతిపదికన పరిశ్రమల్లో వేతనస్థాయిలను నిర్ణయించడం ద్వారా ప్రభుత్వం ఒక అస్థిరమైన లక్ష్మణరేఖ గీచివుంచుతుంది బ్రిటిషు పాలనకాలంలో తెల్లదొరలు వివిధ సంస్థానాలకు వేర్వేరు చట్టాలు చేసి ప్రజల్ని గందరగోళపరిచి, చివరి కా సంస్థానాల ప్రజలచేతనే "బ్రిటిషు (ఇండియా) వాళ్ళ చట్టాల్ని యిక్కడ అమలుచేయండి!" అనే డిమాండు చేయించేవారు ఈ సామ్రాజ్యవాద పద్ధతి అనుసరణలోనే యిప్పటి మన ప్రభుత్వంకూడ ఆర్థికవాదాన్ని పెంపుగావిస్తున్నది ఫలితంగా ఒక పరిశ్రమలోని కార్మికులు మరొక పరిశ్రమలోని కార్మికులతో సమంగా వేతనాలు పొందాలనే తపనతో, ఆ ప్రయత్నాలలోనే తమ జీవితమంతా గడిపేస్తుంటారు

(5) ఇచ్చి పుచ్చుకోవాలి! (Give and take) వైఖరి యిలాంటి పరిస్థితిలోనే బాగా వేళ్లూనుకుంటుంది ఫలితంగా పోరాటంలో గెలుపు సాధించాలని కాక (రాజీ) ఒప్పందం కుదుర్చుకోవాలని కార్మికులకు పాఠాలు నేర్పుతుంటారు అనుక్షణం ఏదో ఒక ఒప్పందం చేసుకోవాలని, లేక చేసుకున్నదాన్ని అమలు చేయించుకోవాలనే తీపు మాత్రమే మనస్సులో వుంటుంది అలాంటప్పుడు "విప్లవం వర్థిల్లాలి!" అనే నినాదాన్ని "వేతన ఒప్పందం వర్థిల్లాలి!"అనే నినాదం వెంబడే దిక్కులు పిక్కటిల్లేట్లు యిచ్చినా, విప్లవం మట్టుకు ఎన్నటికీ రాదని గ్రహించాలి

నేడు కేంద్ర కార్మిక సంఘాలు ఆర్థికవాద రొంపిలో చిక్కుకుపోయి వున్నాయి ఈ ఆర్థిక మాంద్యకాలంలో మన (కార్మిక) కర్ణుని రథం భూమిలో కుంగిపోతున్నది కర్ణుడు రథచక్రాలు పట్టి ఎంత బలంగా పైకి లేవనెత్త యత్నించినా కుదరడంలేదు రథం అంతకంతకూ కిందికే కూరుకుపోతున్నదే గాని ఒక్కడుగు ముందుకు కదలడంలేదు దానితో కర్ణుడు యిప్పుడు తన రథమందే ఖైదీ అయివున్నాడు

ఇలాంటి పరిస్థితుల్లో మన నాయకులు ఏం చేస్తున్నారయ్యా? "ఔతున్నదయ్యా, సంభాషణలు జరుగుతున్నాయి!", "ఫర్వాలేదు, కొద్దిగా దొరికిందిలే," "ఎంతో కొంత యిప్పిస్తాంలే" అంటూ కార్మికుల్ని ఓదా రుస్తున్నారు కాని కార్మికులు నేడీ పైపై హామీలతో సంతోషపడేట్లేమీ లేరు నేడు కార్మిక సైనికుడు ముందుకు నడుస్తూంటే, మన నాయక సేనాపతి వెనుకగా కాళ్లీడుస్తున్నాడు పైగా వెనుక చిక్కిన ఈ సేనాపతి కార్మికుల్ని ఉగ్రవాదులని, వామపక్ష దుస్సాహసానికి, ఒంటెద్దు పోకడలకు లోనవుతున్నారని శాపనార్థాలు పెడుతూ, ఆవిధంగా ఈ వ్యవస్థారూప భగవంతుని సమక్షంలో సంజాయిషీ చెప్పుకుంటున్నాడు దానితో విసిగిన కార్మికవర్గం కేంద్ర కార్మిక సంఘాలను కాలదన్ని స్వతంత్ర ట్రేడ్‌యూనియన్లు నిర్మించుకుంటున్నదిగాని ఈ స్వతంత్ర ట్రేడ్‌యూనియన్లలోకూడ అత్యధికం తిరిగి అదే (ఆర్థికవాద) పంథాలో పయనిస్తున్నాయే!

మనకు కావలసింది ఆర్థికవాద అంధకారం కాదు. ఆర్థిక పోరాటంతో బాటు కార్మికశక్తి అవలోకనం కూడ కావాలి. ఆత్మ సమ్మానంగల కార్మికవర్గంగా మనం నిలదొక్కుకోవాలి. నూతన సంస్కృతికి సంబంధించిన తేటతెమ్మెరలు కావాలి. మనకు ఒక విప్లవకర ట్రేడ్‌యూనియన్ కావాలి!

* * * * *

# 2. రెండు సంభాషణలు

## 1

*[కామ్రేడ్ శంకర్ గుహా నియోగిని 1987 ఫిబ్రవరి 12వ తేదీనాడు జాతీయ భద్రతా చట్టంకింద అరెస్టు చేసి జైల్లో పెట్టారు ఆయన అరెస్టు అయిన వెంటనే దల్లీ-రాజ్‌హారా కార్మికులు సమ్మె కట్టారు. నియోగి అరెస్టుకు నిరసనగా దేశవ్యాప్తంగా ఎంతో ఆందోళన చెలరేగింది చివరకు ఆయన్ను విడిచిపెట్టారు కాని దల్లీ-రాజ్‌హారా కార్మికుల పోరాటంమాత్రం అలాగే కొనసాగింది విడుదలయిన తర్వాత కా నియోగి ఒకసారి దల్లీ-రాజ్‌హారా కార్మికుల సమస్యల విషయమై పనిబడి ఢిల్లీ వెళ్లారు. అప్పుడక్కడ పంకజ్ శర్మ అనే పాత్రికేయునితో సుదీర్ఘంగా సంభాషణ జరిగింది ఆ సంభాషణను "గుహా నియోగి ఎవరు? ఆయన ఏమి కోరుకుంటున్నారు?" అనే శీర్షికన "నయీ దునియా" పత్రిక 1987 జూన్ 14వ తేదీనాటి సంచికలో ప్రచురించారు ఆ సంభాషణను యిక్కడ యథాతథంగా యిస్తున్నాము ]*

ప్రశ్న . నవ సమాజం యిలావుంటుంది అలావుంటుందని దాని రూపురేఖలు మీరు వివరిస్తున్నారు కాని నవసమాజానికి మౌలిక ఆధారం ఏమని మీరు భావిస్తున్నారు? మార్క్సిజం-లెనినిజమా లేక ?

జవాబు : మార్క్సిజం - లెనినిజం ప్రాతిపదికన ఒక నూతన సామాజిక వ్యవస్థను ఏర్పాటు చేయడమే మా మౌలిక లక్ష్యం. అయితే మార్క్సిజం-లెనినిజాన్ని భారతదేశ ప్రత్యేక పరిస్థితులకు అనుగుణంగా అన్వయించాల్సి వుంటుంది

ప్రశ్న ప్రత్యేక పరిస్థితులు అంటే ఏమిటి?

జవాబు : మార్క్సిజం ఒక శాస్త్ర విజ్ఞానం (Science) అది

అభివృద్ధిచెందుతూంటుంది ఉదాహరణకు ఏద్రైనా మందు తీసుకుంటే దానికి తగినట్లు శక్తి పుంజుకోవడానికిగాను రోగికి అమెరికాలో అక్కడి వాతావరణానికి అనువుగా యిచ్చేంత ఆహారాన్నే మిగతా అన్ని దేశాల్లోనూ యివ్వగలరా? ఇదే విధంగా మార్క్సిజం - లెనినిజాన్ని మన దేశ పరిస్థితులకు అనువుగా అన్వయించుకోవల్సి వుంటుంది

ప్రశ్న ఛత్తీస్‌గఢ్‌లో మీరు చేసే యీ పోరాటం కేవలం కార్మికులకు కూలి అధికంగా లభించాలనా లేక ఏద్రైనా వర్గచైతన్యం వారిలో తీసుకురావాలని కూడానా?

జవాబు : చూడండి మార్క్సిజం - లెనినిజం అంటే ఏమిటి? వర్గపోరాటం కోసం రూపొందిన ఒక సిద్ధాంతం అది మరి వర్గపోరాటమో, పుస్తకాల్లో కాక నిజ జీవితంలో జరుగుతూంటుంది పీడక, పీడిత వర్గాల మధ్య పోరాటం ప్రారంభమైన వెంటనే అది వర్గపోరాటమనే ప్రథమ పాఠం అణగారిన ప్రజలకు తేలిగ్గా తెలిసిపోతుంది వాళ్ళ మార్క్సిజం యిదే - వాళ్ళ జీవితంతో ముడిపడి వుంటుంది పోతే మార్క్సిజానికి మరో రూపుకూడ వుంది - అదే శాస్త్రీయ రీతుల్లో సమాజ వికాసం అంటే, సమాజ పరివర్తనా క్రమంలో సమాజంలోవున్న ముఖ్య శక్తులేవి, పోరాటానికి ఏ శక్తులు నాయకత్వం వహిస్తాయి, మరే శక్తులు సహకరిస్తాయి మొదలైన అంశాలు ప్రజలకు తెలియజెప్పాల్సివుంటుంది అందుకే మేము కార్మికులకోసమని పుస్తకాలు ొంటుంటాము కొన్ని పుస్తకాలైతే స్థానిక పోరాటాల అనుభవాల ఆధారంగా మేమే స్వయంగా ప్రచురించాము కూడ ఈ పుస్తకాలను మేము కార్మికులకు చదివి వినిపిస్తాము ప్రతి బుధవారం యూనియన్ ఆఫీసులో సమావేశం జరుగుతుంది. సుమారు 5-6 వందలమంది కార్మికులు పాల్గొంటారు ఎన్నో విషయాలపై మాట్లాడుతారు ఈ విధంగా మా మార్క్సిజం సామాన్యుని జీవితంతో ప్రారంభమవుతుంది భారతదేశంలో (యితరత్రా) నడిచే మార్క్సిజం పుస్తకాలలో నుండి మనుషులపైకి వచ్చిపడుతుంటుంది కాగా మా మార్క్సిజం మట్టుకు జన జీవనంనుండే వెల్లులికి వస్తుంది మా మార్క్సిజం వ్యవహారాత్మకమైనది

ప్రశ్న కార్మికుల సాంఘిక జీవితంపై మీ ఉద్యమ ప్రభావం ఏమిటి?

జవాబు · చూడండి, మేము ఎప్పుడేగాని ఆర్థికసమస్యలపై పోరాటం చేయలేదు మేము అన్నింటికంటె ముందు ఆత్మగౌరవంకోసం పోరాడాం గనుల్లో పని ఈ విధంగా జరగాలి, కాని మీరిలా నిర్వహించడం లేదు అంటూ మేనేజిమెంటు వాళ్లను తప్పుబట్టుతూ వచ్చాము పని స్థితిగతులగురించి మేము వివరించినప్పుడు మా యజమానులు, "మీరిక్కడ కార్మికులు; మాకు చెప్పడానికి మీరెవరు?" అని ఈసడించారు పని పరిస్థితులను (working conditions) గురించి మాట్లాడే అవసరం మామూలు కార్మికులకెందుకు అని ప్రశ్నించారు అప్పుడు మేమన్నాం గదా - ఈ దేశం మాది ఇక్కడి ఉత్పత్తులు మా శ్రమతో వెలికి వస్తున్నాయి కనుక ఈ విషయంలో మాకూ వాటా వుంటుంది అందువల్ల ఉత్పత్తులు పెంచడంలో మా యోచనలు, మా బుద్ధికుశలతకూడ అవసరమవుతాయన్నాము దానికి వాళ్ళు మీ వాదాలు మేము ఒప్పుకోము పొండన్నారు అప్పుడు మేమన్నాం - అలాగైతే పనిపరిస్థితులు సవ్యంగా లేనందువల్ల ఏదైతే నష్టం (పనికి, ఉత్పత్తికి) వాటిల్లుతుందో దానికి పరిహారం మీరే యిచ్చుకోవాల్సివుంటుంది మాకు మీరు 'ఫాల్ బాక్' వేతనాలు యివ్వాల్సివుంటుందని చెప్పాము అంటే మేము పని చేయాలనే కోరుతున్నాము కాని మీరే మాకు పని యివ్వడంలేదు అందువల్ల మా వేతనాల్లో ఎంత తగ్గుదల సంభవిస్తున్నదో దాన్ని మీరు పూర్తి చేయాలి అంటే మేము ఊరకే కూచున్నప్పుడుకూడ మొత్తం వేతనాల్లో 80 శాతం మాకు యివ్వాల్సిందేనని పట్టుబట్టాము ఇలా ఆత్మగౌరవం సమస్యపై ప్రారంభమైన వివాదం చివరకు యిలా ఆర్థిక సమస్యగా పరిణమించింది ఇందువల్ల అంతదాకా రోజుకు 3-4 రూపాయలకు మించని మా కూలి దానంతటదే పెరుగుతూ రోజుకు 11 రూపాయల 96 పైసలు అయింది దానిపై మేనేజర్లు వీళ్లను యిలా ఊరకే కూచోబెట్టి వేతనాలు యివ్వవల్సి వచ్చేటప్పుడు యింతకన్న పనిపరిస్థితులు మెరుగుపరిచి వీళ్ళతో ఎంతోకొంత పనిచేయించుకుంటే బాగుంటుంది గదా అని యోచించారు మేమడిగిన మరో విషయం. "మీరు మంచి మంచి క్వార్టర్లలో వుంటున్నారుగదా మాకూ వుండడానికి

క్వార్టర్లు కట్టించి యివ్వండి మేమూ కష్టించి పనిచేస్తున్నాము మీకింత సదుపాయం వుంటే మాకు మాత్రం కొంత ఎందుకుండకూడదు?" అని మేనేజిమెంటును నిలేసి అడిగాము ఇదికూడ మా ఆత్మగౌరవానికి సంబంధించిన సమస్యే అయితే దీనినుండి కూడ మరో ఆర్థిక సమస్య తలయెత్తింది ఒక ఆర్థిక సదుపాయం లభించింది మేనేజిమెంటువాళ్లు మా డిమాండు సమంజసమేనని అంగీకరించారు కార్మికులకు గృహవసతికోసం నెలకు 100 రూపాయలు అలవెన్సు యివ్వడానికి అంగీకరించారు ఈ రెండు డిమాండ్లకోసం మేము 1977లో పోలీసు తూటాలను కూడ ఎదుర్కోవాల్సి వచ్చింది * అయితే అసలుకు మా పోరాటం ప్రారంభమయింది మట్టుకు 'మేము మీకంటె ఏమీ తక్కువ కాము' అనే ఆత్మసమ్మాన భావంతో. ఇక ఈ డిమాండ్లంటారా, అవి పోరాట క్రమంలో రూపొందాయి (ఒక విధంగా చూస్తే వాటిని రూపొందించింది మేనేజిమెంటేనన్నట్లు లెక్క)

ప్రశ్న : సారా కంట్రాక్టర్ల చేతుల్లో సాయుధ గూండా మురాలున్నాయని, వాళ్లు మీ వాళ్లపై దాడులు చేస్తున్నారని మీరు ఇంతకుముందు ఒకసారి అన్నారు మరి వారిని ఎదిరించడానికి మీరు మీ జనాల్ని ఎలా సిద్ధపరుస్తున్నారు?

జవాబు . మేము కేవలం కార్మికోద్యమానికే [ట్రేడ్‌యూనియన్ వుద్యమానికే] పరిమితమై వుండిపోలేదు మా దగ్గర యిప్పుడు కనీసవేతనం 19 రూపాయల 90 పైసలు ఇదిగాక నెలకు 95 రూ అడ్వాన్సు కూడ దొరుకుతుంది వెరసి రోజుకు 23-24 రూపాయలు కూలి గిట్టుతుందన్నమాట సాధారణంగా ఒక కుటుంబంలో యిద్దరు వ్యక్తులు [అయినా] పనిచేస్తుంటారు కాని యింత సంపాదించినా జనాలవద్ద పైసలు మిగులు వుండడం లేదు డబ్బులు ఎక్కువ దొరకడంవల్ల రెండు విధాల నష్టాలున్నాయి ఒకటేమంటే, జనాలు పనికి క్రమబద్ధంగా రారు కఠిన శ్రమతో కూడుకున్న పని మరి

---

* 1977 జూన్ 2-3 తేదీల్లో పోలీసు కాల్పుల్లో దల్లీ-రాజ్‌హారాలో 13 మంది కార్మికులు నేలకొరిగారు అప్పటినుండి ఛత్తీస్‌గఢ్ కార్మికులు ప్రతి ఏడూ జూన్ 3వ తేదీని 'అమరవీరుల దివం'గా సంఘీభావం, పోరాటదీక్షలతో జరుపుకుంటూ వస్తున్నారు

ఆదివారం శెలవుదినం ఆ రోజు విశ్రాంతి తీసుకున్నాక యిక సోమవారం మళ్లీ పనికి వెళ్లాలంటే జనాలకు ఒళ్లు వంగదు; మనసు ఒప్పదు ఎందుకంటే డబ్బులు అప్పటికే దండిగా లభించాయి గదా. ఇక రెండో నష్టమేమంటే, కార్మికులు సారా తాగడం హెచ్చయిపోయింది దానితో మేము తాగుడుకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపాము అదే సమయంలో ఉత్పత్తిపై దృష్టి కేంద్రీకరించవల్సిందిగా కార్మికులకు ఉద్బోధించాము మరిలా ఉత్పత్తి పట్ల శ్రద్ధ వహించాలనే మాటలు మామూలుగా పాలకపక్షంవారే చెబుతుంటారు అలా చెప్పడంలో వాళ్ల ఉద్దేశ్యం వర్గపోరాటం నుండి కార్మికుల దృష్టి మళ్లించడం అందుకే ఉత్పత్తి పట్ల శ్రద్ధ వహించాల్సిందిగా వాళ్ళు కోరుతుంటారు గాని నిజానికి ఉత్పత్తివల్ల వాళ్ళకు వచ్చేదిగాని, పోయేదిగాని ఏమీవుండదు కాని వర్గపోరాటంతో బాటుగా ఉత్పత్తి పట్లకూడ శ్రద్ధవహించమనే మాట వున్నది చూచారూ, ఆ మాట మనదేశంలోని ఏ మార్క్సిస్టు లేక లెనినిస్టు అయినా కాదు, కాదు, అసలెవరూ చెప్పలేదని అయితే అనలేము గాని గొప్ప గొప్ప మార్క్సిస్టు నాయకులయినా గాని చెప్పలేదు, ఉత్పత్తిని అధికంచేయడంపైకూడ కేంద్రీకరించాలనే విషయం కార్మికులకు నేర్పలేదు కాని మేముమాత్రం జనాలకు ఎంతో అవసరముంటే తప్ప శెలవు తీసుకోకూడదని చెబుతూవస్తున్నాము ఇక్కడ అంతా యీ ప్రకారమే జరుగుతున్నదికూడ పోతే జనాలు సారా తాగడంకూడ మానేశారు దానితో సారా వ్యాపారులకు, కంట్రాక్టర్లకు ఎంతో నష్టం వాటిల్లింది వాళ్లవద్ద గూండాలున్నారు ఆయుధాలున్నాయి కాగా మా వద్ద వున్నది ఒకే ఒక ఆయుధం - సంఘశక్తి, క్రమశిక్షణ మాకు తెలిసిందింత మాత్రమే · - వర్గపోరాట పథంలో మాకెవరు అడ్డుగా నిల్చినా మేము వారి సంగతి తేల్చిపారేస్తాము వాళ్లు ఏ విధంగానైతే మామీద దాడులు చేస్తారో తదనుగుణంగానే మేమూ వాళ్లను ఎదిరిస్తాం వాళ్లు మాపై బలప్రయోగానికి తలపడితే మేము వాళ్లపై బలప్రయోగానికి వెరవము అయితే దోపిడీ వర్గాలు ఎన్నడైనా సూటిగా, నేరుగా తలపడవు వాళ్లవద్ద నౌకర్లుంటారు ఆ బంట్లతో దాడులు చేయిస్తారు పోలీసులు కూడ వారి భృత్యులే గూండాలు, బద్మాషులు వారి నౌకర్లే మరి గూండాగాళ్లతో ప్రజాస్వామిక పోరాటం ఏం చేస్తాం చెప్పండి

వాళ్ల సంగతి చూచేందుకు మావద్ద ఒక పద్ధతి వుంది అదేమంటే, ఫలానా గూండా ఫలానా (దోపిడీవర్గ) వ్యక్తికి కిరాయి తొత్తని, మాపై అతనెప్పుడైనా దాడిచేస్తే దాని అసలు బాధ్యత ఆ కిరాయి గూండాది కాక ఆ దోపిడీవర్గ ప్రతినిధిదే అవుతుందని పెద్దయెత్తున ప్రచారం చేసేస్తాము దానితో దాడిచేయించాలని కుట్రపన్నే అసలు వ్యక్తి జంకిపోతాడు "ఆగండి, ఇప్పుడే ఏమీ చేయకండి ఎందుకంటే మాపై మాట వస్తుంది." అని తన భృత్యులకు చెప్పి వారిస్తాడు.

ప్రశ్న : ఈ బద్మాషులవద్దనయితే తుపాకులు, పిస్తోళ్లు వుంటాయి గదా మరి వాళ్లతో మీరెలా తలపడతారు?

జవాబు : తుపాకులు, పిస్తోళ్లతోనైతే నేటిదాకా మాపై ఏ దాడీ జరగలేదు. అయితే ఒకసారి బాలౌద్ పట్టణంలో మాపై కత్తులతోనయితే దాడి జరిగింది ఆ రోజు బుధవారం అక్కడ సంతరోజు మేము బజారెంబడి నడిచివెళ్తున్నాం అంతలో దారిలో వెనుకనుంచి కొందరు నాపై కత్తులతో విరుచుకుపడ్డారు అక్కడ ఒక స్త్రీ యిదంతా చూస్తూవుండింది చటుక్కున (నాకు రక్షణగా) నాపై దూకింది నేను కిందపడిపోయాను కత్తిదెబ్బ ఆమెపై పడి ఆమె వేలు ఒకటి తెగిపోయింది ఆ రోజలా ఆయమ్మ నా ప్రాణాలు కాపాడింది. చూచారా, మేము యిలా ప్రజల దన్నుపై ఆధారపడి, ఆ భరోసాతోనే వున్నాము మా వద్ద కనీసం బ్లేడులు, పిన్నులు అయినా లేవు అన్నింటికంటె గొప్పది నైతిక ఆయుధమే

ప్రశ్న : కాని వర్గపోరాటం కేవలం నైతిక ఆయుధాలతోనైతే జరగలేదుగదా?

జవాబు : ఆ సంగతి మరెప్పుడైనా ఆలోచిద్దాం. ఈ రోజు మట్టుకు ప్రజలు యింకా జాగృతం కాలేదు సంజయ్ గాంధీ పథంలో విముక్తి లభిస్తుందా లేక మరో దోవ ఏదైనా వుందా అనేది సైతం ప్రజలకు తెలియడం లేదు ఆఖరుకు సాంఘికాభివృద్ధికి ఏ దారి సరియైనదనేదే ప్రజలు నిర్ధారించుకోలేక పోతున్నప్పుడు వివిధరంగాల్లో ఎక్కడెక్కడైతే మార్పుకావాలనే యోచనలు ఉత్పన్నమైనాయో అక్కడల్లా

వివిధ వ్యక్తులు తమతమ పద్ధతుల్లో ప్రయత్నాలు సాగిస్తూపోతున్నారం తమాత్రమే మేమేగాక మరెందరోకూడ అనేకవిధాలుగా కృషిచేస్తూనే వున్నారు విస్తృత సంఖ్యలో ప్రజలు జాగృతమైనప్పుడు ప్రజలు ఏ దారి చేపట్టుతారనేది అప్పటి పరిస్థితులే నిశ్చయిస్తాయి.

ప్రశ్న . భారత కమ్యూనిస్టు పార్టీ (CPI), భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) [CPM] లను గురించి, నక్సలైట్లను గురించి మీ అభిప్రాయాలేమిటి? వారితో సంబంధంలేకుండా వేరుగా వుండి మీరు ?

జవాబు సి పి ఐ కి సంబంధించినంతవరకైతే వీళ్లు యిప్పటికీ ప్రజలతో ముడివడి వుండడంలేదు వీళ్లు ఏ సమాజం కోసం పాటు పడుతామని చెబుతున్నారో దానికి ప్రాతినిధ్యం వహించడంలేదు సి పి ఎం కు సంబంధించినంతవరకు దాని 'కేడర్ల'లో కొంతమంది ప్రజలతో ముడివడివున్న మాట నిస్సందేహంగా వాస్తవమే గాని దాని నాయకులు మాత్రం నేటికీ వారు చెప్పే సమాజానికి ప్రాతినిధ్యం వహించడం లేదు

ప్రశ్న . ఇప్పుడు ఇంకొక ఆర్గనైజేషను వుంది చూశారూ - నక్సలైట్లు?

జవాబు · నక్సలైట్లు అనేది ఒక సవ్యమైన పదమేకాదు. అది ఒక కృత్రిమ పదం నక్సలైట్లు అనే వాళ్లెవరూ లేరు అయితే మార్క్సిజం - లెనినిజం పేరిట కొన్ని గ్రూపులు పనిచేస్తున్నమాట మాత్రం నిజమే నాకు తెలిసినంతవరకు వాళ్లతో వేగడం కష్టం నేను వాళ్లతో పొందిక కుదుర్చుకోలేకపోయాను ఎందుకంటే, వాళ్లు పనిచేసే, ఆలోచించే పద్ధతుల్ని పరిశీలిస్తే వారికి ఈ దేశపు నేలా గాలులతో, యిక్కడ నివసించే ఉత్పాదకవర్గాలతో అంతగా సంబంధం లేదనే నాకు అనిపిస్తూంది వాళ్లవద్దయినా [భావి సమాజం గురించి] స్పష్టమైన రూపురేఖలేవీ లేవు

ప్రశ్న . [అలాకాకపోగా] వామపక్ష శక్తులన్నింటిలోకీ ఉత్పాదక వర్గాలతో అత్యధికంగా ముడివడి వున్నది వాళ్లేనని మీకు అనిపించడం లేదా?

జవాబు : ఈ వామపక్షమనే పదం ఎక్కడినుండి వచ్చింది? అది ఇంగ్లండునుండి వచ్చింది అక్కడ పార్లమెంటులో కార్మిక ప్రతినిధులు [స్పీకరుకు] ఎడమవైపున కూర్చుంటుండేవాళ్లు అయితే యిక్కడ కార్మిక వర్గానికి ప్రాతినిధ్యంవహించేవారే లేనప్పుడు యిక్కడ వామపక్షమంటే అర్థమేమి వుంటుంది? ఈ దేశంలో గల రాజకీయ పార్టీలేవీ ఉత్పాదక వర్గాలకు ప్రాతినిధ్యం వహించడంలేదని నేను యిదివరకే చెప్పివున్నాను

ప్రశ్న ఫ్యాక్టరీ కార్మికులను తీసుకుంటే వాళ్లపై సి పి ఐ, సి పి ఎం ల ప్రభావం గణనీయంగా వుందిగదా అలాగే మనం నక్సలైట్లని అనేవారి పలుకుబడిలో ఆంధ్రప్రదేశ్‌లో ఎంతో భూభాగం - ప్రత్యేకించి శ్రీకాకుళం ప్రాంతం, తమిళనాడు (ధర్మపురి), ఈశాన్యప్రాంతాల్లో ఎంతో భూభాగం వున్నాయి వాళ్లు సాయుధ విప్లవం ద్వారా ఈ వ్యవస్థలో మార్పు తీసుకురావాలనుకుంటున్నారు వారినిగురించి మీ అభిప్రాయం?

జవాబు : ఈ విషయంలో మీకు తెలిసిందెంతో అది నాకు తెలియదు పోతే నాకూ ఈ విషయమై అంత జ్ఞానం లేదు కాని నాకు తెలిసినంత వరకు నేను చెప్పగలిగిందేమంటే ఎవరైతే మార్క్సిజం-లెనినిజం ధ్యయనం చేస్తూ ప్రజల్లో నూతన చైతన్యం, దేశంలో నూతన ఉత్పత్తి ధానాలు తీసుకురావడానికి కృషి చేస్తున్నారో వాళ్లు తప్పక మంచివాళ్లే అయివుంటారు అయితే వీళ్లు (నక్సలైట్లు) ఏ ప్రాంతంలోనైనాగాని ఏదైనా నూతన ఉత్పత్తి విధానం రూపొందించారనేందుకు మీవద్ద ఉదాహరణ ఏమైనా వుందా?

ప్రశ్న : సాంఘిక మార్పు దిశలో అధిక ప్రాధాన్యం దేనికున్నదంటారు? కార్మికుల పాత్రకా లేక రైతుల పాత్రకా?

జవాబు రెంటినీ మేళవించాల్సి వుంటుంది అప్పుడే మార్పు సంభవిస్తుంది కాని కార్మికుల నాయకత్వమైతే తప్పనిసరి రైతులు యిప్పుడే నాయకత్వం వహించే స్థితిలో లేరు

ప్రశ్న : కాని యిక్కడ సమస్యేమిటంటే కార్మికుల జీవనప్రమాణం పెరిగేకొద్దీ వాళ్లను ఆర్థికవాదం అధికంగా ఆవహిస్తుంది వాళ్లు

సుఖజీవనానికి అలవాటుపడిపోతారు కూడ మీవద్ద ఛత్తీస్‌గడ్‌లో కూడా వేతనాలు పెరిగేకొద్దీ ఈ ఆర్థిక వాదం ప్రవేశించి తీరుతుంది [దీనికేమంటారు ?]

ఔవాను . సంఘం (ఆర్గనైజేషను) ధ్యేయాన్నిబట్టి అంతా జరుగుతూంటుంది మనం యింతవరకు జనాలకు చెప్పతూ వచ్చిందంతా విప్లవం వర్ధిల్లాలి అని కేకలు వేయండి, [కాని] మీ వేతనాలు పెంపు కావించుకొనండి [అలా పెంపుగావించుకొనడం పట్ల కేంద్రీకరించండి] అనేగా అంతేగాని ఉత్పత్తిని కూడ పెంచండని మనం వాళ్లకు ఎన్నడేగాని బోధించలేదు గదా చెప్పండి, నేటివరకు ఏ ట్రేడ్ యూనియన్ నాయకుడైనా ఉత్పత్తిని పెంచండని అన్నాడా? దోపిడీ, పీడనలను ప్రతిఘటించడానికి కార్మిక సంఘాలు కేవలం ఆర్థిక డిమాండ్లు మాత్రమే నేర్పాయి గాని సమాజ స్థితిగతులను గురించి ఏమీ మాట్లాడలేదు మొదట్లో కార్మికులు రోజులో 12 గంటలు పని చేస్తుండేవాళ్లు ఇప్పుడు 8 గంటలు డ్యూటీ యింది మరిలా మిగిలిన 4 గంటల కాలాన్ని ఎలా సద్వినియోగపరుచుకోవాలో ఏ యూనియనైనాగాని చెప్పిందంటారా? మన బోనసు ఎక్కువ రావాలంటే ఉత్పత్తి కూడ ఎక్కువ కావాలి గదా ప్రభుత్వం లేక యజమానివర్గాలు తెలి' తెలిసే (కావాలనే) ఉత్పత్తి తక్కువగావిస్తున్నప్పుడు సైతం మనం వత్తి తెచ్చి ఉత్పత్తిని పెంపుగావించేట్లు చేయాలి కాని ఈ విషయం యూనియనైనా ఎప్పుడైనా లేవనెత్తిందా? మన దేశంలో ఉత్పత్తి దివ్యంగ జరగగలదు ముడిసరుకులు పుష్కలంగావున్నాయి మనుషులూ దండిగ వున్నారు మార్కెట్ (విపణి) కూడ విస్తృతంగా వుంది కాని యిక్కడి పెట్టుబడిదారీ వర్గానికే ఉత్పత్తి చేయడం యిష్టం లేదు కనుక ఉత్పత్తి గావించాలని మనమే వత్తిడి చేయాలి లేని పక్షంలో మాకు పరిహారం ఇచ్చుకోవాలని అడగాలి వ్యవసాయ ఉత్పత్తులకు సంబంధించికూడ యిలాగే జరుగుతూంది టొమాటోలు పది పైసలకు కిలో చొప్పున అమ్ముతున్నారు గోధుమలు బూజుపట్టి పాడైపోనీగాక బజారుకు మాత్రం పంపించడంలేదు పైగా ధాన్యం ధరలు పెంచమని ప్రభుత్వాన్ని డిమాండు చేస్తారు ఇలా డిమాండు చేసేది ధాన్యం

నిల్వచేసుకోగల కామందులే కనుక ధరలు పెరిగితే లాభం వాళ్లకే గాని మామూలు రైతులకు ఏమీ ఒరగదు అందుకే ఈ సారి ధాన్యం గింజలు నేరుగా రైతులవద్ద నుండి కొని కార్మికులకు పంచే కార్యక్రమం ఒకటి మా యూనియన్ తరఫున తలపెట్టాము మా కార్మికులకు మొత్తం ఎంత ధాన్యం కావాలో లెక్కవేశాము ఆనక రైతుల వద్దకు వెళ్లి మీరు ధాన్యం అమ్మేట్లయితే ఈ సారి మాకే నేరుగా అమ్మండి, కావాలంటే మార్కెట్లో మీరు అమ్ముకునే రేటుకంటే ఒకటో అరో ఎక్కువనే యిస్తాము అనికూడ చెప్పాము కాని యింతలో దురదృష్టవశాత్తు నన్ను అరెస్టు చేయడం, మరికొంతమంది కామ్రేడ్లుకూడ జైలు పాలవడం తటస్థించింది వెంటనే కార్మికులంతా పనులు బందు పెట్టి సమ్మె కట్టారు దానితో ఈ సారికి యీ (ధాన్యం కొనే ) కార్యక్రమం సాగించలేకపోయాము ఈసారిలా మా ప్లాన్లన్నీ చెదిరిపోయాయి

ప్రశ్న : సాంఘిక మార్పు క్రమంలో కార్మికుల పాత్ర మిగతా అందరి కంటె అగ్రగణ్యమైనదని మీ అభిప్రాయం అయితే మా సందేహమేమంటే నేడు భారతదేశంలో వ్యాప్తిలోవున్న అభివృద్ధి మార్గం అమెరికా పద్దతి మార్గమే కార్మికులకుండాల్సిన విప్లవకర స్వభావం, వ్యక్తిత్వం యిక్కడ కాలానుగుణంగా వికసించలేదు పైగా వాళ్ల స్వభావం ప్రతీఘాత విప్లవం దిశగా పయనిస్తోంది ఎలాగైతే అమెరికాలో కార్మికులు ఎన్నడూ చెప్పుకోదగ్గ ప్రతిఘటన సమర్పించలేదో [యిదీ అంతే] వియత్నాం యుద్ధాన్ని వ్యతిరేకించింది మాదక ద్రవ్యాలకు అలవాటు పడ్డారని చెప్పబడే అక్కడి విద్యార్థి యువజనమే [గాని కార్మికులుకారు] కాగా అమెరికాలోని పెద్ద పెద్ద కంపెనీల కార్మికులంతా గప్‌చుప్పగా వుండిపోయారు అదేవిధంగా భారతదేశంలో కూడ పెద్ద పెద్ద ఫాక్టరీల కార్మికుల్లో, అంటే వేతనాలు అధికంగా లభించే చోట్ల వర్గచైతన్యం కొరవడి వుండడం మనకు కనిపిస్తుంది అలాంటప్పుడు సాంఘిక మార్పు క్రమానికి యి కార్మికులు ఎలా నాయకత్వం వహించగల్గుతారబ్బా ?

జవాబు : భారతదేశంలో ఆర్థికాభివృద్ధి అమెరికా పద్ధతిలో జరుగుతూందనడం సరికాదు ఇక్కడ నడుస్తున్నది అమెరికా పద్ధతి కాదు

లేదా రష్యాపద్ధతో, బ్రిటన్ పద్ధతోకూడ కాదు మనదేశంలో మన (భారతీయ) పద్ధతే నడుస్తున్నది నేటికీ ఫ్యూడల్ విధానం వ్యాప్తిలో వుంది గ్రామాల్లో పూర్తిగా ఫ్యూడల్ పద్ధతే వుంది పట్టణాల్లో ఒక సంకర సంస్కృతి నెలకొనివుంది అయితే పట్టణ పరిసరాల్లో పెట్టుబడిదారీ ప్రవృత్తి వున్నమాట నిస్సందేహంగా నిజమే

ప్రశ్న : ఫ్యూడలిజం లేకపోలేదు కాని పెట్టుబడిదారీ విధానంకూడ శిఖరస్థాయికి పయనిస్తూనే వుంది మీరు చూడండి, ఇక్కడ మనదేశంలో బహుజాతి కంపెనీలు ఎలా దోపిడీ సాగిస్తున్నాయో సరిగ్గా అదేవిధంగా ఆసియా, ఆఫ్రికా, తదితర మూడవ ప్రపంచదేశాల్లో పెట్టుబడులు పెట్టి మన బడా కంపెనీలు కూడ అక్కడ దోపిడీ సాగిస్తున్నాయి గదా!?

జవాబు . నిజమే. కాని యిదేమీ కొత్త విషయం కాదు ఇదివరలో సైతం యిలాగే వుండింది అసలుకు మన ఆర్థికవ్యవస్థే ఒక గందరగోళ కదంబం దీన్ని (దాస్య) వ్యవస్థ అనలేము, కాని అదే సమయంలో యిది స్వతంత్రమైనదని చెప్పడమూ కష్టమే

ప్రశ్న · మంచిది, మరి జముక్‌లాల్ భేడియాతో మీరు జరి<sup></sup>పే పోరాటం అర్జున్‌సింగ్, విద్యాచరణ్ శుక్లాల మధ్యనున్న జగడంలో భాగం కాదనే తలుస్తాను కాని భేడియాకు వ్యతిరేకంగా మీరు శుక్లాతో ఫ్రంటు కట్టారని, శుక్లాతో చేతులు కలిపే మీరు యిదంతా చేస్తున్నారని జనాలు అంటున్నారు శుక్లాతో మీరు తరచూ సమావేశమవుతుంటారని కూడ అంటున్నారు ఇదంతా వాస్తవమేనా?

జవాబు · నేను పోరాడేది భేడియాతోనేగాని అర్జున్‌సింగ్‌తోనైతే కాదు మేము చేసే పోరాటం దోపిడీవర్గాల దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా అందుచేత ఈ పోరాటం మూలంగా ఎవరి స్వార్థ ప్రయోజనాలకు మొదటి దెబ్బ తగులుతుందో వాళ్లే మొదటగా మాతో తలపడడానికి ముందుకు వస్తారు మరిప్పుడు యీ భేడియాగారినే తీసుకుంటే ఆయన ఏమంత ముఖ్యమైన వ్యక్తి అయితే కాదు ఆయన ఒక మామూలు మనిషి అధికారంలోవున్నప్పుడు లభించే శక్తియుక్తులను

చూచి తానెంతో ప్రముఖ వ్యక్తినని భావించుకుంటున్నాడంతే

కాని పరిపాలన కేవలం వీరోవారో ఎవరైనా మంత్రుల కనుస న్నలపై జరిగేది కాదు అది మొత్తం ఒక వర్గపు కనుసన్నలపై జరుగుతుంది ఈ విషయం భేడియాగారికి తెలియదు. వీళ్లంతా రబ్బరు స్టాంపులేనండి బాబూ ఆ వర్గం అవసరాలనుబట్టి వీళ్లు స్టాంపులు గుద్దేస్తుంటారు ఇక విద్యాచరణ్ శుక్ల విషయమంటారా, ఆయనకు, అర్జున్ సింగ్‌కు వున్న తగాదాతో మాకేం పని? మరి కలవడమంటారా, నేను అనేకమంది మంత్రులను కలుస్తూనేవుంటాను నిన్ననే నేను శ్రీ నారాయణ్ దత్ తివారీని కలిసాను; ఈ సంగతి మీకు తెలుసుకూడ అయితే అనవసరంగా నేను ఎవరినీ కలవను అవసరం వచ్చిందంటారా శ్రీమతి ఇందిరా గాంధీనైనా కలుస్తాను మా సమస్యల పరిష్కారానికిగాను సంభాషణల మార్గాన్ని సదా తెరిచి వుంచాలనే మేము కోరుకుంటాము అందువల్ల శుక్లాను కలవడంకూడ యిలాగే జరుగుతూంది మాకిక్కడ డీజల్ కొరత వున్నప్పుడు, శుక్లా పౌరసరఫరాల శాఖ మంత్రి అయినప్పుడు మరి ఆయనను కలవవల్సి వస్తే కూడ కలవకూడదంటారా? తమాషా ఏమిటంటే ఈ శుక్లాగారే మొదట్లో నేను భేడియామనిషినని ఆరోపణ చేస్తూండేవాడు ఆనక యిప్పుడు భేడియా మొత్తుకోనడం మొదలుపెట్టాడు నేను శుక్లాతో కత్తు కలిపానని అయితే నాకు మట్టుకు యిలా గోళీలాడినట్లు రాజకీయాలాడే వ్యక్తులపై విశ్వాసం ఏ మాత్రం లేదు

ప్రశ్న : మీ మాటపై 20 వేలమంది కార్మికులు ఒక్కుమ్మడిగా సారాతాగడం మానేసారని వింటున్నాము అయితే ఒక నాయకుని నైతిక ప్రభావం ఎంతైనా వుండవచ్చుగాక, కాని 20వేలమంది ఒక్క సారిగా సారాతాగడం మానేసారంటే నమ్మశక్యంగా లేదు, యివన్నీ కాకమ్మకబుర్లేనని నేను భావిస్తున్నాను. ఇకపోతే మీప్రాంతంలో జనాలు సారాతాగడం మానేసినా, మీ చుట్టుపక్కల ప్రాంతాల్లో సారాఅమ్మకాలు పెరిగిపోయాయని, మీ వాళ్లు సారా తాగడానికి అక్కడికి వెళ్లి వస్తుంటారని అంటున్నారే !

జవాబు . చుట్టుపక్కలి ప్రాంతాల్లో సారా అమ్మకాలు పెరిగి

పోయాయనేది నిరాధారమైన ప్రచారం ఇక సారా మానిపించడం మాటంటారా, అదేమీ ఒక్క రోజులో సాధించిందేమీ కాదు ఏదో ఒక దినం ప్రకటనచేశాం, ఆవెంటనే జనాలు సారాతాగడం మానేసారు అన్నట్లేమీ జరగలేదు రాజ్‌హారా జనాభా సుమారు ఒక లక్ష అయితే యిక్కడ వున్నది ఒకే ఒక సారా దుకాణం ఇక జనాలు చుట్టుపక్కలి ప్రాంతాలకు వెళ్లి తాగి రావాలంటే కనీసం 15-20 కిలోమీటర్లు వెళ్లాల్సివస్తుంది ఇది అసంభవం మేం మొదట మా యూనియన్ నాయకులచే సారామాన్పించే ప్రయత్నం చేశాము అప్పట్లోగల 31 మంది యూనియన్ పదవీధారుల్లో సారాతాగని వాళ్లు కేవలం యిద్దరే వుండేవారు కనుక పట్టుబట్టి మొదటగా ఆ మిగతా 29మంది పదవీధారులచే సారా మానిపించాము అనక మెల్లమెల్లగా యితర జనాలతోకూడ మానిపించడం మొదలుపెట్టాము ఇందుకు అనేక నెలల కాలం పట్టింది. ఇప్పుడు సుమారు 30-40 వేలమంది సారామానేసారు సారా తాగుడువల్ల కలిగే హాని గురించి డాక్టర్లచే ప్రసంగాలు యిప్పించాము 'సారా - ఆర్థిక జీవనం' అనే అంశంపై రవిశంకర్ విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన ఒక పరిశోధనా పత్రాన్ని మేము మా కార్మికులకు చదివి వివరించాము ఇలా ఈ క్రమమంత మెల్లమెల్లగా జరిగిందేగాని ఒక్క ఉదుటున ఏదీ కాలేదు

ప్రశ్న : దల్లీ-రాజ్‌హారా గనుల్లో ఎంతమంది కార్మికులున్నారు?

జవాబు సుమారు 15 వేలమంది

ప్రశ్న . వారిలో మీ యూనియన్ సభ్యులెంతమంది?

జవాబు : పదివేలమంది

ప్రశ్న మిగతా ఐదు వేలమంది?

జవాబు : మిగిలినవారిలో కొంతమంది ఐటక్ (A I T U C)తో, మరికొంతమంది సీటూ (C I T U) తో వున్నారు ఇంటక్ (I N T U C)కు కూడ నామమాత్రంగా కొంతమంది సభ్యులున్నారు

ప్రశ్న : పోరాటాల్లో మీకు ఐటక్, సీటూల సహాయ సహకారాలు

లభిస్తాయా? లేక వారితోకూడ తలపడాల్సిన సందర్భాలు వచ్చాయా?

జవాబు : మా ప్రధాన పోరాటం ఐటక్ (సి పి ఐ వాళ్ల కార్మిక సంఘం)తోనే జరుగుత

ప్రశ్న . దీనికి కారణం ఏమిటి?

జవాబు · అనేక కారణాలున్నాయి వాటన్నిటినీ యిక్కడ వెల్లడించడం సముచిత మనుకోను కాని ట్రేడ్‌యూనియన్ నిర్మించడం, నడపడాల విషయంలో మేము ప్రారంభించిన కొత్త పద్ధతి వాళ్లకు ముప్పుగా పరిణమించింది ఎందుకంటే చిల్లరకొట్టు బేరసారాల ట్రేడ్ యూనియనిజం యిప్పుడిక్కడ మరెంత మాత్రం నడవలేదుగదా

ప్రశ్న : అంటే సి పి ఐ వాళ్ల ట్రేడ్ యూనియనిజం చిల్లరకొట్టు బేరమంటారా?

జవాబు . ఔను మరి అది ఖచ్చితంగా చిల్లరకొట్టు బేరమే ఈప్రాంతంలో అది నడవలేకుండా చేసేశాము గనుకనే వాళ్లకు మాపై ఆగ్రహావేశాలన్నీ చూడండి, సి పి ఐ స్థానికనాయకుడొకరు నియోగి అరెస్టుతో యిక్కడ బీభత్సం అంతమైపోయిందని హర్షం వెలిబుస్తూ ఒక పత్రికా ప్రకటన యిచ్చాడు పోతే సీటూ వాళ్లు యిక్కడ రాజ్‌హారాలోనైతే నా అరెస్టుపట్ల నిరసన వ్యక్తం చేశారుగాని భోపాల్‌లో మట్టుకు చేయలేదు పోతే రాజ్‌హారాలోని సి పి.ఐ. నాయకులు నా అరెస్టును సమర్థించినా, వారి కేంద్రనాయకులు మాత్రం దాన్ని నిరసించారు జనతా పార్టీ, లోక్‌దళ్‌ల నాయకులు కూడ నా అరెస్టును గర్హించారు

ప్రశ్న : సి పి ఐ వాళ్లు మీ అరెస్టును ఢిల్లీలో నిరసిస్తున్నారు గాని దల్లీలో సమర్థిస్తున్నారా!? మరి ఈ విరోధాభాసం (paradox)పై మీ అభిప్రాయ మేమిటి?

జవాబు వినాశకాలే విపరీత బుద్ధి.

ప్రశ్న . ఒక్కవిషయం చెప్పండి నియోగిగారూ, మీ యూనియన్ కార్యకలాపాల నిర్వహణ కవసరమయ్యే ఆర్థిక వనరులు కేవలం

కార్మికుల వార్షిక చందాలేనా లేక మరేవైనా ఏర్పాట్లు వున్నాయా?

జవాబు మా ఆర్థిక వనరులను గురించి చాల పొరపాటు భావనలు వ్యాప్తిలో వున్నాయి కేవలం మూడేళ్లలో మా యూనియన్ చేకూర్చుకున్నంత సంపద బహుశా మరే యూనియన్ అయినా సాధించివుండదేమో మా యూనియన్‌కు బిల్డింగు వుంది మా వద్ద ఒక జీపు వుంది ప్రొజెక్టరు వుంది టేప్ రికార్డరు వుంది లౌడ్ స్పీకరు వుంది కుర్చీలున్నాయి ఇంకా చాల వస్తువులున్నాయి వీటిల్లో అత్యధికం కార్మికులనుండి విరాళంగా లభించినవే బిల్డింగుకోసం, జీపుకోసం మా యూనియన్ బాగా ప్రయత్నం చేసింది వివరంగా బడ్జెటు ఒకటి రూపొందించి యింత పైకం కావల్సివుంటుందని కార్మికులకు వెల్లడించాము కార్మికులుకూడ సంతోషంగా చందాలు వేసుకొని ఆ పైకం సర్దారు మేము బయటినుంచి ఎలాంటి సహాయమూ తీసుకోము

ప్రశ్న : మీ యూనియన్ వద్ద ఎంత నిధి వుంది?

జవాబు · మా వద్ద నిధి ఏమీలేదు అలాగని నిధుల కొరతా మాకు లేదు

* * *

## 2

## మనదేశంలో కార్మిక సంఘాలు - పారిశ్రామిక సంబంధాలు

*[ఇండియన్ సోషల్ ఇన్స్టిట్యూట్ వారు వెలువరించే మోనోగ్రాఫు సీరీస్ 20వ సంచికలో "భారతదేశంలో ట్రేడ్‌యూనియన్లు - పారిశ్రామిక సంబంధాలు"అనే శీర్షికన కొంతమంది ట్రేడ్‌యూనియన్ నాయకులతో ఇంటర్వ్యూలను (ఇంగ్లీషులో) ప్రచురించారు. కా శంకర్ గుహా నియోగితో జరిపిన ఇంటర్వ్యూనేగాక కామ్రేడ్ ఎ కె. రాయ్, మైకేల్ ఫెర్నాండెజ్, దత్తాసామంత, డి థంకప్పన్, జార్జి ఫెర్నాండెజ్, గణేష్ పాండే, గీతా రామకృష్ణన్, ఎమ్. సుబ్బులతో ఇంటర్వ్యూలను కూడ ప్రచురించారు వాల్టర్ ఫెర్నాండెజ్ వీళ్లందరినీ ముందే రూపొందించిన కొన్ని ప్రశ్నలు అడిగారు*

వాటికి వీళ్లు యిచ్చిన జవాబుల వెలుగులో భారతదేశ కార్మికోద్యమపు దిశేమిటని అన్వేషించే ప్రయత్నం చేసారు ఆ ప్రశ్నలు, వాటికి నియోగి యిచ్చిన జవాబులు యిక్కడ యిస్తున్నాము ]

ప్రశ్న మీదృష్టిలో నేడు కార్మికోద్యమానికి ఎదురవుతున్న ముఖ్య సమస్యలు ఏమిటి?

జవాబు . ఈ ముఖ్యసమస్యలన్నీ ఆర్థిక అంశాలచుట్టే కేంద్రీకృతమైవున్నాయి అసంఘటిత రంగంలోని ట్రేడ్‌యూనియన్‌లతో ముడిపడివున్న కార్మికుల జీవితం ఎంతో భద్రతారహితంగా వుంటున్నది వాళ్లు గనుక ఇంటక్ సభ్యులు కాకపోతే యిక వాళ్లపని అయిపోయినట్లే ఈ అభద్రతాభావంవల్ల వాళ్లు నేటి వ్యవస్థను ఒప్పకొని తలవొగ్గే స్థితికి నెట్టబడుతున్నారు ఇక సంఘటిత రంగంలోనైతే మేనేజిమెంట్ యిచ్చే అడ్వాన్సుల సమస్య ఒక ముఖ్యసమస్యగా వుంది స్కూటర్ అడ్వాన్సు, పండగ అడ్వాన్సు, ఇల్లుకట్టుకునేందుకు అడ్వాన్సు యిలా అనేక అడ్వాన్సులున్నాయి ఇవన్నీ అప్పులే మరి వీటిని తీర్చడానికిగాను కార్మికుల నెలసరివేతనంలో కోతలు విధిస్తుంటారు ప్రతినెలా సంపాదనలో ఈ కోతలవల్ల కార్మికునివద్ద దైనందిన అవసరాలకు తగినంత పైకం వుండడం లేదు ఫలితంగా కార్మికులు మళ్లీ వేరేచోట్ల అప్పులుచేయడమో లేక మేనేజిమెంటునే మరింత పైకం యివ్వాలని డిమాండు చేయడమో జరుగుతున్నది ఈ క్రమంలో కార్మికుని జీవన ప్రమాణం దిగనాసిల్లి పోతున్నది ఇలా అడ్వాన్సులు తీసుకోవడం కార్మికులకు ఒక ప్రాథమిక కార్యకలాపమైపోయింది ఇది ఆర్థికవాదపు అత్యంత అసహ్యకర రూపం ఈ ఆర్థికవాదం నడకను పరిశీలిస్తే అప్పుడు మనకు ఈ కార్మికులు తమ వర్గచైతన్య భావనల్ని అణచివేస్తూ, అదే సమయంలో తమకు హెచ్చు ఆర్థిక లాభాలు సమకూరుస్తామని హామీలిచ్చే సాంప్రదాయిక రాజకీయపార్టీల వద్దకు ఎందుకు పోతున్నారో అర్థమవుతుంది ఇలాంటి ఆర్థికవాదం నడకవల్ల కార్మికుల పోరాటశీలత అంతరించిపోతూంటుంది

ప్రశ్న ప్రస్తుతం భారతదేశంలోవున్న కార్మిక చట్టాలపై మీ అభిప్రాయం?

**అవాలు** · ఈరోజు మన ఆర్థికవ్యవస్థకు సంబంధించిన వివిధరంగాల్లో **అసమానాభివృద్ధియే** మనముందున్న ప్రధాన సమస్య [దీని పర్యవసానంగా] అనేకానేక సమస్యలతో తలపడవల్సి వస్తున్నది ఉదాహరణకు, కనీసవేతనాల సమస్యనే తీసుకోండి ప్రత్యేకపరిశ్రమలు, ప్రత్యేకప్రాంతాలకు అనుగుణంగా ఈ కనీసవేతనాల స్థాయిలను నిర్ణయించాలనే చర్చ జరుగుతున్నది అలాగే గుత్త కూలి (కంట్రాక్టు కూలి) చట్టంలోని 10వ సెక్షనును సవరించాల్సిన అగత్యం వున్నది ఈ మార్పు అవసరాన్ని గురించి తత్సంబంధిత మంత్రివర్యునికి మేమెంతో వివరించి, ఎంతో నచ్చజెప్పిన పిదపకూడ కార్మికుల పక్షాన చట్టంలో సవరణ తేలేదు ఎప్పుడైనా కార్మికుల పక్షంలో ఏవైనా మార్పులు చేర్పులు జరిగినా అవి అమలు కాకుండా అనేక అడ్డంకులు తెచ్చిపెడుతుంటారు ఉదాహరణకు, ప్రభుత్వంవారు కనీసవేతనాలను పెంచేటప్పుడు, అదే సమయంలో అలా పెంపయిన పైకాన్ని వేరువిధంగా తిరిగి రాబట్టుకునే పద్ధతుల్ని కూడ ప్రోత్సహిస్తున్నారు ఉదాహరణకు బీహార్‌లో ప్రభుత్వంవారు 1500 సారాదుకాణాలు - అవీ ముఖ్యంగా ధన్‌బాద్ బొగ్గు గనుల ప్రాంతంలో - తెరిచారు

ఇదేగాక చట్టాలలో అనేక లోపాలున్నాయి అవన్నీ మేనేజిమెంటు పక్షానికే లాభకరం ఉదాహరణకు కార్మిక చట్టాలను ఉల్లంఘించినందుకు మేనేజిమెంటుకు విధించే శిక్ష లేక జుల్మానా చాల తక్కువ అయితే ఈ చట్టాల అతిక్రమణలవల్ల మేనేజిమెంటుకు కలిగే లాభం మాత్రం అంతకెన్నో రెట్లు ఎక్కువ అదే కార్మికునికి ఏవైనా అతిక్రమణలకని విధించే శిక్షమాత్రం సాపేక్షంగా ఎంతో కఠినంగా వుంటుంది

ఇంకా మేము చెప్పదలుచుకున్నదేమంటే కార్మికులు చక్కగా సంఘటితమైనప్పుడు వాళ్లకు చట్టాల అవసరం ఏమీ వుండదు వాళ్లు తమంతతాము (మేనేజిమెంటుతో) మెరుగైన ఒప్పందాలు చేసుకోగల్గుతారు అలా తాము సొంతంగా చేసుకోవడం వల్ల వారి స్వాభిమానం కూడ హెచ్చువుతుంది చట్టపరంగా వారికే హక్కులు దొరకాలో అవి వారు అసంఘటితంగా వున్నప్పుడు వారికి లభించవు కనుక వారు తమ డిమాండ్లకోసం మంతనాలు, సంభాషణలు జరిపేటప్పుడు చట్టప్రకారం

రావల్సినదానికంటె కాస్తతక్కువే లభించినా ఆక్రమంలో వాళ్ల ఆత్మ విశ్వాసం పెంపొందుతుంది అందువల్ల యిలాంటి విజయాలు వారి భాగస్వామ్యం లేకుండా చట్టపరంగా లభించే అధిక సదుపాయాలకంటే ఎంతో విలువైనవి ప్రజావుద్యమాలను బలవత్తరం గావించే సందర్భంలోనే మనదేశంలో చట్టాలకు ఏ పాత్ర వున్నా వుంట అంతకుమించి వాటికి మరే మహత్తూ లేదు

ప్రశ్న . 1980 తర్వాత పెద్దయెత్తు కార్మికోద్యమాలేవీ సఫలం కాలేదెందుచేత?

జవాబు : ఇటీవలికాలంలోనైతే ఆర్థికమాంద్యం కారణంగా పెద్ద కార్మికోద్యమాలేవీ సఫలం కాలేక పోయాయి పరిశ్రమల్లో ఉత్పత్తి సరియైన దిక్కు లేకుండా జరుగుతున్నది ఫలానా తరహా ఉత్పత్తి ఎందుకు జరుగుతున్నదనే ప్రశ్నే మేనేజిమెంటు ఎన్నడూ వేసుకోదు ఇదేవిధంగా పరిశ్రమల్లో పెట్టే పెట్టుబడులను గురించి కూడ ప్రశ్నలు వేసుకోరు ఉదాహరణకు, విదేశీమార్కెట్లపై పూర్తిగా ఆధారపడివుంది గనుక భిలాయి పరిశ్రమను విస్తరింపజేస్తారు కాని, రూర్కెలా కర్మాగారాన్ని మట్టుకు అభివృద్ధి చేయరు, ఎందుకంటే అది మన స్వదేశీ గిరాకీని మాత్రమే పూర్తి గావిస్తుంది గనుక ఇలాంటి పరిస్థితుల్లో స్థానిక అవసరాలపై దృష్టి సారించవల్సిన ఆవశ్యకత మేనేజిమెంటుకు ఏమీ వుండదు అందువల్ల సమ్మెలు, ఉత్పత్తి తగ్గుదలల విషయమై ఆందోళన ఏమీ చెందరు చూడండి, కొన్ని మిల్లులను, తేయాకుతోటలను ఖాయిలా (జబ్బు) పరిశ్రమలుగా ఎలా ప్రకటిస్తున్నారో -- యిది మన పెట్టుబడి మదుపులకు సంబంధించిన తప్పుడు విధానాలకు ఒక సజీవ ఉదాహరణ మనం మన పరిశ్రమల్ని పవిత్ర గోమాతల్లా చూచుకొంటాము అంటే ఇదివరకెప్పుడో బాగా పాలిస్తూండిన ఆవుల్లాగన్నమాట అయితే ఈ పరిశ్రమలు బాగా లాభాలు తెచ్చిపెడుతున్నప్పుడు మన పారిశ్రామికవేత్తలు వాటిలో (మెరుగుదలలకోసం) పెట్టుబడులు ఏమీ పెట్టరు. ఇక అవి లాభాలు గడించడం మానేసిన పిదప వాటిని పవిత్ర గోమాతల్లా చూస్తారు వాటిని చంపరు, చావనివ్వరు కాగా గోరక్షణశాలలకు పంపి, వాటి సంరక్షణకోసం విలువైన, దుర్లభమైన వనరులు వృధాగావిస్తారు ఇదంతా ఎందుకు జరుగుతున్నదంటే ప్రభుత్వం సరియైన నిర్ణయాలు తీసుకోకుండా అనేక రకాల వత్తిళ్లు తీసుకొచ్చి, జబ్బుపడ్డ మిల్లులు,

కర్మాగారాలను ప్రభుత్వం తన ఆధీనంలోకి తీసుకొనేటట్లు చేస్తారు ఇలాంటి పెట్టుబడి మదుపులవల్ల మన పరిశ్రమలు ఎంత నష్టాలొచ్చినా లెక్కచేయకుంటాయి అందుకే మన కార్మికోద్యమ నాయకులు కూడ సమ్మెలు కట్టడానికి జంకుతుంటారు ఉదాహరణకు [చరిత్రాత్మక] బొంబాయి బట్టల మిల్లుల కార్మికుల సమ్మె సంగతే గమనిద్దాం కార్మికుల డిమాండ్ల సాధన విషయంలోగాని, లేక కార్మికులకు యితర ఏ రాజకీయ లాభాలైనా గడించిపెట్టే విషయంలోగాని ఆ సమ్మె ఘోరంగా విఫలమయ్యింది ఎందుకంటే అక్కడ ఉత్పత్తి లక్ష్యరహితంగా నడుస్తూండడంవల్ల కార్మికులకు సమ్మెపోరాటం అనువైన ఆయుధం కాలేకపోయింది అందుకే ఆ సమ్మె విఫలమయింది

ప్రశ్న : కార్మికవర్గం తన చారిత్రక పాత్ర నిర్వహిస్తున్నదంటారా?

జవాబు కార్మికవర్గం తన చారిత్రకపాత్రను తప్పక నిర్వర్తించాల్సిందే కాని నేడు అలా జరగడంలేదు ఎందుకంటే కార్మికోద్యమ నాయకత్వం వివిధ [అవాంఛనీయ] పోకడలు పోయేట్లుగా వత్తిళ్లకు గురవుతున్నది. కార్మికోద్యమంలో ఆర్థికవాదం, పరిశ్రమల్లో లక్ష్యరహితమైన పెట్టుబడిమదుపులు, లక్ష్యరహిత ఉత్పత్తుల కారణంగా నాయకత్వం దారి తప్పిపోతున్నది ఏ సరియైన దారిలో నడిస్తే కార్మికవర్గం తన చారిత్రక పాత్ర నిర్వర్తించేట్లు చేయగలదో ఆ దారి తప్పిపోతున్నదన్న మాట

ప్రశ్న కార్మికోద్యమంలోని విస్తృత చీలికల్ని ఎలా అంతం చేయగలం?

జవాబు ప్రస్తుతమున్న చీలికలు, విభేదాలు అంతమైపోతాయనే నేను భావిస్తున్నాను మొదట్లో (కార్మికోద్యమంలో) హిందూ-ముస్లిం మతవైషమ్యం వుండేది అయితే నేడా వైషమ్యం బెంగాల్ లో సి పి ఎమ్, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీల మధ్యనో లేక మహారాష్ట్రలో సి పి.ఎం కు శ్రామిక్ సంఘటన లేక షేత్ కారీ సంఘటనలకు మధ్యనో నెలకొనివున్నది ఈ వైరాలకు, ఇదివరకటి మతవైషమ్యానికి గుణాత్మక భేదాలైతే మౌలికంగా లేవనుకోండి ఎందుకంటే ఈ రెండురకాల వైరాలూ నాయకుల మధ్యనే, అందువల్ల నష్టపోయేది సామాన్య కార్మికులే గనుక కార్మికుల్లో వర్గచైతన్యాన్ని ఇతోధికం గావించడంద్వారా ఈ

చీలికను రూపుమాపగల్గుతాము ఇక్కడ మేమది సాధించాము నేను అరెస్టయిన తర్వాత ప్రభుత్వం నాపేరిట అనేక (దొంగ) ఆదేశాలు జారీచేసి ఇక్కడి కార్మికుల సమ్మెను విఫలంచేయ ప్రయత్నించింది. కాని నేను వ్యక్తిగతంగా యిక్కడ లేకున్నా సమ్మెమట్టుకు కొనసాగింది ఎందుకంటే కార్మికులు దాన్ని ఏదో నా కార్యక్రమమున్నట్లుగా కాక తమ సొంత అవసరంగా, సొంత కార్యక్రమంగా చూచుకున్నారు గనుక దత్తా సామంతా నాయకత్వంలోని ప్రీమియర్ ఆటోమొబైల్సు సమ్మె విషయంలో కూడ యిలాగే జరిగింది

ప్రశ్న కార్మికోద్యమాలు ఎక్కువగా ఆర్థిక డిమాండ్లకు, కార్మికుల పని పరిస్థితులకు సంబంధించిన డిమాండ్లకు మాత్రమే పరిమితమై వుంటున్నాయి ఇలా ఫాక్టరీగేట్లవద్ద కార్యకలాపాలు జరిగినంత మాత్రాన సరిపోతుందా? దీనికి తోడుగా యింకేమైనాకూడ జోడించాల్సిన అవసరం వుందా? అదెట్లా?

జవాబు · కార్మిక సంఘాలు కార్మికవాడల్లోకి వెళ్లికూడ పనిచేయాల్సి ్రంటుంది ఎందుకంటే కార్మిక సంఘాలంటే కార్మికుల జీవితాల్లో ఏదో .క భాగానికే పరిమితమై వుండడానికి (ఉద్దేశించబడినవి) కావు గనుక కార్మిక సంఘాలు కార్మికుల సాంఘిక, సాంస్కృతిక జీవితమంతటిపై ప్రభావం చూపించాల్సి వుంటుంది కార్మిక సంఘాలు గనుక కార్మికుల జీవితంలో ఒక అభిన్న అంగంగా అయి పనిచేయగల్గితే, అప్పుడు కార్మికోద్యమాల్లోని సైద్ధాంతిక, రాజకీయ చీలికలు అంతరించిపోగలవు.

ప్రశ్న మీరే కార్మిక సంఘానికి సంబంధించివున్నారో అది ఎలాంటిది? మీరు నాయకత్వం వహిస్తున్న సంఘం తగువిధంగా, చాలినంతగా వున్నదని భావిస్తున్నారా? మీ కార్మిక సంఘం ఎదుర్కొంటున్న [ముఖ్య] సమస్య ఏమిటి?

జవాబు : కార్మిక సంఘపు ఆర్థిక కోణాలను దాటి యింకాముందుకు వెళ్లి పనిచేయడానికి ప్రయత్నిస్తున్నాం మేము అంతేగాక స్వయంగా కార్మికులు సైతం మమ్మల్ని మామూలు కార్మిక సంఘంకంటె ఉన్న తమైన ఒక అస్తిత్వంగా భావిస్తున్నారనిపిస్తోంది అక్కడ కూర్చున్న స్త్రీని చూడండి ఆమె ఒక సాంఘిక సమస్యను తీసుకువచ్చింది

ఆ పక్కనే కూర్చున్న మరో వ్యక్తి తన గ్రామంలోని భూమి సమస్య గురించి మాట్లాడడానికి వచ్చాడు

కాని మేము సఫలులమయ్యాము అనైతే చెప్పలేము ఆర్థికవాదం సంగతటుంచితే ప్రభుత్వంవారు మా నాయకుల్ని అవినీతిపరుల్నిగా చేయడానికి (దిగజార్చడానికి) ప్రయత్నంచేస్తున్నారనికూడ గుర్తుపెట్టు కోవాలి మానాయకుల్లో సుమారు 5 శాతం మందిని, వారితోబాటు మరికొందరు కార్మికులను దిగజార్చడంలో వాళ్లు కృతకృత్యులయ్యా రుకూడ కార్మికనాయకుల్ని దిగజార్చే మేనేజిమెంటు ప్రభావాన్ని ఎదుర్కొనడం అతికష్టమైన పని మొత్తం వాతావరణాన్నే మార్చే కృషిచేయాల్సి వుంటుంది అయితే అవినీతికర పద్ధతుల్ని ఎదిరించి, వాతావరణాన్ని మార్పుచేసేందుకు మేము ప్రయత్నిస్తూనే వున్నాము

మేము వేరే సమస్యలుకూడ చేబట్టుతున్నాము ఇక్కడ కార్మికుల్లో తాగుడు బాగా ప్రబలివుంది ఇదొక ముఖ్య సమస్య ఆ మాటకు యిక్కడి కార్మికవాడలో మంచినీటి పంపులకంటె దొంగసారా దుకాణాలే ఎక్కువగా వున్నట్లనిపిస్తుంది గ్రామాల్లో ఏవైనా సాంఘిక కార్యక్రమాల (functions) సందర్భంగా అంతోయింతో తాగడానికి అలవాటు పడ్డ ఆదివాసులు యిక్కడికి వచ్చి సారాకు బానిసలై పోతున్నారు వాళ్ల జీవితాల్లో అస్థిరతకు, ఉద్రిక్తతకు తాగుడు మూలకారణమై పోతున్నది సారాకు అలవాటుపడ్డ కార్మికులు క్రమక్రమంగా తమ ఆత్మగౌరవాన్నికూడ కోల్పోతారు; సంఘటితమై, (పోరాట దృక్పథంతో) ఆలోచించే శక్తి వారిలో అంతరించిపోతుంది అంతేగాక సారాకోసం డబ్బులు మంచినీళ్లలా ఖర్చుపెడుతూ కార్మికులు డబ్బులు (వేతనాలు) యింకా యింకా ఎక్కువకావాలని చీటికీ మాటికీ డిమాండుచేస్తుంటారు దీనిమూలంగా వాళ్ల ట్రేడ్ యూనియన్ ఆర్థికవాద విషవలయంలో చిక్కుకుపోతుంది కార్మికుల్లో ఐక్యత, వర్గసంఘీభావాలు మెల్లమెల్లగా అడుగంటిపోతాయి

మేమీ (తాగుడు) సమస్యను ఎదుర్కొవి పని చేస్తున్నాము తోడ్తోడుగా కార్మికుల ఆరోగ్యసమస్య మొదలైన యితర సమస్యలు కూడ చేపట్టాము ఈ రంగాల్లో (మా పనిని చూచి) మేము

కార్మిక సంఘంకంటె ఉన్నతమైన అస్తిత్వమని యితర సంఘాలు కూడ భావిస్తున్నాయి మద్యనిషేధ ప్రచార సంఘం వాళ్లు తమ మీటింగులకు మమ్మల్ని కూడ పిలుస్తుంటారు మేము ఒక ఆస్పత్రికూడ నడుపుతున్నాము ఇది యితరులకు ఆదర్శప్రాయం కాగలదు

పోతే సాంస్కృతిక రంగాన్ని సైతం మేము విడిచిపెట్టలేదు గిరిజన నాయకుడు అమరవీరుడు నారాయణ్ సింగ్ వర్ధంతినాడు మేము ప్రతిఏడూ ఒక ఉత్సవం జరుపుతాము మరే ప్రభుత్వ ఉత్సవాలకంటే ఎక్కువగా మా ఉత్సవానికే ప్రజలు హాజరవుతుంటారు ఎందుకంటే మా ఉత్సవ కార్యక్రమాలు వాళ్ల స్వీయ సంస్కృతికి అధికంగా గుర్తింపునిచ్చి వాళ్ల స్మృతుల్ని అలరిస్తాయి గనుక ఉదాహరణకు గతసంవత్సరం ఈ ఉత్సవం సందర్భంగా రాష్ట్రమంత్రులు ఐదుగురు యిక్కడికి ఒక్కుమ్మడిగా వచ్చి ఈ ప్రాంతాన్ని పర్యటించి జనాల్ని ఆకర్షించేందుకు విశ్వప్రయత్నాలు చేశారు అయితే వాళ్లంతా కలిసికూడ 15,000 మందికి మించి జనాన్ని ఆకర్షించలేకపోయారు ఆ జనంలోకూడ ఎక్కువమంది తర్వాత వచ్చి మా కార్యక్రమంలో కలిసిపోయారు కాగా మా కార్యక్రమాల్లో సుమారు 70 వేలమంది జనం పాల్గొన్నారు

* * * * *

# 3. భిలాయి కార్మికులకు విజ్ఞప్తి

*[మిటాన్, 11, 9-9-1977]*

రాజ్‌హారా గనికార్మికుల వీరోచిత పోరాటం దరిమిలా భిలాయి కార్మిక సహచరులుకూడా కొత్త పోకడలో ఆలోచించడం మొదలుపెట్టారు సరైన నాయకత్వం గనుక వుంటే కార్మికోద్యమంలో గుణాత్మకమార్పు సాధ్యమనే విషయాన్ని రాజ్‌హారా గనికార్మికుల పోరాటం రుజువు చేసింది పోరాట మార్గంలో పయనించేటప్పుడు కుదిరే ఐక్యత చాల విస్తృతంగానూ, ఎంతో లోతుగానూ వుండగల్గుతుంది

భిలాయి కార్మికులు కూడ పోరాటాల్లో బాగానే పాల్గొని వున్నారు దుర్మార్గులను, తప్పుడు విధానాలను చురుగ్గా ఎదిరించారు కోక్ ఓవెన్ కార్మికులు ప్రోత్సాహక బోనస్‌కై జరిపిన పోరాటం, మెషిన్ షాపు కార్మికుల పోరాటం, ఓపెన్ - హార్త్ కార్మికుల పోరాటం, గ్యాస్ ఫెసిలిటీస్ కార్మికుల ఘెరావ్ - యివన్నీ అక్కడి కార్మికోద్యమంలో ఒక నూతన చైతన్యం తీసుకువచ్చివుండినాయి

ఇక 1967 జూన్ 20వ తేదీనాడైతే భిలాయి కార్మికులు ఒక కొత్త పోరాట చరిత్ర సృష్టించారు ప్రతి కులీన (elitist) నాయకుడికి, ప్రతి కార్మికద్రోహి నాయకుడికి బాగా దేహశుద్ధి చేశారు ఈ జూన్ 20 పోరాటం ద్వారా కార్మికులు అంతవరకు నాయకులుగా చెలామణీ అవుతూ వస్తూండిన వినాయకుల్ని తీసిపారవేసి ఒక కొత్త నాయకత్వాన్ని రూపొందించుకున్నారు

పోతే రైలు రవాణా-బ్లాస్ట్ ఫర్నేస్ కార్మికుల పోరాటమైతే భారత దేశంలోని అతిగొప్ప కార్మిక పోరాటాల్లో ఒకటిగా పరిగణింపబడగలదు ఆ పోరాటంలో కార్మికులు ప్రదర్శించిన అపూర్వ సమరశీలత మనందరికీ ఒక చక్కని ఉదహరణగా నిలిచిపోతుంది అలాగే హార్త్‌మెన్ల

(కొలిమి కార్మికుల) పోరాటమైతే అఖిలభారతఖ్యాతి నార్జించింది ఆ పోరాటమప్పుడు కార్మికనాయకుడు నాయర్‌ను పోలీసులు అరెస్టు చేసి తీసుకువెళ్లితే, కార్మికులంతా ఒక్కుమ్మడిగా నిలిచి "నాయర్‌ను తిరిగి తీసుకురండి!" అని గర్జించారు ఆ గర్జనలకు అదలిపోయిన మేనేజిమెంటు చివరకు అందుకు తలవంచకతప్పలేదు

ఇంత సుదీర్ఘ పోరాట సంప్రదాయం వున్నప్పటికీ భిలాయి కార్మికుల్లో యిప్పటికీ ఒక బలీయమైన ఐక్యత నెలకొనలే దెందుచేత? అక్కడి కార్మిక నాయకులు ఎందరో తమ ఉద్యోగాలు వదులుకోవల్సివచ్చింది కూడ ఇన్ని త్యాగాలు జరిగినా నేటికీ భిలాయి కార్మికులు నీటిలో మునిగిపోతున్న మనిషిలా ఊపిరాడక విలవిలలాడే పరిస్థితుల్లోనే వున్నారు దీనికి కారణం ఏమిటి?

ఇందుకు కారణమేమిటంటే భిలాయి కార్మికులు నేటికీ యజమాని వర్గం తొత్తులయిన దళారీ నాయకుల వలలోనే చిక్కివున్నారు నేడక్కడి ఏ కేంద్రకార్మికసంఘపు నాయకుల్లోనైనా కార్మికులు గాని లేక కార్మికుల శుభచింతకులుగాని ఒక్కరైనా లేరు ఇలాంటి ట్రేడ్ యూనియన్ నాయకుల్నే కార్మికవర్గ కులీన ప్రభువులు (Labour aristocracy) అని పిలుస్తారు

- *ఈ నాయకులు పోరాటాలను అడుగడుగునా అడ్డుకొంటూ కార్మిక వర్గపు పమరశీలతను దెబ్బతీస్తారు*
- *వీళ్లు నిరంకుశాధికార పద్ధతులు అవలంబించి కార్యకర్తల చురుకుదనం, క్రియాశీలతలను దెబ్బతీస్తారు కార్మికుల (చొరవ)ను అణచివేస్తారు*
- *వీళ్లెప్పుడూ విజయం సాధించితీరాలని గాక (ఏదో ఒక) ఒప్పందానికి వద్దామనే వివాదాలు యిస్తూ వర్గసామరస్యపు నపుంసక విధానాన్ని అమలు చేస్తుంటారు.*
- *ట్రేడ్ యూనియన్ వ్యవహారాల్లో బేరసారాలు ఆడుతూ వీళ్లు బ్రోకర్ల (దళారీ) మార్గం అనుసరిస్తారు.*

★ వీళ్లు ట్రేడ్ యూనియన్లను కేవలం ఆర్థిక పోరాటాలకు మాత్రమే ఉపయోగిస్తారు పర్యవసానంగా కార్మికవర్గాన్ని ఆర్థిక వాద గోతిలో పడదోస్తుంటారు

★ కార్మికవర్గ అంతర్జాతీయత ముసుగున వీళ్లు బాహాటంగా సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగు లొత్తుతుంటారు

వీరోచిత భిలాయి కార్మికులారా, కేంద్ర కార్మిక సంఘాలని చెప్పుకునే వాటి వలలో మీరు చిక్కివుండేంతకాలం మీ మధ్య బలీయమైన ఐక్యత నెలకొనడం సాధ్యంకాదు కనుక వర్గ పోరాటం ప్రాతిపదికన మీ (సమరశీల) ట్రేడ్ యూనియన్ ఏర్పరుచుకోండి ప్రతి చోటా పోరాట కమిటీలు స్థాపించుకొనండి ప్రతిచోటా కార్మిక పోరాటానికి ప్రాముఖ్యం యివ్వండి ఒక సృజనాత్మక ఆలోచనా ధోరణి ఆధారంగా మీ కార్యక్రమాలు రూపొందించుకొనండి కార్మిక వర్గానికి అత్యంత సమీప బంధువైన కర్షకవర్గం బరువు బాధల్లో పాలు పంచుకొనండి అప్పుడే మీరు మీ ఆర్థిక పోరాటాలు, ఆత్మగౌరవ పోరాటాలు అన్నింటిలో విజయం సాధించగల్గుతారు. ఆ క్రమంలో మీరు దేశ ప్రజలక నాయకత్వం వహించ గల్గుతారు

నేడు భారతదేశానికి కొత్త రక్తం, కొత్త ఆలోచనలు, కొ్త నాయకత్వం అవసరం. ట్రేడ్ యూనియన్లద్వారా జరిపే వర్గ పోరాటాల ఆధారంగా మాత్రమే మీరు సాహసంతో, త్యాగదీక్షతో ముందుకు సాగే, పోషలిస్టు సమాజ నిర్మాణార్థం దేశ ప్రజలకు మార్గదర్శకత్వం వహించగల్గే ఒక నూతన నాయకత్వాన్ని సృష్టించి యివ్వగల్గుతారు

* * * * *

# 4. నాయకత్వ సమస్యపై

*[మితాన్, 1.3, 25-10-1977]*

సుభాష్ చంద్ర బోస్‌ను నేతాజీ అని అనురాగాభిమానాలతో పిలిచే వాళ్లు బ్రిటిషు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో భారత ప్రజలు తమ నాయకుల్ని ఆదరాభిమానాలతో చూచుకొనే వాళ్లు వారి వెనుక నడిచి ప్రాణాలు బలిపెట్టడానికి సైతం సిద్ధపడే వాళ్లు జాతీయ నాయకుల పిలుపుపై లక్షలాదిమంది జైళ్లకు వెళ్లి నానాయాతనలు పడేవాళ్లు ఆ రోజుల్లో నాయకులంటే, నాయకత్వమంటే సాధారణ ప్రజలకు చాల నమ్మకం వుండేది

కాని నేడు కాంగ్రెసు పాలనలో నాయకులంటే మనకు ఓ తెల్లటి ఖద్దరు పంచె, దానిపై పొడుగాటి చేతుల ఖద్దరు చొక్కా ధరించి తలకు గాంధీ టోపీ పెట్టుకొని బాగా కొవ్వుపట్టి బొజ్జ పెంచుకున్న వ్యక్తి ఆకారమే చటుక్కున గుర్తుకొస్తుంది ఇలాంటి వాళ్లు సదా కోర్టులు, ఆఫీసులు, పార్లమెంటు, అసెంబ్లీల చుట్టూ తిరుగుతూండడం గమనిస్తాము ఈ ఖాదీధారుల ముఖ్య కార్యకలాపం - అధికారుల చుట్టూ చక్కర్లు కొడుతూ భట్రాజుపొగడ్తలతో వారిని మచ్చిక చేసుకొనడం, లేదా భోపాల్, ఢిల్లీ, లండన్‌ల వంటి నగరాల్లో లెక్చర్లు దంచడమే ఈ నాయకులు ప్రధానంగా జమీందారీ లేదా వడ్డీవ్యాపారులు లేదా సాధారణ వ్యాపారుల వర్గాలకు చెందినవారైవుంటారు భట్రాజుతత్వం వీళ్ల నరనరానా జీర్ణించి వుంటుంది "ఎక్కడ బెల్లం, అక్కడ మనం" అనేది వీళ్ల జీవితతత్వంగా వుంటుంది ఇలాంటి నాయకుల ఆధ్వర్యంలో యిప్పటికే 30 ఏళ్లకాలం గడిచిపోయింది ప్రజలు యీ నాయకుల్ని తీవ్రంగా అసహ్యించుకొంటుంటారు అందుకే నేడు నాయకుడు అనే పదంపట్లే ఒక విధమైన ఏవగింపు ఏర్పడిపోయింది "చాల్లే,

పెద్ద నాయకత్వం చెలాయించబోకు!" అనేది సాధారణ జనవాక్యం అయిపోయింది అయినప్పటికీ నాయకుల అవసరం పడుతూనే వుంది నాయకుడంటూ ఒకరు లేకుండా పని నడవడం లేదు నాయకుడి కోసం వెదుక్కోవల్సివస్తున్నది

నేడు దేశం పరిస్థితి చూస్తే పోరాటం వినా మరో (విముక్తి) మార్గం లేదని మనకు స్పష్టమవుతుంది పోరాటం చేయాలంటే సరియైన నాయకత్వం అవసరం మరి యీ సరైన నాయకత్వం ఎక్కడి నుండి వస్తుంది? ఆకాశంనుండి ఊడిపడుతుందా లేక మళ్లీ ఈ ఖద్దరు బట్టలోళ్లనే పట్టుకోవల్సివుంటుందా లేక మరింకే మార్గమైనా వుందా? ఈ ప్రశ్నలకు జవాబులు కావాలంటే మనం నాయకుడు, నాయకత్వం అనే పదాల అర్థం గురించి లోతుగా తరచి అవగాహన చేసుకోవాలి

అందరికంటే ఎక్కువ వర్గచైతన్యం గలవాడే నాయకుడు నాయకుడు అనే పదాన్ని వెన్నంటే వర్గచైతన్యం అనే పదం కూడ వస్తూంటుందని తెలుసుకోవాలి నాయకుడు వర్గ ప్రాతిపదికపైనే వుంటాడు సమాజంలో ప్రధానంగా రెండు వర్గాలు - ఒకటి పీడక (దోపిడీ) వర్గం [జమీందార్లు, వడ్డీవ్యాపారులు, దళారీలు, పెట్టుబడిదారులు], రెండవది పీడిత వర్గ [కార్మిక, కర్షక, తదితర శ్రామికప్రజలు] వున్నాయి పైన మన పేర్కొన్న ఖద్దరు వస్త్రధారులు దోపిడీ వర్గం నాయకులు ప్రస్తుత సామాజిక వ్యవస్థను యథాతథంగా అట్టిపెట్టివుంచడమే వారి ధ్యేయం. మనకు ఈ దోపిడీ వర్గంతో నిమిత్తం లేదు మనం కార్మిక కర్షక వర్గాల నాయకత్వం గురించే యోచన చేయాల్సివుంది రైతు, కూలీల రాజకీయాలతో ముడిపడి వుండే కార్మిక, కర్షక పార్టీల ద్వారానే కార్మిక, కర్షక వర్గాల నాయకత్వం కుదురుకొనడం సాధ్యం పార్టీ అంటే వర్గం చేతి ఆయుధమన్నమాట మన దోపిడీ వర్గ నాయకులు కార్మిక, కర్షక వర్గాలకు నాయకత్వం వహించగలరా? లేదండీ, దోపిడీ వర్గాలు కార్మికుల్ని, కర్షకుల్ని వంచనతో తమవెంట అవశ్యం సమీకరించుకుని వుంటాయి గాని అది కార్మిక, కర్షక వర్గాల ప్రయోజనాలకోసమైతే కాదు తమ స్వార్థ ప్రయోజనాలకోసమే అవి భట్రాజు పొగడ్తలు, తీయని కబుర్లతో కార్మిక, కర్షక వర్గాలను బుట్టలో వేసుకుంటాయి కనుక

కార్మిక, కర్షక సోదరులకు ఒక సరియైన పార్టీ ఏర్పడి, దానికి త్యాగదీక్ష కలిగిన కార్మిక నాయకులు లభించినప్పుడే కార్మిక, కర్షక ప్రజల కళ్యాణం సంభవం దోపిడీ వర్గాల నాయకత్వాన్ని అసహ్యించుకొని, తిప్పికొట్టి కార్మికవర్గ నాయకత్వాన్ని ఆదరించి, విశ్వసించాల్సిన అగత్యం నేడు శ్రామిక ప్రజలకున్నది అలాగే అశేష ప్రజానీకానికి నమ్మక పాత్రంగా నిలిచివుండేందుకు నిరంతరయత్నాలు చేయవల్సిన అవసరం, ఛత్తీస్‌గఢ్‌లోని, భారతదేశమంతటాగల లక్షలు, కోట్లాది పీడిత తాడిత ప్రజల విముక్తి పోరాటంలో ధైర్యసాహసాలతో ముందుకు సాగాల్సిన బాధ్యత కూడా కార్మిక వర్గానికి వున్నాయి

## కార్మిక కర్షక వర్గాల ధ్యేయం ఏమిటి?

దళారీ పెట్టుబడిదారులు, భూస్వామ్య వర్గాల రాజ్యాధికారాన్ని అంతంచేసి శ్రామిక వర్గాల ఆధిపత్యం వుండే నూతన రాజ్యాధికారాన్ని నెలకొల్పుకొనడమే కార్మిక, కర్షక వర్గాల ధ్యేయం కనుక [ఈ లక్ష్యాన్ని దృష్టిలో వుంచుకుని] కార్మిక, కర్షక వర్గాల నాయకులు తమ భావికార్యక్రమాలపట్ల పూర్తి జాగరూకతతో మెలగాల్సిన తప్పనిసరి అవసరం ఎంతైనా వుంది

## సంస్కరణ వాదాన్ని ఏవగించుకొనండి!

పెట్టుబడిదారీ ఆలోచనాధోరణులు వెంటబెట్టుకుని కార్మికవర్గ నాయకత్వంలో చొరబడేవాడే సంస్కరణవాది ఈ ముసుగులో దాగిన పెట్టుబడిదారీవర్గ నాయకత్వం కార్మికుల ఐక్యతను, శక్తియుక్తులను వర్గ పోరాట మార్గంలోకికాక వర్గసామరస్య పథంలోకి మళ్లిస్తుంది ఈవిధంగా యిలాంటి నాయకత్వం కార్మికవర్గాన్ని వెన్నుపోటు పొడుస్తుంది. భారత కమ్యూనిస్టు పార్టీ (సి పి ఐ), భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) [సి పి ఎం]లు మన దేశంలోని రెండు ప్రధాన సంస్కరణవాద పార్టీలు. ఈ రెండు పార్టీలకు రెండు కేంద్ర కార్మిక సంఘాలు - ఐటక్ (AITUC), సీటూ (CITU) లు వున్నాయి ఈ సంస్కరణవాదులు సదా శత్రుబలాన్ని అతిగా అంచనావేసి చూస్తుంటారు

## వామపక్ష పెడ పోకడ నుండి రక్షించుకొవండి!

పోతే కార్మికనాయకత్వం వామపక్ష పెడ పోకడ (Left deviation) నుండి కూడ రక్షించుకోవాల్సి వుంటుంది ఈ వామపక్ష పెడపోకడ శత్రుబలాన్ని బాగా తక్కువ అంచనా వేసి చూస్తుంది అది తనపై తాను అధిక విశ్వాసం వుంచుకొంటుంది సాధారణ ప్రజలపై నమ్మకముంచదు ఎప్పుడూ ప్రజలకంటే ఒక అడుగు ముందుకు నడవాలనే విధానం అవలంబిస్తుంది గోడకు తలకొట్టుకొనే విధానం యిది

సంస్కరణవాదంనుండి, వామపక్ష పెడపోకడనుండి తనను కాపాడు కొంటూ సరియైన అవగాహనతో, సవ్యమైన అంచనాలతో, సక్రమమైన విధానాలు అవలంబించాల్సిన అవసరం కార్మిక, కర్షక వర్గాల సరైన నాయకత్వానికి ఎంతైనా వుంది సాధారణ స్థితిని, ప్రత్యేక పరిస్థితిని రెంటినీ సరైన విధంగా మేళవించాల్సిన కర్తవ్యం కార్మిక వర్గ నాయకత్వానికి వుంటుంది ఉదాహరణకు దోపిడీ వర్గాలు (భూస్వామ్య, పెట్టుబడిదారీ వర్గాలు) సాధారణంగా కార్మిక, కర్షక తదితర శ్రామిక ప్రజల్ని దోపిడీ చేస్తుంటాయి [ఇది సాధారణ స్థితి] అయితే ఆ దోపిడీ విధానానికి సంబంధించిన ఏ కోణంపై తాము మొదటగా నిరసన గొంతుక ఎత్తాలో నాయకత్వానికి ఎరుక వుండాలి. దోపిడీ, పీడనలపై ఆధారపడిన వ్యవస్థ సాధారణ అంశమైతే, ఏ సమస్యపై పోరాటం చేయాల్సి వుంటుందో అది ప్రత్యేక అంశం

కార్మిక, కర్షక ప్రజల సరైన నాయకత్వం ఈ క్రింది వ్యవహార నియమాల ప్రకారం నడుచుకోవాలి

1 నమ్రతతో మాట్లాడాలి

2 ప్రజాధనాన్ని సొంతలాభం కోసం ఖర్చు పెట్టరాదు

3 ప్రజల దగ్గరనుండి ఏ వస్తువులూ - సాధారణ వస్తువులుసైతం తీసుకొనరాదు

4 ఒకవేళ ప్రజల వద్దనుండి ఏదైనా వస్తువు అవసరంపడి తీసుకొనివుంటే దాన్ని సజావుగా తిరిగి యిచ్చేయాలి

5 ఎవరికీ నష్టం కలిగించవద్దు, ఒకవేళ మీవల్ల ఎవరికైనా నష్టం జరిగితే దానికి వెంటనే పరిహారం చెల్లించాలి

6 ఆడవాళ్లతో మర్యాదగా ప్రవర్తించాలి

7 ప్రజలకోసం జీవించాలి, ప్రజలకోసమే మరణించాలి

8 ఎలాంటి త్యాగాలకైనా వెనుదీయరాదు

9 ఒక సామాన్య కార్మికునిలా సాధారణ జీవితం గడపాలి

10 ఏమిచేసినా విస్తృత ప్రజానీకం ప్రయోజనాలకోసమే చేయాలి

కార్మిక, కర్షక వర్గాల నాయకత్వం సర్వదా సకల వర్గాల బరువు బాధలు ఎదుర్కొనడానికి సంసిద్ధంగా వుండాలి అప్పుడప్పుడూ పోలీసుల క్రూరహింసలు, [సుదీర్ఘ] కారాగారవాసం, భయంకర దారిద్ర్యం మొదలైనవన్నీ భరించాల్సివస్తుంది అయినప్పటికీ యిలాంటి అడ్డంకుల న్నింటినీ అధిగమిస్తూ పోరాటపథంలో సాగిపోవాల్సివుంటుంది దోపిడీ, పేదరికాలకు, ఆకలికి, అవినీతికి, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా సరియైన పోరాటాలు నడుపుతూ, దోపిడీ, పీడనలు లేని ఒక సుందర భారత స్థాపనకుగాను నిర్మాణాత్మక కార్యక్రమాలుకూడా చేపట్టే ఒక సరియైన [శ్రామిక వర్గ] నాయకత్వం నేడు మనదేశానికి ఎంతైనా అవసరం

* * * * *

# 5. దల్లీ - రాజ్‌హారా గని కార్మికుల అనుభవాల పాఠాలు

*[మిఠాన్, 4:1, 16-12-1981]*

ఛత్తీస్‌గఢ్ గని కార్మికుల సంఘం (CMSS -ఛత్తీస్‌గఢ్ మైన్స్ శ్రామిక్ సంఘ్) నాయకత్వంలో దల్లీ - రాజ్‌హారా గనికార్మికులు జరిపిన చరిత్రాత్మక పోరాటం, చేసిన నిస్వార్థత్యాగాలు కేవలం ఛత్తీస్‌గఢ్ శ్రామిక ప్రజలకేగాక యావద్దేశ కార్మికులకు గొప్ప ప్రేరణగా నిలిచిపోతాయి సమరశీల నాయకత్వం లభించినప్పుడు కార్మికులు తమ ఆర్థిక ప్రయోజనాలకోసం చురుగ్గా పోరాడడం, తోడ్తోదుగా అశేష త్యాగాలకు సంసిద్ధులవడం సహజమే పోరాటాలు, త్యాగాల ఫలితంగా జనించిన తమ ఐక్యతను, సంఘబలాన్ని దల్లీ - రాజ్‌హారా గని కార్మికులు కంట్రాక్టర్ల దోపిడీకి, పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాల దమనకాండకు విరుద్ధంగా ఎంతో విలక్షణమైన రీతిలో ప్రయోగిస్తున్నారు తమ సంఘబలం ఆసరాగా వాళ్లు ఇతర అసంఘటిత లేక అల్పవేతనాలుపొందే కార్మికులను సంఘటితం చేస్తున్నారు అలాంటి కార్మికులు తమ సాంఘిక, ఆర్థిక పరిస్థితుల మెరుగుదలకోసం జరిపే పోరాటాల్లో గని కార్మికులు కూడ చురుగ్గా పాల్గొంటున్నారు రంపం మిల్లు కార్మికులకు, గారేజ్ కార్మికులు, థియేటర్ల కార్మికులకు తగు న్యాయంకోసం వారితో కలిసి గని కార్మికులుకూడా పోరాడారు తాగుడు, జూదం, స్త్రీలపట్ల దుర్వ్యవహారం మొదలైన సాంఘిక చెడుగులకు వ్యతిరేకంగా ఈ కార్మికులు విస్తృత పోరాటాలు జరిపారు మహత్తర విజయాలు సాధించారు ఛత్తీస్‌గఢ్ గని కార్మికుల సంఘం దల్లీ - రాజ్‌హారాకు చెందిన పేద ప్రజానీకంలో ప్రజారోగ్య మెరుగుదల వుద్యమం ప్రారంభించింది. వారికి పరిశుభ్రమైన అలవాట్లు నేర్పించడానికి, ఆరోగ్య సంబంధమైన చైతన్యం వ్యాప్తి

చేయడానికి ప్రస్తుతం ముగ్గురు డాక్టర్లు యిక్కడ తమ స్వచ్ఛంద సేవలు సమర్పిస్తున్నారు

సాంస్కృతిక రంగంలో సైతం కార్మికులు చెప్పుకోదగ్గ విజయాలే సాధించారు నవా అంజోర్ (ఉషాకిరణ - తొలిపొద్దురేక) ఛత్తీస్‌గఢ్ కళామండలి యిక్కడి కార్మికుల సాంస్కృతిక సంఘం దోపిడీ, పీడనలు లేని ఒక నూతన ఛత్తీస్‌గఢ్ నిర్మాణానికి గాను ప్రజలలో ఒక విప్లవ ఐక్యత సాధనకు అది కళల ద్వారా ప్రేరణనిస్తుంది దల్లీ-రాజ్‌హారా గని కార్మికులు విప్లవ చైతన్యంతో మరో అడుగు ముందుకువేసి ఛత్తీస్‌గఢ్ కర్షకులనుకూడ సంఘటితం గావిస్తున్నారు; దోపిడీ, పీడనలను ఎదిరించి పోరాడడంలో కర్షకులకు నాయకత్వం వహిస్తున్నారు కూడ దల్లీ - రాజ్‌హారా గని కార్మికులు రైతాంగంతో ఒక సుదృఢ ఐక్యత నెలకొల్పుకున్నారు. ఈ కార్మికుల నాయకత్వంలో దుర్గ్, రాజ్‌నంద్‌గావ్ జిల్లాలలోని అనేక గ్రామాలలో రైతు పోరాటాలు సాగుతున్నాయి

ఈ దేశంలోని కార్మికులు బహు స్వార్థపరులు, వారు కేవలం తమ ఆర్థిక లాభాలకోసమే పోరాడుతారు [గాని మరేమీ పట్టించుకొనరు] అని అభివృద్ధినిరోధక సంస్కరణవాద నాయకులు అంటుంటారు కాని దల్లీ - రాజ్‌హారా గని కార్మికులు రైతు పోరాటాలకు మద్దతు నివ్వడం [నాయకత్వం సమర్పించడం] ద్వారా ఈ అబద్ధాన్ని చీల్చిచెండాడారు కార్మికవర్గం సర్వత్రా విప్లవకరమైనదే; శ్రామిక ప్రజలను సంఘటితం చేయడానికి, దేశంలో విప్లవాత్మక మార్పులు తీసుకురావడానికి తగు సామర్థ్యం వున్నదే ఇతర శ్రామిక వర్గాల పట్ల, తమ దేశం పట్ల తమకు గల బాధ్యతగురించి ఈ కార్మికవర్గానికి అవగాహన లేకపోలేదు కాగా, నేటి అభివృద్ధినిరోధక, సంస్కరణవాద నాయకులే ఈదేశ కార్మికులను పరిమిత హద్దుల్లో కట్టివేసి, వాళ్లను స్వార్థపరులుగా రూపొందించారు

ప్రభుత్వ అణచివేత వ్యవస్థ నేడు ఎంత నిర్దాక్షిణ్యమైనదిగా, ఎంత బలవత్తరంగా రూపొందివుందంటే ఈనాడు ఏ కార్మికోద్యమమైనా యితర శ్రామిక వర్గాలతో, ప్రత్యేకించి కర్షకులతో, ఐక్యత నెలకొల్పుకొననిదే పోరాటంలో అంతిమ విజయం సాధించగల్గడం అసంభవమే ప్రజలు సౌభాగ్యస్థితి పొందాలని నిజాయితీగా కలలుగనే వ్యక్తులెవరయినా గాని

నేడు దల్లీ - రాజ్‌హేరా గని కార్మికుల అనుభవాలను గమనికలోకి తీసుకోకుండా వుండజాలరు

* * * * *

# 6. పోరాడుతాం, గెలుస్తాం, ఒక నవసమాజం నిర్మిస్తాం !

*[ఛత్తీస్‌గఢ్ ముక్తి మోర్చా బులెటిన్ 3, 17-1-1981]*

ప్రపంచం చాల ముందుకు పోయిందిగాని ఈ ప్రపంచంలోని లాభాలు, సౌకర్యాలు అన్నీ గొప్పవాళ్లకు మాత్రమే ఈ గొప్ప మనుషులు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా వంటి మహానగరాలు విమానాల్లో చుట్టి వస్తుంటారు పంచభక్ష్య పరమాన్నాలు భుజిస్తారు రంగురంగుల బట్టలు ధరిస్తారు వీళ్ల పిల్లలు కార్లలో స్కూళ్లకు వెళ్లుతుంటారు వీళ్ల ఇళ్లల్లో అమ్మాయిలు శ్రేష్ఠమైన గౌనులు, ఖరీదైన చీరలు ధరించి సీతాకోక చిలుకల్లా ఎగురుతుంటారు కాని ఈ పెద్ద మనుషులు శ్రమ మాత్రం చేయరు వీళ్లకు నౌకర్లుంటారు ఆ నౌకర్లే వంటలు వండుతారు బట్టలు ఉతుకుతారు అన్ని పనులు నౌకర్లే చేస్తారు. ఆఖరుకు ఒక గ్లాసు నీళ్లు తాగాలన్నా అది నౌకర్లు తెచ్చియిస్తేనే మరి వీళ్లకు ఈ సిరిసంపదలన్నీ ఎక్కడినుండి వచ్చినట్లు? పుట్టినప్పుడు మనిషి సొమ్ములేమీ మూటకట్టుకుని రాడుగదా, మరి ఏ మాత్రం శ్రమ చేయకుండానే ఈ గొప్ప మనుషులవద్ద యింతింత ఆస్తిపాస్తులు, సిరిసంపదలు ఎక్కడినుండి వచ్చి పోగుపడుతున్నట్లు?

దోపిడీ అనేది ఎంత విస్తృతంగా, ఎంత లోతుగా వుంటుందో తెలుసుకోవాలంటే మీరీ గొప్ప మనుషుల వ్యవహారాలు గమనించండి వీళ్లు మొదట యిక్కడికి వచ్చినప్పుడు చిప్ప చేతిన పట్టుకొని వచ్చారంటే చిరుగుబట్టలతో, వట్టికాళ్లతో తిరుగుతూండినారు కాని 10-20 సంవత్సరాల కాలంలోనే వీళ్లిక్కడ పెద్ద పెద్ద దుకాణాలు పెట్టుకోగలిగారు తమ నివాసానికి గొప్పగొప్ప భవంతులు కట్టుకున్నారు గనులు, అడవులు గుత్తకు తీసుకున్నారు వీళ్ల యిళ్లల్లో టెలిఫోన్లు, టెలివిజన్లు , యింకా యింకా - లేనిదేమిటో చెప్పండి!

పోతే వీరి బాంకు అకౌంట్లలో మస్తుగా పైసలు జమయి వున్నాయి మరి 10-20 సంవత్సరాల కాలంలో వీళ్లు యింతింత మొత్తాలు ఎలా సంపాదించగలిగారు? అదే మనం అహోరాత్రాలు చెమటోడ్చి పనిచేసినా, పొలాలు, గనుల్లో రెక్కలు ముక్కలు చేసుకున్నా నానాటికీ నిరుపేదలయి పోతున్నాం ఎందుచేత? ఈ విషయాలను గురించే నేడు ఆలోచించవల్సివుంది దీని పేరే రాజకీయాలు. రాజకీయాలంటే అర్థం - శ్రామిక వర్గానికి, దోపిడీ వర్గానికి నడుమ పోరాటం, ఆ పోరాటం గురించి తెలుసుకోవడమే

సమాజంలో రెండు వర్గాలుంటాయి ఒకటి పెట్టుబడిదారీ వర్గం, మరొకటి శ్రామిక వర్గం శ్రామిక వర్గమైతే తమ శ్రమద్వారా సంపాదించి తింటారు కాని పెట్టుబడిదారీవర్గం, భూస్వామ్య, దోపిడీ వర్గాలు మట్టుకు శ్రామిక వర్గాల డబ్బులు [శ్రమ ఫలం] గుంజుకొంటూ, వారి ఆత్మాభిమానాన్ని కాలరాస్తూ పెద్ద ఆడంబరంగా, విలాసవంతంగా బతుకుతుంటారు ఈ దోపిడీ వర్గం చేతుల్లో రెండు రకాల ఆయుధాలుంటాయి ఒకటి నిజమైన తుపాకీ తూటాలయితే, రెండవది చక్కెరకంటే తీయని (మోసపు) మాటల తూటాలు దోపిడీ వర్గ బాగా ఆలోచించే, బాగా పరిశీలించే ఈ రెండు రకాల ఆయుధాలన ఉపయోగిస్తూంటుంది మన కామ్రేడ్లు అనేకమంది అసలు తుపాకి తూటాలనైతే వెరవకుండా ఎదుర్కొనగల్గుతారు గాని, మన శత్రువే గనుక మన కార్మిక సోదరులను "మీరు మహాత్ములు మీ అంత మంచివాళ్లు లేరు" అని ఉబ్బవేసినప్పుడు, బుజ్జగించినప్పుడు మన కామ్రేడ్ల కళ్లల్లోని ఎరుపు జీరలు వెంటనే కన్నీటి చుక్కలుగా మారిపోతాయి గుండె మెత్తబడిపోతుంది తల దానంతటదే వాలి పోతుంది. చివరకు యిలా తీయని మాటల తూటాలతో శత్రువు మన కామ్రేడ్లను పడగొట్టగల్గుతాడు - అందుకే బహుపరాక్ !

భూస్వామ్య, దోపిడీ వర్గాల అలవాట్లు అడవిలో పులుల అలవాట్ల వంటివే పులి ఎప్పుడైనా గడ్డి తింటుందా? అలాగే దోపిడీవర్గంకూడ

తన దోపిడీ ఎప్పుడూ మానదు కాని దేశంలోని సామాన్య ప్రజానీకం, అంటే కార్మికులు, రైతాంగం, యితర శ్రామిక ప్రజలు, ఒక్కటిగా నిలిచి ఎదిరిస్తే మాత్రం ఈ పాంట్లు-షర్టులు ధరించే రెండుకాళ్ల పులులు తప్పక హడలి పోతాయి. ఎందుకంటే చేలలో పక్షులు, పిట్టల్ని భయపెట్టి, చెదరగొట్టడానికి మనం పెట్టే దిష్టిబొమ్మలలాంటివాళ్లే యీ దోపిడీ వర్గాలు గనుక ప్రజల సంఘటిత శక్తి ముందు వీళ్లంతా కాగితం పులులయిపోతారు కాగితం పులికి ఏమాత్రం బలముంటుందో మీరే చెప్పండి

రెండు పిల్లులు ఒక రొట్టె కోసం కొట్లాడుకుంటూండినాయి నేను పంచుతానంటే, కాదు నేను పంచుతానని తగువులాడుకుంటుండినాయి ఒకదానికి మరొకదానిపై విశ్వాసం లేదు మరి దారిలో వాటికి ఓ కోతి ఎదురయ్యింది సంగతి తెలిసి, "మీరెందుకు కొట్లాడుకుంటారు? నేను పంచుతానుగదా!" అని ఆ కోతి భరోసా యిచ్చింది పిల్లులు సరే నన్నాయి అంతే, రొట్టె పంచే సాకుతో ఆ కోతి దాన్ని ముక్కలు చేసి ఒక్కొక్కటిగా నోట్లో వేసుకుంటూ రొట్టె మొత్తం తినేసింది. పాపం, ఆ పిల్లులు నిస్సహాయంగా దాని మొహం పరికిస్తూ వుండిపోయాయి. ఇదే విధంగా మనం శ్రామిక ప్రజలం మనలో మనం కలహించుకుంటూ, కొట్లాడుకుంటూ వుంటే అప్పుడు దోపిడీ వర్గం పై కథలో కోతిలా వచ్చి మన రొట్టె లాక్కుని తినేస్తుంది. శ్రామికవర్గప్రజలలో ఏవైనా కలహాలు వుంటే అవి స్నేహపూరిత వైరాలని, అదే దోపిడీ వర్గాలతో మనకుండే తగవులు శత్రుపూరిత వైరాలని మనం తెలుసుకోవాలి స్నేహపూరిత వైరుధ్యాలను మనం సామరస్యంగా మనలో మనమే పరిష్కరించుకోవాలి లేకుంటే మన పరస్పర కలహాలవల్ల దోపిడీ వర్గాలే లాభపడుతాయి

పెట్టుబడిదారుల, దోపిడీ వర్గాల భవంతులలోని ప్రతి యిటుకా రైతులు, కార్మికులు, ఆకలికి అలమటించే అన్నార్తుల చెమట నెత్తురులతో తయారయిందేనని తెలియండి ఇది సదా గుర్తుంచుకోవాల్సిన విషయం అంతేగాక, అన్నార్తుల ఆగ్రహావేశాలు చల్లార్చడానికే ఈ దోపిడీ వర్గాలు మసీదులు, మందిరాలు కట్టించారనే సంగతికూడ గ్రహించాలి. అందుకనే వాళ్లు స్కూళ్లు, అనాథశరణాలయాలు, ఆస్పత్రులు కూడ

కట్టించారు పైకి యిదంతా ప్రజాసేవ అనే నాటకం అయితే లోపల జరిగే అసలు తంతు మాత్రం దోపిడీ ఈ అంశాల పట్లకూడ మనం జాగరూకులమై వుండాలి పాలు మీగడలు, రుచికర భక్ష్యాలు మెక్కే ఈ దోపిడీ వర్గాలపై వర్గద్వేషం పెంచుకుని పోరాటానికి సమాయత్తులు కండి మరవకండి, ఈ పెట్టుబడిదారుల యిళ్లలోని ప్రతి వస్తువులోనూ మన కార్మికులకు వాటా వుంది. ఈ దోపిడీ వర్గాల భోగవిలాసాలు, ఉన్నత వైభవాలు అంతం గావించడానికి నడుం బిగించండి మన ఆడకూతుళ్ల మానాభిమానాలు హరించే, మన పిల్లల భవిష్యత్తును నాశనం చేసివేసే, మనకు కంటికి కునుకు, ఒంటికి సుఖం, మనసుకు శాంతి లేకుండా చేసివేసే ఈ దోపిడీదారులను ఎదిరించి పోరాడడానికి సాహసించండి! ధైర్యం చేయండి అసహ్యంతో ఉమ్మివేయండి! మొహం పగిలేలా జవాబు చెప్పండి నేలపై బలంగా కాళ్లు దట్టించి, "మేం పోరాడుతాం, గెలుస్తాం, ఒక నవసమాజం నిర్మిస్తాం!" అని గొంతెత్తి నినాదించండి!

* * * * *

# 7. ఆరోగ్యం - ట్రేడ్ యూనియన్

*[ 1983లో జరిగిన అఖిల భారత ఉక్కు పరిశ్రమల సమన్వయ కమిటీ సదస్సును ఉపలక్షించి రాసిన ఒక వ్యాసం సారాంశం]*

కార్మికుల ఆరోగ్య సమస్యల్ని కూడ తమ సమగ్ర కార్యక్రమంలో ఒక స్వతంత్ర అంశంగా చేర్చుకున్న ట్రేడ్ యూనియన్లు బహుశా భారతదేశంలో ఎక్కడా లేవేమో ఒకవేళ ఎక్కడైనా యిలా చేసివున్నా అది పెట్టుబడిదారీ ఆలోచనా చట్రం పరిధిలోనే చేశాయి అంటే తగు వైద్యచికిత్సా సౌకర్యాలు, పనిస్థలంలో ప్రమాదాలవల్ల అంగవైకల్యం సంభవిస్తే దానికి పరిహారం, వికలాంగులయిన కార్మికులకు మానవతా దృష్టితో ప్రత్యామ్నాయ పనులు చూపించడం అనే అంశాలవరకే పరిమితమైనాయి సరే, ఈ సాంప్రదాయిక ఆలోచనా చట్రం పరిధుల్లో కూడా యింకా చేయవల్సింది ఎంతో మిగిలివుంది అని వేరుగా చెప్పనక్కర లేదనుకోండి అయితే శ్రమశక్తి ఒక సరుకు, ఉత్పత్తిక్రమంలో దాని వినియోగంతో గడించే లాభాల ప్రమాణంలోనే పెట్టుబడిదారు దానికి ధర చెల్లిస్తాడు అనే మౌలిక పెట్టుబడిదారీ ఆలోచనాధోరణి ప్రాతిపదికనే ఈ ఆలోచనాపద్ధతి వెలకొన్నది.

ఈ క్రమంలో మనం మరో ఆసక్తికరమైన అంశం గమనిస్తాము యజమాని వర్గాలు, మేనేజిమెంట్లతో రాజీ సంభాషణలు జరిపేటప్పుడు పారిశ్రామిక, వృత్తిసంబంధ ఆరోగ్య సమస్యల విషయంలో సైతం ట్రేడ్ యూనియన్లు ఎప్పుడూకూడా కార్మికుల ఆరోగ్యంపై చెడు ప్రభావం కలగజేసే పనులు 'ఆమోదయోగ్యమైన స్థాయి'ని దాటనంతవరకు, అలాంటి పనులు కార్మికులు నిర్వర్తించవచ్చనే ప్రాతిపదికపైనే చర్చలు జరుపుతుంటాయి; ఒప్పందాలకు వస్తుంటాయి అయితే యిక్కడ ప్రశ్న ఏమంటే 'ఆమోదయోగ్యం' ఎవరి విషయంలో నని

కార్మికవర్గ ప్రయోజనాలకు, అంటే యిక్కడ వారి ఆరోగ్య ప్రయోజనాలకు, ప్రథమ ప్రాధాన్యం యిస్తూ ఉత్పత్తి క్రమం రూపొందించబడాలని, అందుకుగాను కార్మికుల ఆరోగ్యాన్ని దెబ్బతీసే అపాయకర పరిస్థితులకు సంబంధించిన కొలమానాల్ని ఒక ప్రత్యామ్నాయ ఆలోచనా విధానం ప్రాతిపదికన నిర్ణయించాల్సిన వుంటుందని ట్రేడ్ యూనియన్లు గ్రహించి, పోరాడాల్సిన అత్యవసర పరిస్థితి నేడెంతో వుంది

ఇక్కడ ఉక్కు పరిశ్రమలో పనులను గురించి కొంత చర్చిద్దాం కోక్ ఓవెన్ కార్మికులు పీల్చే వాయువుల వల్ల వాళ్ల ఆరోగ్యానికి వాటిల్లగల ముప్పు, బ్లాస్ట్ ఫర్నేస్, రోలింగు మిల్లు, ఎగ్జాస్టర్ హౌస్, పవర్ జనరేటరు, స్టీల్ మెల్టింగ్ షాపు మొదలైన చోట్ల విపరీతమైన వేడిమి, ఉబ్బరం, ఉచ్ఛస్థాయి ధ్వనుల వల్ల కార్మికుల ఆరోగ్యానికి కలిగే ప్రమాదాలను గురించి మనం యోచించాలి పోతే గనికార్మికులకు సంబంధించినంతవరకు చల్లని మంచినీరు, విశ్రాంతి స్థలాలు తగినంతగా లేవనే సమస్య ఒకటి ఎప్పుడూ వుంటుంది

పారిశ్రామిక ప్రమాదాల సమస్యపై సాకల్యంగా మౌలిక పునరాలోచన చేయాల్సిన తక్షణ ఆవశ్యకత వుంది గనుల్లో, కార్ఖానాల్లో భద్రత పరిస్థితులు ఎంత అధ్వాన్నంగా వున్నాయంటే, అవి నానాటికీ మరెంతగా దిగజారిపోతున్నాయంటే అక్కడ (తరచూ) సంభవించే ఘాతక అంగవైకల్యకారక ఘటనల్ని (కేవల) ప్రమాదాలనడమే పొరపాటవుతుందేమో ఈ ఘటనలు అంత ఆకస్మికమైనవేమీ కావు. ఇవి అక్కడ అమలులోవున్న యథార్థ ఉత్పత్తి క్రమంతో అనివార్యంగా ముడివడివున్న భౌతిక పరిణామాలే.

వికలాంగులయిన కార్మికులను మళ్లీ సాధారణ జీవన స్రవంతిలోకి తెచ్చే (వారికి పునరావాసం కల్పించే), వారికి ప్రత్యామ్నాయ పనులు కల్పించే సమస్యను మన మిప్పుడు మరెంత మాత్రం యజమానుల దయాదాక్షిణ్యాలకు వదిలివేయలేము. ఈ అంశాన్ని కార్మికుల మౌలిక డిమాండ్లలో ఒకటిగా చేర్చాలి; అంతేగాక, ప్రత్యామ్నాయ పనులు చూపిం

చేటప్పుడు ఆ కార్మికులకు మునుపటంతే వేతనాలు, బాధ్యతాయుత స్థానాలు లభించేట్లు ఖరారు గావించుకోవాల్సి వుంటుంది కూడ.

సారా తాగడం వల్ల కలిగే శారీరక, సాంఘిక, ఆర్థిక దుష్ప్రవసానాలను గుర్తిస్తూ సారాతాగుడు [మాన్పే] సమస్యను ట్రేడ్ యూనియన్ చైతన్యానికి సంబంధించిన ఒక ప్రధానాంశంగా తీసుకోవాలి

ఉక్కు పరిశ్రమల్లోని కార్మికుల్లో కంట్రాక్టు కార్మికుల సంఖ్య ఒక పెద్ద భాగమే వుంటుంది వ్యవహార రంగంలో ఈ కంట్రాక్టు కార్మికులు ఉక్కు పరిశ్రమల నిర్వహణకు ఒక శాశ్వత అవసరంగానే వుంటారు వీళ్లని శాశ్వతం గావించే (పర్మనెంటు చేసే) సమస్యను గురించి మరో చోట చర్చిద్దాం గాని, యిక్కడ మనం పట్టించుకొనాల్సిందేమంటే ఈ కంట్రాక్టు కార్మికులకు తగిన ఇళ్లు, స్కూళ్లు , వైద్య చికిత్స, పారిశుధ్యవసతులు మొదలైన ఆరోగ్యకర జీవనానికి అవసరమైన సౌకర్యాలన్నీ కల్పించే బాధ్యత ప్రధాన నియమాకుడిదే (యజమానిదే) కావాలనే విషయం ఇక్కడ స్టీలు ప్లాంటు మేనేజిమెంటు, కేంద్రప్రభుత్వం ప్రధాన నియమకులు అవుతారు ఈ సమస్యను మనం మౌలికంగా లేవనెత్తాల్సివుంది

కార్మిక వర్గం సాంఘికమార్పును తెచ్చే అగ్రగామిదళం అందువల్ల ప్రత్యామ్నాయ, ఇతోధిక ప్రగతిశీల సాంఘిక ప్రణాళికల రచన, అమలులను గురించి ఆలోచించవల్సిన, పట్టుబట్టవల్సిన బాధ్యత, కర్తవ్యం దానికి వున్నాయి ఒక ప్రత్యామ్నాయ ఆరోగ్య ప్రణాళికనుగురించికూడ కార్మికవర్గం పట్టించు కోవాల్సి వుంటుంది తోడ్తోడుగా లభించే సాధన సంపత్తి, శక్తియుక్తుల ఆధారంగా ప్రత్యామ్నాయ నమూనాలు నెలకొల్పే ప్రయత్నం చేయాల్సిన అవసరమూ కార్మికవర్గానికి వుంది ఇది నిస్సందేహంగా ఒక పెద్ద సమస్యే అయినా కార్మిక వర్గపు అత్యంత ప్రగతిశీల భాగాలు తప్పక శ్రద్ధాసక్తులతో యోచించాల్సిన, సకల ట్రేడ్‌యూనియన్ల విశాల సాంఘిక దృక్పథంలో ఒక ముఖ్యాంశంగా చోటు చేసుకోవల్సిన మహత్తర సమస్యే

* * * * *

# 8. స్త్రీలు - ట్రేడ్‌యూనియన్

*[ 1983 నాటి అఖిలభారత ఉక్కు పరిశ్రమల సమన్వయ కమిటీ సదస్సుకు సమర్పించిన పత్రంలోని అంశాలు ]*

నేడు మన ముందుకు వస్తున్న మహిళల సమస్య కమ్యూనిస్టులకు సంబంధించినంతవరకు కొత్తదేమీ కాదు ఈ సమస్యను శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించిన ఆద్యుల్లో ఏంగెల్సు ఒకరు అయితే యిది ఒక మహత్తర సమస్య కమ్యూనిస్టు (సోషలిస్టు) ఉద్యమ పురోగతికి ఈ సమస్యా పరిష్కారం చాలా అవసరం అయినప్పటికీ ట్రేడ్ యూనియన్ల తాత్కాలిక కార్యక్రమాలు, లక్ష్యాలను గురించిన [నేటి] చర్చ సందర్భంగా ఈ సమస్యపై సమగ్రంగా యోచన చేయడం కష్టమే కాని నేడున్న పారిశ్రామిక వాతావరణంలో పరిశ్రమలు, ట్రేడ్ యూనియన్లపై ఎంతో ప్రభావం చూపే మహిళా సమస్యల గురించి చర్చించవల్సిన అగత్యమైతే మనకు వుంది

ఇందుకు సంబంధించిన మనం స్పష్టంగా గమనించగల్గేదేమంటే ఏవో కొన్ని రంగాలు తప్పితే మిగతా అంతటా కార్మికుల్లోనూ, ట్రేడ్ యూనియన్ సభ్యులు - నాయకుల్లోనూ స్త్రీల అనుపాతం చాల తక్కువగా వుంది ఈ దుస్థితిని చైతన్యవంతంగా ఎదుర్కొని, సంస్కరించాల్సి వుంది ఒకవైపు సాధారణ ట్రేడ్ యూనియన్ పోరాటాల్లో మహిళల్ని అధికాధికంగా చేర్చుకోవడం ద్వారా, మరోవైపు పారిశ్రామిక మహిళా కార్మికుల కుండే ప్రత్యేక స్త్రీ సమస్యలను కూడా చేపట్టడం ద్వారా మాత్రమే ఈ సంస్కరణలు లేవడం సాధ్యం

యాంత్రీకరణ క్రమంవల్ల కార్మికుల్లో మహిళల అనుపాతంపై పడుతున్న రుణాత్మక (negative) ప్రభావం అనేది నేడు మహిళలకు సంబంధించి విశేష ప్రాముఖ్యంగల ఒక అంశం 1905 నుండి నేటి

దాకా పారిశ్రామిక కార్మికుల్లో స్త్రీల అనుపాతానికి సంబంధించిన గణాంకాలను గనుక మనం పరిశీలిస్తే, ఆ అనుపాతం నిరంతరం తగ్గుతూనే రావడం గమనిస్తాము యాంత్రీకరణ జరిగేటప్పుడు దాదాపు అన్ని చోట్ల మొదటగా ఉద్యోగాలు కోల్పేయేది స్త్రీలే

ఇక పిల్లలు కనడం, వారిని పెంచి పోషించడం వంటి స్త్రీల ప్రత్యేక సమస్యల గురించి కేవలం మహిళలేగాక ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో సర్వులూ శ్రద్ధాసక్తులు చూపాల్సిన అవసరం వుంది

పోతే పిల్లలకు తల్లిపాలకు బదులు వేరే పాలు లేక డబ్బా పాలు పట్టే అలవాటు పెరిగిపోతున్నది ఇదెంతో చింతాజనక సమస్య స్త్రీలు ఇళ్లనుండి అంతకంతకూ హెచ్చుగా దూరం జరిగి పోతూండడం నానాటికీ పెరిగిపోయే ఆధునిక సాంకేతిక పద్ధతుల పర్యవసానమే యాంత్రీకృత పరిశ్రమల్లో స్త్రీలు ఎక్కడైనా పనిలో వున్నా, అక్కడకూడా వాళ్లు అన్నింటికంటే అధికంగా యాంత్రీకృతమైన పనుల్లోనే నియమింపబడివుంటారు యాంత్రీకరణతో బాటు పెరిగిపోయే పనిభారంవల్ల అత్యధికంగా బాధపడేది మహిళలే

ప్రస్తుత పారిశ్రామిక పరిస్థితుల్లో మనమిక్కడ మహిళా సమస్యల్లో కొన్నింటిని మాత్రమే ప్రస్తావించామని చెప్పకోవాలి అదెలా వున్నా, ఈ సమస్యలను చర్చించేటప్పుడు, చేబట్టేటప్పుడు ట్రేడ్ యూనియన్లు తామేదో మహిళలకు రాయితీలు, సౌకర్యాలు కల్పిస్తున్నామనే ఉద్దేశ్యం తోగాక మహిళా సమస్యల్ని పరిష్కరించడం అసలు ట్రేడ్‌యూనియన్ ఉద్యమ ఆరోగ్యానికే మంచిదని తెలిసి వ్యవహరించాలి

పారిశ్రామిక వాతావరణంలో దోపిడీ వర్గాల అణచివేత చర్యల ఫలితంగా ప్రత్యేకించి స్త్రీలపై పడే దెబ్బల గురించి మనం ప్రత్యేక శ్రద్ధాసక్తులు వహించాలి అందువల్ల స్త్రీల హోదాలో తమకున్న, అలాగే కార్మికవర్గ సభ్యులుగా తమకున్న పాత్రలను సక్రమంగా పోషించేట్లుగా ఉత్పత్తి క్రమంలో పనిచేసే ఈ మహిళల చైతన్యం పెంపొందించ వీలవుతుంది. ఈ క్రమంలోనే వాళ్లు, కార్మికుల్ని దోపిడీ చేసే, అణచివేసే దోపిడీవర్గ విధానాలే ఎలా తమకు (స్త్రీలకు), పురుషులకు నడుమ

చీలికలు సృష్టించే శక్తులు, ప్రభావాల వెనుక పనిచేస్తున్నాయో కూడ గమనించి తమ జాగరూకతను, చైతన్యాన్ని పెంపొందించుకోగల్గుతారు ఈ రెండురకాల దోపిడీకి వ్యతిరేకంగా, అదే సమయంలో సకల కార్మికులపై , ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలపై దోపిడీ వర్గం అమలుచేసే దోపిడీ, అణచివేతలకు సంబంధించిన యితరేతర రూపాలకు వ్యతిరేకంగా పోరాడడంద్వారానే స్త్రీ కార్మికులు, మహిళా నాయకురాళ్లు నిజమైన వర్గచైతన్యం పెంపొందించుకుంటూ ముందుకు సాగిపోగల్గుతారు ఒక నవసమాజ నిర్మాణంకోసం ట్రేడ్ యూనియన్ పోరాటాల్లో పురుషులతో భుజం కలిపి పోరాడుతూ, ఆ పోరాట క్రమంలో వారితో సరిసమాన, సంపూర్ణ భాగస్వాములుగా సముచిత స్థానం సంపాదించుకోగల్గుతారు.

* * * * *

# 9. కార్యకర్తలకు సందేశం

*[దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా సాగే ఛత్తీస్‌గఢ్ విముక్తిపోరాటం 1977నాటి దల్లీ-రాజ్‌హారా, 1984నాటి రాజ్‌నంద్‌గావ్ అమరవీరుల నెత్తుటితో తడిసిన బాటలో సాగిపోతూ వస్తుండగా, భిలాయి పారిశ్రామిక నగరంలోని కార్మికులుకూడ దీనితో ఎంతో ప్రభావితులైనారు ఆకుపచ్చ-ఎరుపు రంగుల జెండాలు చేతుల్లో ధరించి పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా మహా పోరాటం ప్రారంభించడానికి సమాయత్తులు కాసాగారు ఆ నేపథ్యంలో భిలాయి పారిశ్రామికనగరంలో 1990 అక్టోబరు 2వ తేదీనాడు ఛత్తీస్‌గఢ్ కార్మిక కర్షక మహాసభ జరిపేందుకు సన్నాహాలు చేస్తూండినారు ఆ సన్నాహాల కోసం 1990 సెప్టెంబరు 3వ వారంలో ఛత్తీస్‌గఢ్ ముక్తిమోర్చా రాయ్‌పూర్ పట్టణంలో రెండు రోజులపాటు ఒక కార్యకర్తల శిబిరం నిర్వహించింది. ఆ శిబిరంలో దుర్గ్, రాజ్‌నంద్‌గావ్, రాయ్‌పూరు, బస్తరు, బిలాస్‌పూరులలోని ఛత్తీస్‌గఢ్ ముక్తిమోర్చా శాఖలకు చెందినవారే గాక యితర సోదరసంఘాల కార్యకర్తలుకూడ పాల్గొన్నారు ఆ శిబిరంలో కార్యకర్తలనుద్దేశించి కా శంకర్ గుహా నియోగి చేసిన ప్రసంగపాఠమే యిది కా నియోగి 1991 సెప్టెంబరు 28వ తేదీన వీరమరణం పొందిన పిదప ఈ ప్రసంగాన్ని మొదట కేసెట్ ద్వారా విస్తృత ప్రచారం చేశారు. ఆనక 1992 డిసెంబరు 19వ తేదీనాడు అమరవీర నారాయణ్ సింగ్ వర్ధంతి సందర్భంగా ఛత్తీస్‌గఢ్ ముక్తిమోర్చాకు చెందిన లోక్ సాహిత్య పరిషద్ వారు దీన్ని పుస్తకరూపంలో ప్రచురించారు దాని తెలుగు అనువాదాన్ని దిగువ యిస్తున్నాము - సం]*

సహచరులారా,

గత రెండురోజులుగా యిక్కడకు వచ్చిన మన కార్యకర్తలంతా నిరంతర చర్చోపచర్చలు జరుపుతూ వచ్చారు ఏమీ చర్చించని

వాళ్లుకూడ చాల శ్రద్ధాసక్తులతో యిక్కడ వెల్లడయిన ఆలోచనల్ని, వాదనల్ని వింటూవచ్చారు ఇక్కడ అనేక విషయాలను విపులంగా మొగ్గరేకులు జాగ్రత్తగా విప్పినట్లుగా చర్చించారు అలా మన చర్చల తోటను అతిసుందరంగా వికసింపజేశారు చాల మంచి మంచి మాటలు విన్నాము అందరి నోటా ఒకే మాట - మార్పు కావాలి ఈ వ్యవస్థ మనకెన్నో కష్టనష్టాలు, దుఃఖవిషాదాలు తెచ్చిపెడుతున్నది ఒక గుణాత్మక మార్పు కావాలనే అంటే విప్లవం రావాలి అనే అందరం కోరుతున్నాం అదే సమయంలో మనమంతా మాట లెక్కువ మాట్లాడుతున్నాం గాని యిది పనులు చేయవల్సిన సమయం ఎంత పని పేరుకుపోయి వున్నదంటే వేల సంవత్సరాలు చేసినా అది తీరదేమో. కనుక ప్రతి క్షణం మనం జాగ్రత్తగా వాడుకోవాలి కాలం వృథా చేయకూడదు కార్యరంగంలోకి దిగి వుద్యమించినప్పుడే మనం కోరుకునే పరివర్తన దిశగా, మనం కన్న కలల్ని నిజంచేసుకునే దిశగా ఏ కొంతైనా పురోగమించగలం

ఆమందానందభరితమైన, సుఖశాంతులు నిండుగావుండే ఒక సమ సమాజం గురించి మనం కలలు గన్నా మీనాడు అలాగే ఆ అపూర్వ సుఖశాంతులు, ఆ శాశ్వత శాంతి సాధించడానికి ఒక క్రాంతి అవసరం అ మనమంతా గ్రహిస్తున్నాము అయితే నేడు దేశంలో నెలకొన్న భ్రమల పటాపంచలైన నాడే విప్లవం వస్తుంది. భ్రాంతి వైదొలగనంతవరకు క్రాంతి సంభవించదు, క్రాంతి రానిదే శాంతి నెలకొనదు, ఆ శాంతి నెలకొనవిదే మనకు మనశ్శాంతి లభించదు.

ఎన్నెన్నో భ్రమలు వ్యాపించివున్నాయి నేడు కాంగ్రెసు పడిపోయింది జనతా పాలన వచ్చింది ఆనక మళ్లీ కాంగ్రెసు, తర్వాత అది తిరిగి పడిపోయి యిప్పుడు జనతా మోర్చా వచ్చింది ఇక్కడ భారతీయ జనతాపార్టీ (పాలన) వచ్చింది ఏమేమి రాలేదని!? వీళ్లంతా ఎంతో తీయని కబుర్లు, చల్లని హామీలు గుమ్మరిస్తున్నారు మీకు యిది చేస్తాం, అది చేస్తాం అంటూ మభ్యపెడుతున్నారు ఈ మాటలతో ఒక పెద్ద భ్రమ కలుగుతున్నది ఇక్కడ చాలమంది వక్తలు ఈ భ్రమను పటాపంచలు చేసే విధంగా చక్కగా మాట్లాడారు కూడ

కాని ఒక్క భ్రమను గురించి మాత్రం మనం తగినంతగా చర్చించలేదు. అదేమంటే ఈ వ్యవస్థలో అధికారం, శక్తివున్నచోట్ల, అవి గలవాళ్లు భయబీభత్సాలు నెలకొల్పడానికి చేసే ప్రయత్నాలను గురించి. సర్వ శక్తివంతమైనదేదైనా వుందంటే అది భయబీభత్సమేననే భావన ప్రజల్లో తేవడానికి తగు భయబీభత్సాలు సృష్టించాలని రాజ్యాధికార శక్తి యోచిస్తుంది. "మీరు కార్మికులు మీ శ్రమకు తగ్గ వేతనాలు డిమాండు చేస్తున్నారా? మీరు కర్షకులు మీ పొలాలు తడిపేందుకు నీళ్లు కోరుతున్నారా? మీరు మహిళలు మీపై జరిగే అత్యాచారాల అంతం కోరుతున్నారా? మంచిది, ఇవన్నీ కావలసిందే. కాని యివి మీకు దొరకకున్నా మీరే ఆందోళనా చేయరాదు. చేశారో జాగ్రత్త, మావద్ద ఈ యూనిఫారాలు వేసుకున్న భటులున్నారు చూడండి. అంతకంటే ముందు మా సంఘ శక్తులు (మనం వారిని సంఘవ్యతిరేకులు, గూండాలు అంటామనుకోండి) వున్నారు చూడండి. జాగ్రత్త!" అని రాజ్యాధికారం వున్నవాళ్లు హెచ్చరిస్తారు. ఆ సంఘవ్యతిరేక శక్తుల్ని మనపైకి తోలుతారు. గూండాగిరీ చేయిస్తారు. కొట్టిస్తారు. అత్యాచారాలు జరిపిస్తారు. అంతటితో చల్లారలేదా, యిక పోలీసుల్ని పంపిస్తారు. తుపాకులతో కాల్పిస్తారు. భయబీభత్సాలు సృష్టిస్తారు. ఇదంతా ఎందుకయ్యా అంటే, దీనికి జడిసి ప్రజలు పోరాటమార్గంనుండి తప్పుకుని నోరుమూసుకుని అణగిమణగివుంటారనే వుద్దేశ్యంతోనే. మరి మన మీ విషయంగురించి కావలసినంతగా చర్చించలేదు. అసలుకే చర్చించలేదని చెప్పలేము గాని మనం స్పష్టంగా యిలా ధైర్యం చెప్పుకోలేదు: ఏ భయమైనా, ఎంతటి బీభత్సమైనా మనల్ని అణచలేదు, మనం పోయే మార్గాన్ని అడ్డలేదు. మన మార్గంలో తీవ్ర అవరోధంగా నిలవలేదు. ఒకవేళ అలా నిలచినా మన మలాంటి ప్రతి అడ్డంకిని తీసిపారేసి ముందుకు దూసుకుపోతూనే వుంటాము అని మనం గట్టిగా చెప్పుకోలేదు.

మిత్రులారా, దారితప్పడమనేది జరుగుతూనే వుంటుంది. అయితే అలా దారితప్పే పరిస్థితి తటస్థించినప్పుడు మన బుద్ధి అతి స్పష్టంగా వుండాలి. మన ఆలోచనలు పరిపక్వంగా వుండాలి. మనం గనుక పరిపక్వమైన ఆలోచనలతో ముందుకు సాగలేకపోయినట్లయితే

మన చుట్టూ అలముకొనివున్న గాఢాంధకారంలో మనమెక్కడ దారి తప్పిపోతామో మనకే తెలియదు.

మన వెనుక ఎంత పెద్ద చరిత్ర వున్నది ! వింటే జీవితమంతా విన్నా తరగనంతటి సుదీర్ఘ చరిత్ర! మనదేశపు వేలసంవత్సరాల నాగరికతా చరిత్ర - అశేష త్యాగాలు, అపూర్వ పోరాటాల చరిత్ర మనదేశంలో ఎంతెంతమంది ప్రాణత్యాగాలు చేశారని - చంద్రశేఖర్ ఆజాద్, భగత్ సింగ్, వీర్ నారాయణ్ సింగ్, మహాత్మాగాంధీ, రామాధీన్ గోండ్, యింకా బస్తరుకు చెందిన మన మురియా సహచరులు, యిలా ఎందరెందరో తమ ప్రాణాలు బలిపెట్టారు స్వాతంత్ర్య స్వప్నాలు దర్శించారు కాని ఈ స్వాతంత్ర్యమనేది లభించినప్పటికీ నేడు మనం గమనించేదేమిటి?

స్వాతంత్ర్యనంతర తొలి కాంగ్రెసు ప్రభుత్వం 1948లో రాజ్‌నంద్‌గావ్, బి ఎన్ సి మిల్లు కార్మికులపై తుపాకీతూటాలు పేల్చింది అంతకు పూర్వం 1920లో బ్రిటిషు పాలకులు కూడ యిదే B N C మిల్లు కార్మికులపై కాల్పులు జరిపివుండినారు ఇలా స్వతంత్ర భారతంలో మొట్టమొదటగా రాజ్‌నంద్‌గావ్ బి ఎన్ సి మిల్లు కార్మికులపైనే తుపాకులు గర్జించాయి తర్వాత 1977లో జనతా ప్రభుత్వం ఏర్పడిన పిదప కూడ దల్లీ - రాజ్‌హారా కార్మికులపైనే మొట్టమొదటగా తుపాకులు పేలాయి మళ్లీ యిప్పుడు భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం వచ్చినా తిరిగి ఛత్తీస్‌గఢ్ ప్రజలపైనే - ఈ సారి అభాన్‌పూర్ కార్మికులపైన - కాల్పులు జరిగాయి అంటే ఛత్తీస్‌గఢ్ ప్రజలు గమనించవల్సిందేమంటే బ్రిటిషువాళ్ల కాలంలో రాజ్‌నంద్‌గావ్ కార్మికులపై ప్రప్రథమంగా కాల్పులు జరిగాయి, ఆనక కాంగ్రెసు ప్రభుత్వకాలంలో కూడ 1948లో మొట్టమొదటగా రాజ్‌నంద్‌గావ్‌లోనే కాల్పులు సంభవించాయి జనతాపాలనలోనైనా మొట్టమొదటగా ఛత్తీస్‌గఢ్‌లోని దల్లీ-రాజ్‌హారా పట్టణంలోనే తుపాకులు గర్జించాయి అనంతరం జనతాపార్టీ పడిపోయి కాంగ్రెసు పాలన వచ్చినప్పుడు కూడ మళ్లీ రాజ్‌నంద్‌గావ్‌లోనే (1984లో) కాల్పులు జరిగాయి కారణం ఛత్తీస్‌గఢ్ ప్రజలు పదేపదే అందమైన కలలుగంటూ, అవి నిజం చేసుకోవడానికి అనవరత ప్రయత్నాలు చేస్తూరావడమే

భారతదేశంలో వాళ్లే ప్రప్రథమంగా యిలా ప్రయత్నించారు అంతేగాక (మరెక్కడా లేనివిధంగా) అందరికంటె గొప్ప శక్తిగా పెల్లుబికి దోపిడీ వర్గాలు, పీడక శక్తులకు వ్యతిరేకంగా గొంతెత్తి నినదించారు అయితే భయబీభత్సాలతో ప్రజల్ని అణచజూచే దోపిడీ వర్గాలు ఛత్తీస్‌గఢ్ ప్రజలపై పదేపదే కాల్పులు జరుపుతూ, వాళ్లను అణచివేస్తూ వచ్చారు ఇలాంటి దమనకాండలవల్లే నేడు దేశంలో అత్యంత భీకర సమస్యలు తలయెత్తడం గమనిస్తాం పంజాబ్‌లో, అస్సాంలో, కాశ్మీరులో, బోడోలు, లిట్టేల విషయంలో --- ఈ సమస్యలకంతటికీ మూలకారణం ఏమిటి? దేశంలో జరిగే అసమాభివృద్ధే అభివృద్ధి ఏకరీతిగా జరగలేనందువల్లే, సమంగా జరగనందువల్లే వేరువేరు చోట్ల వేరువేరు రూపాల్లో వేరువేరు అంశాలపై యిలాంటి తీవ్ర సమస్యలు పెల్లుబికి వస్తున్నాయి

అందుచేత మనమిప్పుడు ఛత్తీస్‌గఢ్ ప్రజలు కనే కలలను, వాటిని నిజం చేయడానికి మన అమరవీరులు చేసిన ప్రాణత్యాగాలను మరవ రాదు. ఆ వీరుల నెత్తుటి ధారలతో తడిసిన మార్గంలో పయనిస్తూ మనం వారి కలలు పూర్తిగావించాల్సి వుంటుంది. మనం ఒక నూతన ఛత్తీస్‌గఢ్‌ను, ఒక నవభారతాన్ని ఊహించుకోవాలి. ఆ ఊహను ఉనికిలోకి తెచ్చుకునేందుకుగాను ఒక కార్యక్రమం రూపొందించుకుని, దాన్ని చిత్తశుద్ధితో, విజాయితీగా అమలు చేయాలి.

ఎలా అమలు చేయాలి? ఆ ప్రక్రియ గురించి వివరించాలంటే మళ్లీ మొదట్లో నేను చెప్పిన భ్రాంతి గురించి మాట్లాడాల్సి వస్తుంది

ప్రతి మనిషిలో, ప్రతి వస్తువులో కూడ రెండు తత్వాలు -- జీవ తత్వం, మరణ తత్వం - వుంటాయని మనం గమనిస్తాము సైన్సు బోధించేదీ యిదే మన శరీరంలోనూ ఈ రెండు తత్వాలు వున్నాయి మనం బతికివున్నాము; అదే సమయంలో మనలో చావు తత్వాలుకూడ వున్నాయి! మనం చనిపోవడం అంటే మన జీవశక్తి పూర్తిగా అంతరించిపోయి మనపై ఈ మరణతత్వం సంపూర్ణ అధికారం చెలాయించడమన్నమాట కనుక జీవతత్వం, మరణతత్వాల మధ్య పోరాటం నిరంతరం సాగుతూనే వుంటుంది జీవ శక్తులు అధిక

జీవంతో ముందుకు సాగినప్పుడు మన కలలు కూడ పురోగమిస్తాయి తద్విరుద్ధంగా మరణశక్తులు పెత్తనం చెలాయించేటప్పుడు మన కలలు చెదిరి పోతాయి అందుచేత మన కలల్ని సజీవంగా వుంచుకోవాలంటే, మన ప్రగతి మార్గాన్ని పదిలం చేసి వుంచుకోవాలంటే దానికి ఈ మరణతత్వాలపై జీవ శక్తుల ప్రాబల్యం తప్పనిసరి అవసరమవుతుంది. భ్రాంతిపై క్రాంతి పైచేయి కావల్సిన అవసరం ఎంతైనా వుంటుంది. అలా జరగని నాడు మనం పేరుకు బతికే వుండొచ్చుగాని మన కలలే సజీవంగా లేనప్పుడు యిక మన జీవితాలకు విలువేమి వుంటుంది? మన జీవితానికి, మన సమాజ జీవితానికి, మన దేశవాసుల జీవితానికి ఏదైనా అర్థం వుండాలంటే అందుకుగాను మనం ఒక నూతన భవిష్యత్తు కోసం పదే పదే కలలు, కల్పనలు కంటూండాలి గదా

ఆంగ్లేయుల కాలంలోగాని, అనక కాంగ్రెసు తొలిపాలనలోగాని, తర్వాత జనతా పాలనలోగాని, మళ్లీ యిప్పుడు భా జ పా కాలంలోగాని ఎప్పుడైనాగానీ ప్రప్రథమ త్యాగాలు చేసింది ఛత్తీస్‌గఢ్ ప్రజలేనని ఈ వరకే పేర్కొన్నాను సహచరులారా, మన ఛత్తీస్‌గఢ్ అమరవీరులు ఏ చీకట్లను చీల్చడానికి తమప్రాణాలు బలిగావించారో ఆ చీకట్లను, ఆ త్యాగాలను మరిచిపోకండి. నేటికీ ఆ చీకట్లు అలముకునే వున్నాయి. ఉషోదయం ఇంకా రాలేదు. కనుక శక్తిని, యుక్తిని జోడించి ఒక స్పష్టమైన కార్యక్రమంతో బలంగా అడుగులేసుకుంటూ మనం ముందుకు సాగాలి. సమయం మించిపోతే ఫలితం చేజారిపోతుంది.

మన జీవితంలో, మన సాంఘిక కార్యకర్తల జీవితాల్లో, ఒక సమస్య మళ్లీ మళ్లీ తలయెత్తుతూంటుంది అదేమంటే -- అరె, మన మాట ఎవరూ వింటంలేదే నని ఈ విషయమై నేనుకూడ ఎంతో ప్రయత్నం చేసాను జనాలు మన మాటలు విననైతే వింటారుగాని వాటిని అమలుమాత్రం చేయరు (ఎందుకంటే) "మాటలు మహా చెప్పావు లేవయ్యా అయితే అసలు దెబ్బ కొట్టాలంటే లౌక్యం అతిముఖ్యం"

అనక మరో సమస్య వచ్చి పడుతుంది మన సాంఘిక కార్యకర్తలుకూడ దీనితో ప్రభావితులైవున్నారు వాళ్లంటారు గదా --

"అరె భాయీ! మొదట మన కుటుంబం సంగతి చూచుకోవాలి తర్వాత మన ఇంటి గురించి పట్టించుకొనాలి అనక మన వీధి, ఆపై మనవాడ, అనంతరం మన ఊరి సంగతులు చూచుకోవాలి ఇవన్నీ అయినంక - -- అయ్యా, మావద్ద అంత అధికశక్తి అయితే లేదు సుమండీ! - సమాజంగురించి మాట్లాడుదాం మరి దేశం సంగతంటారా, అది (మన కసలే అందని) మరీ పెద్ద విషయమండి బాబు ఒకవేళ ఏమైనా అవకాశం లభిస్తే అప్పుడూ మనమూ ఒక చేయివేద్దాం లెండి" అంటారు చూడండి, మొదట ఇంటిలో, కుటుంబంతో ఆరంభిద్దామనేది [ముందు ఇంటగెలవడమనేది] ఒక పెద్ద పొరపాటు భావన. ఈ భ్రాంతిలో కూరుకునిపోయి ఎందరు కార్యకర్తలు మళ్లీ వెలికి రాలేకపోతున్నారో! ఇలాంటి సహచరులు అప్పుడప్పుడూ మహాత్మ గాంధీ వ్యాసాలు చదివికూడ యిలాంటి తప్పుడు వ్యాఖ్యానాలు చేస్తుంటారు గ్రామోదయం అంటూ తమతమ గ్రామాలవరకే పరిమితమై పోతారు ఇలాంటి వాళ్లంతా అర్థం చేసుకోలేక పోతున్నదేమంటే -- ప్రత్యేకతను మనం సాధారణతతో జోడించజాల నంతవరకు, సాధారణతతో మనం సంబంధం పెట్టుకోనంతవరకు మన ప్రత్యేక సమస్య కూడ పరిష్కారం కాజాలదు అని

మీ ఊరి దరిదాపుల్లో ఒక నదివుంది, దానికి వరద నీరు వచ్చిపడింది అనుకోండి మరప్పుడు మీరేమి చేస్తారు? మీ ఊళ్లోకి నీళ్లు చొచ్చుకువచ్చే, ఇళ్లు, గుడిసెలన్నీ నేలమట్టమయ్యే ప్రమాదం వుంటుంది అయితే అది మీ ఊళ్లోకి నీరు రావడంమట్టుకే ఆగుతుందా? వర్షం కుండపోతగా కురుస్తూ, వరదనీరు వెల్లువగా వస్తూంటే చుట్టుపక్కలి గ్రామాలు మాత్రం మునిగిపోవా? మరలాంటప్పుడు మీగ్రామాన్ని, మీ ఇళ్లను ఎలా కాపాడుకొంటారు? నలుదెసలా కారుమబ్బులు కమ్ముకున్నప్పుడేగదా వాన వచ్చేది, వరద వచ్చేది మరి మేఘాలే లేవనుకోండి వాన రాదు మీ ఊళ్లో పడదు, మీ పక్క ఊళ్లో పడదు, చుట్టూదేశంలో ఎక్కడా రాదు చుట్టూ దేశంలో వాన వస్తే, మీ పక్క ఊళ్లలో పడితే మీ ఊళ్లో కూడ పడుతుంది తగుమాత్రం వానపడితే మీకు సౌభాగ్యస్థితి వస్తుంది అంటే ప్రత్యేకతనుండి సాధారణతకు, సాధారణత నుండి ప్రత్యేకతకు [భ్రమణం] రావాల్సివుంటుంది అయితే దీనికి విపరీతంగా

కొందరేమో కేవలం గ్రామాలపైనే నొక్కిచెపుతూ, మరికొందరైతే ఇతర జనసముదాయాలు, ఇతర అంశాలే ఆధారస్తంభాలని వాటికే అధిక ప్రాముఖ్యం యిస్తూ మాట్లాడుతూంటారు మనం ఈ భ్రాంతుల్ని దూరం చేసుకోవాలి

కనుక మరొక చిన్న - లేక యిదే అన్నింటికన్న పెద్దదేమో కూడ - భ్రాంతి గురించి మీ ముందు మాట్లాడుతాను అదేమంటే నియతి (భాగ్యం, fate) గురించిన పొరపాటు అవగాహన రెండు అంశాలున్నాయి ఒకటి నియతి, మరొకటి స్థితి ఈ స్థితి, నియతులు రెండూ (తరచూ) పరస్పర విరుద్ధ మార్గాల్లో నడుస్తుంటాయి మన ఛత్తీస్‌గఢ్ కార్యకర్తల ముందు ఈ అంశాలు, ప్రత్యేకించి నియతి గురించి చర్చ పలుమార్లు వస్తూనేవుంటుంది ఉదాహరణకు, మగవాడు ఆడదానిపై అత్యాచారం జరిపితే చాలమంది స్త్రీలు "ఏం చేస్తాం, మన 'భాగ్యం'యిలా వుంది" అనుకొని ఊరకుండిపోతారు ఈ స్థితి, నియతులు రెంటిలో నియతి మౌలికమైనది దానిలో జీవం లేదు మృత్యుతత్వం దాన్ని ఆవహించి వుంటుంది కనుక మనం స్థితిపై -- నేటి పరిస్థితి ఏమిటి, యిది రేపు ఎలా రూపొందుతుంది, భావిస్థితిలో మనం ఎలా ముందుకు సాగగలం అనే అంశాలపై -- కేంద్రీకరించాలి, విశ్వాసం వుంచాలి మన తర్కవాదాలు, మన ఆలోచనలు ఈ అంశంపై కేంద్రీకరించాలి అంతదాకా మనకు నేటి స్థితి నుండి - నేటి పరిస్థితుల నుండి - విముక్తి లభించదు అందుకు భిన్నంగా 'అంతా మన భాగ్యంలే' అని ఊరకుండిపోతే మన మే మాత్రం ముందుబడం నియతి అంటే మృత్యువు, నియతి అంటే జడత, నియతి అంటే విశృలత

ఇక్కడ చనిపోయేవాళ్లగురించి యోచిస్తే వాళ్లవరకు వాళ్లకైతే ఏవీ ఫరవాలేదు మనం అంతా చనిపోతాం, మనకేమీ ఫరవాలేదు నేను చనిపోతాను, నా శవం యిక్కడ పడివుంటుంది చనిపోయినంక నాకు దానితో ఏమి ఫరవా? కాని అది కొద్దిరోజులకు కుళ్లి కంపు గొడితే చుట్టూ (యింకా బతికి) వున్న ఇళ్లవాళ్లకే గదా అవస్థంతా! ఆ దుర్వాసనకు తట్టుకుని ఎవరూ వుండలేకపోతారుగదా అంటే నియతి

మృత్యుతత్వం ప్రాబల్యం వుంటుంది ఇక ఈ నియతికి ఏ వ్యక్తిపై లేక ఏ జన సముదాయంపై ప్రాబల్యం వుంటుందో వారికి సంబంధించి అయితే అంత పెద్ద సమస్య వుండదుగాని, వారి చుట్టుపక్కలి వాళ్లకు మాత్రం అది చాల పెద్ద సమస్యవుతుంది ఈ సమయంలో మృత్యుతత్వాలపై జీవతత్వాలు జయం సాధించాల్సిన అవసరం ఎంతైనా వుంది దోపిడీ, పీడనలు వున్న చోట్ల, అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్న చోట్ల ఈ మృత్యుతత్వం ప్రాబల్యంలో వున్నట్లే. ఎక్కడైతే పోరాటం వుందో, సంఘర్షణ సాగుతూందో, ముందుకు పోవాలనే కోరిక వుందో, ఆశయాలు, అభిలాషలు వున్నాయో, అక్కడ జీవశక్తులు ప్రబలంగా వున్నట్లే. అక్కడ ప్రతి అడుగూ ఒక దుముకే; ముందుకు సాగుతూనే వుంటుంది; ఏదో ఒక రోజు ఆ యాత్ర విజయ లక్ష్యాన్ని చేరుకుంటుంది.

అందువల్ల, మిత్రులారా! మనమిప్పుడు ఛత్తీస్‌గఢ్ ప్రజలు ఎదుర్కొంటున్న కష్టనష్టాలను గురించి, వారిని తప్పుదారి పట్టిస్తున్న ొరపాటు ఆలోచనలు, భ్రాంతులను గురించి యోచిద్దాం

ఇప్పుడొక సమస్య మనముందు వచ్చిపడింది -- అదే భూమి మస్య ఈ భూమి సమస్యపై కూడ నేను కొంత మాట్లాడడం మేలని భావిస్తాను దుర్గ్ పట్టణం వెళ్లిచూస్తే అక్కడి భూమి అంతా రాజ్‌నంద్‌గావ్ పార్లమెంటు సభ్యునిదేనంట ఒకసారి దుర్గ్ కలెక్టరు ఢాండ్ సాహెబు నాకు చెప్పిందేమంటే ఆ పార్లమెంటు సభ్యుడు ధర్మపాల్ గుప్తా ఒక రోజు ఆయనతో, "మీ (కలెక్టరు) బంగళా వున్నది చూచారూ, ఆ జాగా కూడ మా పూర్వీకులదే!" నన్నాడట అంటే ధర్మపాల్ గుప్తాది కాని నేలంటూ అక్కడ ఏమీ లేదన్నమాట ఈ ధర్మపాల్ గుప్తా యిప్పుడు భారతీయ జనతా పార్టీలో ఒక పెద్ద నాయకుడు అంతకు మునుపు మరేదో పార్టీలో వుండేవాడుగాని అది మార్చి యిప్పుడు భా జ పా లోకి వచ్చాడు దుర్గ్‌లోని జాగాలన్నీ ఆయనవే పోతే మన రాజా మహరాజాగారు, జూదేవ్ సాహెబు, వున్నారు చూడండి. ఆయన వద్ద ఎంత భూమి వుందో [నాకన్నా] ఈ ప్రాంతంనుండి వచ్చిన మీకే బాగా తెలుసు ఆయనకు వేల ఎకరాల

భూములున్నాయి పోతే అనేక మఠాలున్నాయి -- నదియా మఠం గురించి మీరు వినే వుంటారు అలాగే బన్‌ఖేడా మఠం, భద్రాచలం మఠం తదితర అనేక మఠాలున్నాయి. వీటిపేరిట విస్తృతంగా భూములున్నాయి సీలింగు చట్టం నుండి మినహాయింపు కోసమని ఎక్కడో కుక్కలు, పిల్లుల పేరిటకూడ భూములు రాసిపెట్టుకున్నారని నేను వినివున్నాను ఇంకా పుట్టని పిలగాని పేరిటకూడ భూమి రాసి పెట్టుకున్నారు ఎందుకంటే, పుట్టినంక పాపం ఆ పిలగానికి భూమి లేకపోతే యెట్ల? అంటే భూముల పరిస్థితి అంత దారుణంగా వుందన్నమాట దేశంలో మంచి మంచి భూములేవైతే వున్నాయో ప్రత్యేకించి పట్టణాలను ఆనుకొని భూములేమైతే వున్నాయో -- ప్రతి పట్టణంలో, అది దుర్గ్ కానీండి, రాజ్‌నందగావ్ కానీండి, లేదా రాయ్‌పూర్, బిలాస్‌పూర్, లేక చుట్టుపక్కలి మరే పట్టణమైనా కానీండి -- నేడక్కడ వ్యవసాయక్షేత్రాలు (agricultural farms) స్థాపించబడివున్నాయి ఒక చోట చెరుకు వేసివుంటే మరొకచోట బత్తాయి లేదా మరో పంట, యిలా హరొక్క రకం పంటలు అక్కడ పండించడం మనం గమనిస్తాం ఈ వ్యవసాయ క్షేత్రాల ఎదుట మీకు చిన్నవో, పెద్దవో పండ్ల దుకాణాలుకూడ అగుపిస్తాయి ఇక్కడ మన ప్రాంతంలో అందరికంటె పెద్ద నాయకుడు, రాయ్‌పూరుకు చెందిన విద్యాచరణ్ శుక్లా వ్యవసాయక్షేత్రం గనుక మీరు చూస్తే, "అహో! ఇంత గొప్ప వ్యవసాయం యిక్కడ కూడ వుందే!" నని ఆశ్చర్య చకితులు, ఆనందభరితులు అయిపోతారు పోతే ఈ వ్యవసాయ క్షేత్రాల కథ కూడ చాల పెద్దదే ఈ వ్యవసాయక్షేత్రాల యజమానుల్లో ఏ ఒక్కరూకూడ నాగలిపట్టిన వాళ్లు కాదు నాగలి పట్టడమెలాగో కూడ వారికెవరికీ తెలియదు పోతే బేమేతరాలో భూములున్నవారు, కవర్ధాలో వున్నవాళ్లు, రాజ్‌నందగావ్‌లో భూములున్నవాళ్లు, ఇంకా అనేక పట్టణాల్లో భూములు గలవాళ్లంతా యిప్పుడు రాయ్‌పూరు పట్టణంలో, ఒక ప్రత్యేక కాలనీలో వుంటున్నారు నేను ఎవరినీ ఫలానా అని పేరుపెట్టి చెప్పదల్చుకోలేదు అందువల్ల వాళ్ల వాళ్ల మనసులు నొవ్వవచ్చు ఈ జమీందార్లంతా ఛత్తీస్‌గఢ్ మూలమూలలా భూములున్నవాళ్లు మరి వీళ్లా భూములనుండి రాబడి ఎలా గడిస్తారనే దాన్ని గురించి కూడ

మీరు ఎంతో కొంత తెలుసుకోవాలి

మన సాంఘిక కార్యకర్తలు ఊరూరా తిరిగి ఈ భూమి సమస్యను అనేక సార్లు లేవనెత్తారు కాని మన కార్యకర్తలు యింతవరకు ఒక్క విషయం గురించి ఆలోచించలేదు అదేమంటే ఈ 'భూమి పుత్రుల'కు కూడ నేడు ఒక గొంతుక, ఒక నినాదం పుట్టింది -- "ఛత్తీస్‌గఢ్ ఛత్తీస్‌గఢ్‌వాసులదే, మరెవరి అమ్మ మొగుళ్లదీ కాదు!" అని సరే, మంచిది, మరి ఈ ఛత్తీస్‌గఢ్‌వాసులు ఎవరన్నా? అగో సూడు మన గ్రామవాసులు -- రాయ్‌పూరు పట్నంలో బిరాయించి వుండేటి జూదేవ్ మహారాజా సాహెబు, మూడున్నర వేల ఎకరాల ఆసామి మన ధర్మపాల్ గుప్తాజీ -- వీళ్లే సూడు ఛత్తీస్‌గఢ్ వాసులంటే!? మరి ఈ ఛత్తీస్‌గఢ్ మాది, ఛత్తీస్‌గఢ్ వాసులం మేము అనేదానికి అర్థమేమిటన్నా? ఛత్తీస్‌గఢ్‌వాసులనేవాళ్లు, అలా కానివాళ్లు ఈ ఉభయుల మధ్య తగవులు పెట్టు, కొట్లాటలు రేపమనే! కాని మనది మాత్రం కార్మిక కుటుంబం మన సంఘసభ్యులందరికీ తెలుసు, వాళ్లంతా బహుచక్కగా చెప్పగలుగుతారు -- మనమంతా ఒకే జాతి మన మీ మాట జాతి రూపంలో, గోత్రం (బిరాదరీ) రూపంలో చెప్పుకోవల్సిందే నేను స్పష్టంగా చెబుతున్నా -- మనదంతా ఒకే జాతి, ఒకే గోత్రం నా అభిప్రాయంలో ప్రపంచంలో రెండే రెండు గోత్రాలున్నాయి -- ఒకటి పులి గోత్రం, రెండవది మనిషి గోత్రం నెత్తురు తాగే వరులున్నారు చూడండి, వాళ్లది పులి గోత్రం. ఇక శ్రమచేసి బతుకు గడిపే కార్మికులది మనిషి గోత్రం. ఈ గోత్రంలో చీలికలు సృష్టించడానికి, కలహాలు పెట్టడానికి వాళ్లు (పులిగోత్రం వారు) ఈ రకమైన (ఛత్తీస్‌గఢ్ యిక్కడి నివాసులది, మరెవరి అమ్మ మొగుళ్లదీ కాదు అనే బాపతు) నినాదం ఎక్కడో ఒకక్కడ లేవదీస్తూనే వుంటారు. అయితే మనకూ ఒక నినాదం వుందిలెండి అదేమిటో ఆనక చెప్తాను

అయితే ఇప్పుడు దీనితోబాటు మరో విషయంకూడా మీ ముందుంచ దల్చుకున్నాను పారిశ్రామికరంగంలో, కార్మికక్షేత్రంలో మనం గమనిస్తున్న దేమిటి? ఏమంటే యిలాంటి క్షేత్రాలన్నింటా - భిలాయి, రాజ్‌నంద్‌గావ్,

దల్లీ- రాజ్‌హారా, కోర్బా, హిర్రీ, నందినీ, బైలదిల్ల, అభన్‌పూరు వగైరా చోట్లన్నింటా - ఒకే ఒక సమస్య, మా డిమాండ్లు నెరవేర్చండి అనే సమస్య, తలయెత్తుతున్నదని మన దగ్గర బహుజనాదరణ పొందిన డిమాండ్లు రెండు - ఒకటి వేతనాలు పెంచండనేది, రెండవది బోనస్ యివ్వాలనేది మరైతే 'విప్లవం వర్థిల్లాలి!' అనే నినాదం అర్థమేమిటి? విప్లవం అంటే (సమూల) పరివర్తన, గుణాత్మక మార్పు అని ఉర్దూలో ఇంకిలాబ్ అంటే, హిందీలో క్రాంతి అంటారు ఉద్దేశ్యం గుణాత్మక మార్పుకావాలని కాని అడిగే డిమాండ్లో - 10 శాతం బోనస్ యివ్వాలి, యివ్వాల్సిందే! వగైరా అయ్యా, మరి ఈ 10 శాతం బోనస్ యిచ్చేస్తే యిక మన దేశంలో గుణాత్మక మార్పు వచ్చేస్తుందా? కార్మికులుగా ఎవరైతే వున్నారో వాళ్లంతా యిక యజమానులైపోతారా? దోపిడీలు, హత్యలు చేయించే ఘరానా మనుషులు యిక పేదవాళ్లయిపోతారా? వేతనాల పెంపుదలతో మన దుఃఖాలన్నీ దూరమైపోతాయా? కాని, నేడు ట్రేడ్‌యూనియన్ల వద్దనున్న అంశాలు ఈ రెండు మాత్రమే - వేతనాలు పెంచండి, బోనస్ యివ్వండి అనే డిమాండ్లే ఛత్తీస్‌గఢ్‌లోనూ మన బోనస్ కథ యిలాగే వుంది ఒకటి అరా శాతం బోనస్ పెరిగినా మన మనసు ఆనందంతో పొంగిపోతుంది దానితో యూనియన్‌కు 10-20 రూపాయలు చందా యివ్వాలంటే టకాలుమని తీసియిచ్చేస్తాం ఆహా, మన నాయకులు ఎంత మంచి పని చేస్తున్నారు, ఒక శాతం బోనస్ పెంపు చేయించారు అని సంతోషపడిపోతాం బోనస్ కాస్త పెరిగిందండి, అంటే యిక మన విప్లవం వచ్చేసినట్లే! పోతే మిగతా ఏడాది పొడుగుతా యూనియన్‌వాళ్లు మరేం చేస్తారండీ? మరేముంది, ఏడాది పొడుగుతా ఒకే పని - కార్మికులకు యిచ్చే చార్జిషీట్లకు జవాబులు రాసియివ్వడం యజమానులు కార్మికుల చేతుల్లో చార్జిషీట్లు జొప్పిస్తారు "నీవు పని చేయడం లేదయ్యా కనుక పనిమానుకుని తొలగి పో" అంటారు ఆ కాగితం పట్టుకుని కార్మికుడు ట్రేడ్‌యూనియన్ నాయకునివద్దకు వస్తాడు "చూడన్నా! ఇట్ల యిట్లా రాసియిచ్చిండ్రు 72 గంటల్లో జవాబు యివ్వాలంట" అని ఒక కార్మికుడంటే, ". 24 గంటల్లో జవాబు యివ్వాలంట" అని మరొకరు వాపోతారు 24 గంటలో, 72

గంటలో ఏదైతేనేంగాని మేము (ట్రేడ్‌యూనియన్ నాయకులం)మాత్రం వారంలో ఏడురోజులూ కూర్చుని కూర్చుని ఆ చార్జిషీట్లన్నింటికీ జవాబులు రాసియివ్వడంలో నిమగ్నమైపోతాం. అంతేగాని మన కార్మికులు ఎక్కడ, ఎలాంటి గుడిసెల్లో వుంటున్నారు. కార్మికులున్న ప్రాంతంలో ఆస్పత్రి సౌకర్యం వుందా, లేదా, కార్మికుల పిల్లలు ఎలాంటి ఆలోచనలు, అలవాట్లతో వున్నారు - వాళ్లు బ్లూ ఫిలింలు చూస్తున్నారా, లేక అమితాబ్ బచ్చన్ నటించిన ఢిషుం-ఢిషుం సినిమాలు చూస్తున్నారా లేక మరేదైనా యావతో వున్నారా? - యివేవీ మనం ట్రేడ్‌యూనియన్ నాయకమ్మన్యులం పట్టించుకోము. కార్మికులు పూటుగా సారా తాగి, వీధుల్లో పడి పొర్లనీగాక - మనకేం పట్టింది? ఈ కార్మికులున్నారే, వాళ్లెక్కడనుండి వచ్చారండి? వాళ్లు గ్రామాలనుండి వచ్చారు. ఊళ్లలో ఉన్న భూములు పోగొట్టుకుని లేదా అక్కడ కూలిచేసుకునేవాళ్లు యిక్కడకు కూలికి వచ్చి యిక్కడ కార్మికులయ్యారు. మరి వాళ్ల రక్త బంధువులు యితర చుట్టాలు యింకా గ్రామాల్లోనే వున్నారా, ఆ చుట్టాలతో వాళ్లకు బాంధవ్యం వుందా, వూడిందా యివన్నీ మన ట్రేడ్ యూనియన్ నాయకులు ఏమైనా పట్టించుకొంటున్నారా?

ఇంతకంటె పెద్ద, ప్రమాదకరమైన పరిణామం మరొకటి సంభవిస్తున్నది - అది కేవలం కార్మికుల విషయంలోనే గాక యావద్దేశ ప్రజల విషయంలో సంభవిస్తున్నది. ఉత్పత్తి వ్యవస్థలో ఎలాంటి సాంకేతిక పద్ధతి (టెక్నిక్) అమలులోవున్నది? ఆ సాంకేతిక పద్ధతి ఈ దేశం మెరుగుదలకోసమా లేక దేశానికి ప్రమాదకరమా? ఇప్పుడు వచ్చే యంత్రాలు దేశానికి లాభకరమా, నష్టకరమా? భిలాయిలో ఒక ఆధునిక యంత్రం వుంది. దాని పేరు - ఐ.బి.ఎమ్. లెక్కల యంత్రం. సుమారు 25-30 కోట్ల రూపాయల ఖరీదు చేసే మెషిన్ అది. చాల వేగంగా, మనం ఊహించలేనంత త్వరగా లెక్కలు చేసేస్తుందది. అతిక్లిష్టమైన లెక్కలు కూడ సెకనులో ఎన్నోవంతుకో చేసేస్తుంది. అలాంటి ఆ కంప్యూటరులో ఒక సారి ఒక చిన్న స్క్రూ (లేదా విడిభాగం) ఖరాబై పోయిందండి. దానితో ఆ యంత్రం మెదడుకూడ చెడిపోయింది. అలా మెదడు ఖరాబుకావడంతో అది అంతా పిచ్చి పిచ్చి లెక్కలు వేయసాగింది. రెండు రెళ్లు నాలుగని మనందరికీ తెలుసు కాని

ఆ యంత్రం మాత్రం 80 అని చెప్పేసింది. అంతగా పాడైపోయింది దాని మెదడు! అయితే అది అమెరికానుండి తెచ్చిన మెషినాయె. కనుక మన ఆఫీసర్లు ఆ అమెరికన్ కంపెనీవాళ్లతో, " అయ్యా! మీ యంత్రం మెదడు ఖరాబై పోయింది. అవసరమైన విడిభాగాలు మార్చివేయండి." అని అడిగారు. దానికి ఆ కంపెనీవాళ్లన్నారు గదా: "ఇది చాల పాత మోడల్ యంత్రం. దీని విడిభాగాలు యిప్పుడు మా వద్దలేవు. ఏం చేస్తాం, యిప్పుడు మా అమెరికాలో యిలాంటి పాత మోడల్ యంత్రాలు లేనేలేవు మరి. ఇదిగో ఓ కొత్త మోడల్ యంత్రం వచ్చింది. భేషుగ్గా పనిచేస్తుంది. ఖరీదు కేవలం యాభై కోట్ల రూపాయలు మాత్రమే. మీవద్దనున్న ఆ పాత యంత్రాన్ని తీసిపారేసి ఈ కొత్తది కొనుక్కోండి." అని సలహాయిచ్చారట. ఇక వెళ్లండి, ఎక్కడికి వెళతారో! యంత్రం మెదడు ఒక్క స్క్రూ పోవడంతో ఖరాబైపోతే దానికిపెట్టిన 30 కోట్ల రూపాయలు గంగలో కలిసిపోయాయే. ఇక్కడి మన మేనేజిమెంట్‌వాళ్లు యిలాంటి యంత్రాలు దిగుమతి చేసుకొని లేని కష్టాలు తెచ్చిపెట్టుకుంటున్నారు, దేశద్రోహానికి పాల్పడుతున్నారు. అప్పట్లో నేను కొందరు జనతాదళ్ నాయకులతో (వాళ్లిప్పుడు మంత్రులై కూర్చునివున్నారు) ఈ విషయమై వ్యక్తిగతంగా చర్చించాను కూడ. ఈ విధంగా బహుజాతి కంపెనీలు మన దేశాన్ని కొల్లగొడుతున్నాయి, తినేస్తున్నాయని వాళ్లప్పుడు వాపోయారు. అయితే నేడు అధికారంలోకి వచ్చిన తర్వాత వాళ్లిదంతా మరిచిపోయారు. నేడు నూతన పారిశ్రామిక విధానమని చెప్పి వాళ్లు ప్రవేశపెడుతున్నదేమో నాకు సరిగ్గా తెలియదు గాని ఇదివరలో రాజీవ్‌గాంధీ విధానమేదైతే వుండేదో సాంకేతిక పద్ధతులు, విజ్ఞానానికి సంబంధించినంతవరకు ఆ విధానమైతే ఏమీ మారలేదు. ఆ విధానం నేటికీ బ్రహ్మాండంగా అమలుజరుగుతూనే వుంది. రావుఘాట్ పేరు విన్నారా? బస్తరునుండి కొందరు చెల్లెళ్లు యిక్కడకు వచ్చివున్నారు. వాళ్లకు తెలిసే వుండొచ్చు. రావుఘాట్ మన ఛత్తీస్‌గఢ్ లోనే బస్తరుకు నడిమధ్యన వున్నది. రావుఘాట్‌లో ఇనుపరాయి విశేషంగా దొరుకుతుంది. దాన్ని మన భిలాయికి కూడ సరఫరా చేస్తారట. మన భిలాయిలో చాలమంది ఆఫీసర్లకు యిప్పుడు మన పర్యావరణశాఖా మంత్రి(ణి) శ్రీమతి మేనకా గాంధీ అంటే చాలా

ఆగ్రహం. ఎందుకంటే అవీయివీ కారణాలు చెప్పి (ప్రకృతి పరిసరాలకు నష్టంపేరిట) ఆమె రావుఘాట్ ప్రాజెక్టును పాసు చేయడం లేదట. అందుకని వాళ్లు ఆవేశంతో ఎటోచ్చీ రావుఘాట్ పథకాన్ని ఆమోదించి తీరాల్సిందేనంటూ గొంతుచించుకుని అరుస్తున్నారు. సరే, మీరయితే రావుఘాట్‌కు పోలేదు, అదెట్లా వుందో చూడలేదుగదా. కాని, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, కొరియా, జపాన్‌లు - ఈ అయిదు దేశాలకు చెందిన అధికారులు నేడు రావుఘాట్‌లో డేరాలు వేసుకుని కూర్చున్నారని మీకు తెలుసా? ఎందుకంటే, అక్కడి ఇనుపరాయి తవ్వకానికిగాను ఒక అంతర్జాతీయస్థాయిలో టెండర్లు జారీచేసి కంట్రాక్టులు అప్పగిస్తారట. కనుక అక్కడ ఏ విధమైన యాంత్రీకరణ జరుగుతుంది, ఎలాంటి సాంకేతిక పద్ధతులు అమలుచేస్తారు, ఏ సాంకేతిక ప్రక్రియతో అక్కడ ఇనుపరాయి తవ్వితీసి భిలాయి కార్ఖానాకు పంపిస్తారు మొదలైన విషయాలపై నేడు ప్రపంచమంతటా చర్చ జరుగుతున్నది. చూశారా, మనం బస్తరువాసులం, మనం ఛత్తీస్‌గఢ్‌వాసులం యింతదాకా ఆ రావుఘాట్‌ను చూసియెరుగము కాని ఈ ఆస్ట్రేలియావాళ్లు, అమెరికా, కెనడా, కొరియా, జపాన్ దేశాల వాళ్లంతా యిప్పటికే సర్వం చూసేశారు.

నేనొకసారి ఒక (భిలాయి) అధికారితో కొంత రహస్యంగా మాట్లాడాను. నేనాయన్ను నావద్దకు పిలిపించుకొని, "భాయీ, యాంత్రీకరణ (mechanisation) దరిమిలా ఉత్పత్తి ఖర్చు (Cost of Production) తక్కువ కావాలి కదా. మీరంతా పదేపదే చెప్పేది అదేగదా. కాని మీరంతా కల్లబొల్లి కబుర్లు చెబుతున్నారు. దొంగలెక్కలు చూపిస్తున్నారు. యంత్రం సరిగ్గా పనిచేస్తే లాభాలు యింత అని మీరు చెబుతున్నారుగాని దాని మెదడు ఖరాబైనప్పుడు దాన్ని తిరిగి బాగు చేయడానికి ఎంత ఖర్చవుతుందో మీరెన్నడైనా యోచించారా? అసలుకు యంత్రం విలువ తరుగుదల (depreciation) మీరు చెప్పే లాభాలకంటే ఎన్నోరెట్లుగా జరుగుతున్నది గదా" అని మందలించాను. ఇక సాంకేతిక పద్ధతి విషయానికివస్తే మనిషిద్వారా శారీరకంగా జరిగే పనిపద్ధతే మన దేశంలో అన్నింటికంటె మెరుగైనది. అందువల్ల ఉత్పత్తి ఖర్చుకూడ తగ్గుతుంది. నాణ్యతకూడ అధికంగా వుంటుంది. బైలదిల్లలో

ముడిఖనిజం పదేళ్లపాటు శారీరక శ్రమ పద్ధతి ద్వారానే తవ్వితీసారు మనుషులు శారీరకంగా పనిచేసే చోట్ల వాళ్లు నాణ్యతలో లోటులేని సరుకు - అదీ యంత్రం వెలిసితీసేదానికంటే మెరుగైన ముడిసరుకే - వెలికితీసి యివ్వగలుగుతారు ఇందుకు తిరుగులేని నిదర్శనం మన బొగ్గు పరిశ్రమే బొగ్గు గనుల యాంత్రీకరణ జరగనప్పుడు లేదా ఆ యాంత్రీకరణ మందకొడిగా మాత్రమే జరుగుతూండినప్పుడు కార్మికులు యిప్పటికంటె ఎంతో నాణ్యమైన బొగ్గు వెలికితీసేవాళ్లు ఇప్పుడో యంత్రాలు తవ్వితీసే బొగ్గు నాణ్యత బాగా పడిపోయింది అయినప్పటికీ మీరు సాంకేతిక పద్ధతులంటూ మాట్లాడుతున్నారే అంతకంటె మేము యంత్రాలను గురించి మాట్లాడుతున్నాం అని చెప్పుకోండి, అదే వాస్తవానికి చేరువగా వుంటుంది. యంత్రాలు, సాంకేతికత యివి రెండూ రెండు వేర్వేరు అంశాలు ఇక మీరు ప్రవేశపెట్టే సాంకేతిక పద్ధతులంటారా - అభిమన్యునిలా మీరు వ్యూహంలోకి దూసుకుని పోయారే గాని అందునుండి బయటపడే మార్గం మీకు తెలియదు కనుక మీకుకూడ పద్మవ్యూహంలో చిక్కిన అభిమన్యుని గతే చివరికి పట్టకతప్పదు అంటే మీరిక్కడ దేశప్రజలకుచెందిన వేలాది కోట్ల రూపాయల నాశనానికి కారకులవుతున్నారు అంటే దేశప్రజలు మీపై నెలకొల్పుకున్న గౌరవ విశ్వాసాలను మీరు హత్యచేసివేస్తున్నారు ప్రజల అవసరాలను మీరు గొంతు నొక్కేస్తున్నారు ఈ విధంగా మీరు దేశానికి ఒక కొత్త సమస్య సృష్టించి పెడుతున్నారు మీరిలా మరణ శక్తుల్ని ప్రబలం గావిస్తూ, జీవశక్తుల్ని అణచివేస్తున్నారు జీవశక్తులపై కత్తివేట్లు వేస్తున్నారు! అనికూడ నేనాయన్ను మందలించాను అయితే ఈ ప్రశ్నలకు సరైన జవాబులిచ్చే ఏ వ్యక్తి, ఏ శక్తి, ఏ ఆలోచనాధోరణి నాకింతవరకు కనిపించలేదు

ఛత్తీస్‌గఢ్‌స్థాయిలో అతిస్పష్టంగా రెండు విషయాలు, రెండు అంశాలు పెల్లుబికి ముందుకువచ్చాయి ఇంకా అనేక సమస్యలు లేకపోలేవనుకోండి కాని స్థూలంగా రెండు సమస్యలు - ఒకటి భూమి సమస్య, రెండవది యాంత్రీకరణ సమస్య - మన ముందుక వచ్చాయి ఈ భూమి సమస్య గురించి, యాంత్రీకరణ క్రమం గురించి, అలాగే పారిశ్రామిక విధానం గురించి మీ మనసులో భ్రమలే

వుండరాదు, స్పష్టమైన అవగాహన వుండాలి 'భూమిపుత్రుల' రాజకీయ విధానం, ఇక్కడి భూమికి సంబంధించిన "ఛత్తీస్‌గఢ్ ఛత్తీస్‌గఢ్ వాసులదే ఛత్తీస్‌గఢ్‌వాసులు కానివారు తిరిగి వెళ్లిపోవాలి!" అనే వారి నినాదం రెండూ ఘృణార్హమైనవే అలాగే ఆర్థికవాదం - కేవలం ఆర్థిక సమస్యలపై ట్రేడ్‌యూనియన్ కార్యకలాపాలు నడిపించడం, దీన్నికూడ మీరు ఏవగించుకోవాల్సిందే

ఈ రెండూ రాజకీయ విధానానికి సంబంధించిన విషయాలు సి పి ఐ, సి పి ఎం ల వాళ్లు నిరంతరం ఈ అంశాన్నే (ఆర్థికవాదాన్ని) తీసుకొని కార్మికరంగంలో పనిచేస్తున్నారు కాంగ్రెసు, భా జ పా లు కూడ ఈ విషయంలో వారివెంటే వున్నాయి పోతే మరొక కొత్త రకమైన (చెడు) శక్తి వున్నది - ప్రజలలోనే చీలికలు సృష్టించడానికి, ప్రజల ఐక్యతను భగ్నంగావించడానికి, ప్రజావాణిని అణచివేయడానికి, జనశక్తిని నాశనం చేయడానికి ఉద్దేశించిన విభజించి పాలించే రాజకీయ విధానమే అది చీలిక రాజకీయాలను ప్రబోధించేవారినికూడ మీరు అసహ్యించుకోవల్సిన అవసరం వుంది సరే వాటన్నిటినీ నచ్చము, వాటిని మేము ఏవగించుకుంటాం లెండి, కాని (మేము పాటించాల్సిన) కొత్త అంశం ఏమిటి అని అడుగుతారా? ఉన్నది అదేమంటే మనమంతా ఒక్క గొంతుకతో "దోపిడీవర్గాల జాగీరు కాదు, ఛత్తీస్‌గఢ్ మనందరిదీ!" అని నినదించాలి!

దోపిడీవర్గాల, పీడకవర్గాల జాగీరుకాదు ఛత్తీస్‌గఢ్ మన కార్మికులు, కర్షకులు తదితర శ్రామిక ప్రజలది, నిజాయితీపరులది, దేశభక్తులది మిగతా వర్గాలవారు మీలో (ప్రజలలో ) భాగం కారు అదెట్లా, నాకు భూమి వున్నదంటావా? నీవెక్కడి ఛత్తీస్‌గఢ్ వాసివయ్యా? నీవు రక్తపిపాసివి మనిషి నెత్తురు తాగే నీవు ఛత్తీస్‌గఢ్‌వాసివి కావు. ఛత్తీస్‌గఢ్‌వాసులెవరూ మనిషి నెత్తురు తాగరు శ్రామిక ప్రజలు, దేశభక్తులు ఎవరి రక్తమైనా తాగుతారా? కనుక ఛత్తీస్‌గఢ్ మాదైతే అప్పుడది మీది కాదు లేక ఛత్తీస్‌గఢ్ మీదైతే, అదిక మాది కాదు ఈ రెంటికీ (శ్రామికప్రజలు, దోపిడీవర్గాల ప్రయోజనాలకు) చాల స్పష్టమైన తేడావుంది అందుకే ప్రజల ఐక్యతకు భంగకరమైన వాళ్ల

నినాదాన్ని మనం యివ్వబోవడంలేదు మనం ఒక నూతన ఛత్తీస్‌గఢ్ గురించి మాట్లాడుతాం. "దోపిడీ వర్గాల జాగీరు కాదు, ఛత్తీస్‌గఢ్ మన (శ్రామిక) ప్రజలందరిదీ!" అనే నినాదం యిస్తాము

పోతే కేవలం ఆర్థిక డిమాండ్లను గురించే కాదు, సాంకేతిక పద్ధతులను గురించి కూడ పట్టించుకోవాలి పరిశ్రమల్లో నేడు ఉత్పత్తి ఏ రూపంలో జరుగుతున్నదో దాన్నిగురించికూడ చర్చించాలి భిలాయి కార్ఖానానుండి వచ్చిన కార్మిక సోదరులు నేడిక్కడ మనమధ్య వున్నారు వారి సమక్షంలో నా స్వానుభవానికి సంబంధించిన విషయమొకటి చెబుతాను పూర్వం నేను భిలాయిలో కార్మికునిగా పనిచేస్తూండినప్పుడు సింప్లెక్స్ కంపెనీ వద్ద అప్పట్లో కేవలం రెండు లేత్ మెషిన్‌లు (తరిమెన యంత్రాలు) మాత్రమే వుండేవి కాని నేడో అదే సింప్లెక్స్ కంపెనీకి బ్రహ్మాండమైన పెట్టుబడులున్నాయి వారిప్పుడు కోట్ల రూపాయల పెట్టుబడులు సముపార్జించుకుని వున్నారు చైనా సహకారంతో వాళ్లిప్పుడు బైలదిల్లలో ఒక స్పాంజ్ ఐరన్ కర్మాగారం నిర్మించబోతున్నారు దానికే 150 కోట్ల రూపాయలకు పైగా ఖర్చవుతుంది! నా కళ్లతో నేను చూచాను - నేటికి 25-30 ఏళ్లక్రితం వాళ్లవద్ద కేవలం రెండు లేత్ మెషిన్లు మాత్రమే వుండినాయి అలాంటి వాళ్లు నేడొక ఇనుము - ఉక్కు కార్ఖానా పెట్టేంత స్థితికి ఎదిగిపోయారు వాళ్లకు నేడు భిలాయిలో కార్ఖానా వుంది, అహమదాబాదులో వుంది, ఇంకా మరోచోటకూడా వుంది అలాగే బి కె కంపెనీ గురించి కూడ మనకు తెలుసు (ఇక్కడేమిటి) చండీగఢ్‌లో భవన నిర్మాణ కంట్రాక్టులు కూడ ఈ బి కె కంపెనీవే బెంగుళూరులో, భోపాల్‌లో, బొకారోలో, దుర్గాపూరు - రూర్కెలాలలో సైతం బిల్డింగు కంట్రాక్టులు ఈ కంపెనీవే నేడు దేశంలోకెల్లా ఇద్దరు అతిపెద్ద బిల్డింగు కంట్రాక్టర్లు వున్నారు ఒకరు ఏషియాడ్ నిర్మాణ పనులు చేపట్టినవారైతే, రెండవవారు మన భక్తియార్ సింగ్ తాలూకు బి కె కంపెనీ వారే అయితే ఈ భక్తియార్ సింగ్ తొలుత భిలాయి ఉక్కునగరం 4వ సెక్టారులో మొదటగా కంట్రాక్టులు చేబట్టినప్పుడు ఈయన వద్ద (ఒక పెట్టె తప్ప) ఏమీ వుండేది కాదు పెట్టెమోసే కంట్రాక్టరు పేరిట ఈయన సుప్రసిద్ధుడయ్యాడప్పట్లో మరి ఈ పెట్టెమోసే కంట్రాక్టరే నేడు

దేశంలో అతిపెద్ద కంట్రాక్టరయిపోయాడు. ఇకపోతే ఇక్కడ భిలాయిలో పుట్టిన పారిశ్రామికవేత్తలు - ఇందర్‌చంద్ జైన్, మూల్‌చంద్ జైన్‌లు వున్నారు చూడండి. వీళ్లు కువైట్ పోయి అక్కడ ఒక పైపులైను వేసేందుకు ఒక కంట్రాక్టు తీసుకున్నారు. పాత పైపులు తీసుకొచ్చి, వాటికి కొత్త రంగువేసి కొత్త పైపులని బుకాయించి ఆ కంట్రాక్టు పూర్తి చేశా మనిపించారు. కాని అనతికాలంలో బండారం బయటపడి మూల్‌చంద్ జైన్‌ను అరెస్టుచేశారు. అక్కడి కాజీ (నేరవిచారణ జరిపే న్యాయమూర్తి) ముందుకు ఈ మూల్‌చంద్ జైన్‌ను తీసుకుపోయారు. "ఇతని రెండు చేతులూ నరికివేయండి!" అని ఆ కాజీ శాసించాడు. కువైట్‌లో ఇస్లామిక్ చట్టం అమలులో వుంది మరి. అయితే అక్కడి మన ఎంబసీ (దౌత్య కార్యాలయం) వాళ్లు కలగజేసుకుని, నానాతంటాలు పడి ఈ మూల్‌చంద్ జైన్‌ను తప్పించి ఒక గోనెసంచిలో వేసి కుట్టి, ఆ సంచిలో ఏదో సామాను వున్నదని బుకాయించి విమానంలో ఎక్కించి యిక్కడికి పార్సిల్ చేశారు! అట్లా బతుకు జీవుడా అంటూ ఈ మూల్‌చంద్ జైన్ ఎలాగో బయట పడ్డాడు. అంటే ఇక్కడి కంట్రాక్టర్లు కువైట్‌దాకాకూడ వెళ్లారు. వీళ్లంతా ఎంతెంత డబ్బులు గడించి వుంటారో మీరే ఊహించండి.

భూమి సమస్యపై, పరిశ్రమలు, పారిశ్రామికవేత్తల సమస్యపై మనకు ఒక స్పష్టమైన అవగాహన వుంటే అప్పుడే రకరకాల భ్రమలు, తప్పుడు ఆలోచనాధోరణులు, మరణతత్వాల ప్రాబల్యంనుండి మనకు విమోచన లభిస్తుంది. మరణ తత్వాలనుండి మనకు ముక్తి లభించి నప్పుడు జీవతత్వాల పట్టు పెరుగుతుంది. అమరుల ఆలోచనా ధోరణి ప్రాబల్యం వహిస్తుంది. విముక్తి మార్గం వెల్లివిరుస్తుంది.

సరే, మనమేదైనా సవ్యమైన కార్యక్రమమొకటి రూపొందించుకోదలిస్తే, ముందుగా ఈ కింది అంశాలను గమనికలోనికి తీసుకోవాల్సివుంటుంది.

మొదటి కీలకమైన అంశం: (అధికార) శక్తి ఎవరి వద్ద వుంది? అనేదే, ఈ శక్తి రెండు చోట్ల వున్నదని నేనంటాను. "కాదు కాదు, రెండు చోట్ల ఎలా వుండగలదు? అది ఒకే చోట వుండాలి గదా!"

అని మీరడుగుతారు అయినా నిజం, అది రెండు చోట్ల వున్నది ఒకటేమో పశుశక్తి. ఈ పశుశక్తి ప్రభుత్వాధికారంలో వున్నది - మీపై హుకుం చేస్తూ, మిమ్మల్ని పాలించే ప్రభుత్వాధికారంలో వుంది. పోతే మరోచోటకూడ మరో శక్తి వున్నది - అదే జనశక్తి. ఇలా రెండు చోట్ల, జనశక్తి, పశుశక్తి అని రెండు తీరుల నేడు అధికారశక్తి వున్నది జనశక్తి బలహీనంగావున్నచోట పశుశక్తి ప్రాబల్యం మెండై వుంటుంది అక్కడ మరణ తత్వాలు ఆధిక్యంలో వుండి జీవశక్తులు దెబ్బతింటుంటాయి కాగా జనశక్తి ప్రాబల్యం వున్నచోట పశుశక్తి, మరణతత్వాలు గడగడలాడి పోతాయి అంటే యిదంతా పలుకుబడి సమస్యన్నమాట జనం పలుకుబడి నెలకొల్పుకుంటే, జనశక్తి స్థాపించుకుంటే అప్పడే మనం మరణతత్వాలను, పశుశక్తిని తిప్పికొట్టగలుగుతాం కనుక, మిత్రులారా, జనశక్తిని నెలకొల్పే పద్ధతులు, కార్యక్రమాలను గురించి నేడు మనం యోచించాల్సివుంది

మన సహచరులు అనేకచోట్లనుండి వచ్చివున్నారు మోంగ్రా ప్రాంతంలో పనిచేసే మన సాంఘిక కార్యకర్త ఒకరు కనర్గా వెళ్లి అక్కడ ఫారెస్టు అధికారులకు వ్యతిరేకంగా నిరాహారదీక్ష చేస్తే పోలీసులు అతడ్ని నక్సలైటని చెప్పి అరెస్టుచేశారు కాని ఎవరినైనా నక్సలైటని పేరుపెట్టి చంపేందుకు, జైల్లో తోసేందుకు మన రాజ్యాంగంలోనైతే నిబంధనలేవీ లేవు పైగా ప్రత్యేకించి మన సాంఘిక కార్యకర్తల విషయంలో యిలాంటి ఆరోపణలేవీ చెల్లవు ఎందుకంటే అతడు నాకు వ్యక్తిగతంగా తెలుసు అతడు నక్సలైటేమీ కాదు అసలుకు అలాటి భావాలు అతనిలో ఏ కోశానా లేవు అయినా అతడ్ని నక్సలైటని చెప్పి అరెస్టు చేయగలిగారు ఎందుచేత? ఎందుకంటే, ఆ ప్రాంతంలో మరణ తత్వాలు ప్రబలంగా వున్నాయి గనుక జీవతత్వాలు మనకక్కడ ఎక్కడా కనిపించవు అక్కడి ప్రజల్లో ఐక్యతలేదు, సంఘనిర్మాణం లేదు అక్కడి గ్రామాల్లో జనశక్తి నెలకొనలేదు ఛత్తీస్‌గఢ్ ప్రాంతంలో నేటికీ జనశక్తి ప్రబలంగా నెలకొనలేదు, ఎక్కడో కొన్ని చోట్ల గుడ్డి దీపంలా మిణుకుమిణుకుమంటూాందంత మాత్రమే కనుక మనం జనశక్తిని, ప్రజాధికారాన్ని స్థాపించుకోవాల్సివుంది అంతదాకా మన సహచరులు యిలా అరెస్టవుతూనే వుంటారు

ఈ విషయమై నేనొక సారి ఎస్ పి సాహెబును కలిసి మాట్లాడాను. "మా కార్యకర్తను మీరు (కవర్ధాలో) అరెస్టు చేశారెందుకు? సరే మంచిది, అలాగే కానీండి ఊళ్లలోకి లేక అడవిలోకి వెళ్లి మా కార్యకర్త అటవీశాఖ అధికారులకు వ్యతిరేకంగా మాట్లాడితే మీ రతడ్ని నక్సలైటని చెప్పి అరెస్టు చేస్తారా? కాని యిది ఛత్తీస్‌గఢ్ ఇక్కడ నక్సలైటని చెప్పి ఎవరినైనా అరెస్టు చేయడం అంత తేలికకాదని గుర్తుంచుకోండి ఇక్కడ జనశక్తి ఆవిర్భవిస్తోంది ఫారెస్టు అధికారులు అత్యాచారాలు జరిపితే ఈ జనశక్తి వారిని నిలదీస్తుంది ఛత్తీస్‌గఢ్‌లో యిలాంటి జనశక్తి పుడుతూంది - కవర్ధాలో పుడుతూంది జౌకీలో జనిస్తూంది, నారాయణపూర్‌లో, కోండాగావ్‌లో, కాంగేర్‌లో పుడుతూంది సర్‌గూజా, రాయ్‌గఢ్‌లలో కూడ పుడుతూంది భిలాయి, దల్లీ - రాజ్‌హారా, రాజ్‌నంద్‌గావ్, కోర్బాలలో - ఈ కార్మికక్షేత్రంలో కూడ జనిస్తోంది కనుక ఏమీ ఫరవాలేదు లెండి, ఎస్ పి గారూ, మీరు యిలాంటి అరెస్టులు యింకో రెండు మూడు చేయండి అప్పుడు చూడండి ఎలాంటి ఎలాంటి నక్సలైట్లు పుడుతారో, ఆ నక్సలెట్లు ఏమేమి చేస్తారో!(మీరలా చేస్తే మా ఉద్యమం నదిలోకి నీళ్లు బాగా వచ్చిపడినట్లవుతుంది) నదిలోకి నీళ్లు నిండుగా వచ్చినప్పుడు, వరద వచ్చిపడినప్పుడు చెత్తచెదారం అంతా కొట్టుకుపోతుంది (మీకు) మిగిలేదేమీ వుండదు కనుక అలా నదినిండా నీళ్లు వచ్చిపడినప్పుడు మీరు విచారించి మాత్రం లాభంలేదు అయ్యో, తప్పచేశామే, ఒక సాంఘిక కార్యకర్తను నక్సలైటని చెప్పి అరెస్టుచేశామే, యిప్పుడిలా అయిందే అని వాపోతే లాభం వుండదు అప్పుడు మీరెంత మొత్తుకున్నా లాభం వుండదు" అని హెచ్చరించాను

కాని, మనం యింతటిలో సంతోషపడరాదు వానాకాలం నదిలో నీళ్లు నిండుగా పారవచ్చు కాని తర్వాత ఆ నీళ్లు ఎక్కడికి పోతాయి? అవన్నీ సముద్రంలో కలిసిపోతాయి దానితో మన నది ఎండిపోతుంది కనుక మనం కొత్తగా వచ్చిచేరిన నీటిని నిలువ చేసుకునే యోచన చేయాలి ఆ నీళ్లను నిలుపు చేయాలి కాని, ఎలా నిలుపు చేయడం? ఆనకట్ట కట్టాలి, అంటే ఐక్యత సాధించాలి. అప్పుడే ఆ నీళ్లు ఆగివుంటాయి. అంటే కార్మికులు, రైతులు, బుద్ధిజీవులు, దేశభక్తుల నడుమ ఐక్యత నెలకొల్పాలి. అప్పుడు ఈ జనశక్తి నదినీరు వృథా

పారకుండా నిలిచివుంటాయి. ఈ పని మీరు చేస్తూనే వున్నారు గాని దీన్ని మరింత చలాకీగా, మరింత చురుగ్గా, మరింత త్వరగా, మరింత ధైర్యసాహసాలతో చేయాల్సివుంటుంది మన సర్దార్ భగత్‌సింగ్ నుండి రామాధీన్ గోండ్‌వరకు, రామాధీన్ గోండ్‌నుండి అభన్‌పూరుకు చెందిన రమేశ్ పరీడాదాకా ఎంతమంది ఎంత గొప్ప త్యాగాలు చేశారు! రమేశ్ పరీడా అతినిర్భయంగా అపూర్వత్యాగం చేశాడు ఇలాంటి మహాత్యాగాలవల్లే నేడు జనశక్తి నెలకొనబోతున్నది పోతే మతతత్వం పేరిటో, కులగోత్రాల పేరిటో, లేక మతపరిశుద్ధత పేరిటో లేక వేరే పేరిటో (ఎవరైనా ప్రజలలో) చీలికలు సృష్టించదల్చుకుంటే, అలాంటి ప్రయత్నాల్ని మనం ఆమోదించం చీలిక విత్తనాలు చల్లేందుకు ఎవరినీ అనుమతించబోమని నేడు మనమంతా ప్రతిజ్ఞ చేస్తున్నాము మన మంతా కలిసి ఐక్యతా బీజాలు మాత్రమే విత్తుతాం నేడు నదిలోకి నీరు కొద్దిగానే వస్తున్నా, మనం కనుక చురుగ్గా పనిచేసుకుపోయేకొద్దీ నీళ్లు మరింతగా వచ్చిపడుతాయి మన మీ నీళ్లను వృథా పారకుండా ఆపుకొని, ఎప్పుడు ఎక్కడ అవసరం పడితే అప్పుడు అక్కడకు మళ్లించాల్సి వుంటుంది ఉదాహరణకు, కవర్ధాలో అత్యాచారాలు జరుగుతున్నాయంటే మనమిక్కడ రాయ్‌పూర్‌లో మీట (స్విచ్) నొక్కగానే మనవద్దగల నీళ్లన్నీ (జనశక్తి) ఉరవడిగా కవర్ధాకు మళ్లిపోయేట్లు, "అరె, యిక్కడేం జరుగుతున్నదో చూద్దాం!" అంటూ అక్కడ ముసురుకునేటట్లు వుండాలి "మేము వేలాది ప్రజలం పశుశక్తిని ఎదిరించడానికి వచ్చాం, ఎక్కడ పశుశక్తి?" అని హుంకరించేటట్లుండాలి "ఎక్కడున్నావ్ రా, చేత మా జనశక్తిని, మా ప్రజాధికారాన్ని ఎదిరించి నిలు!" అని సవ చేయగలగాలి

అసలు ఈ గూండాలందరూ దిష్టిబొమ్మల్లాంటివాళ్లే పక్షుల బెడదనుండి తప్పించుకోవడానికి రైతు తనపొలంలో ఒక దిష్టిబొమ్మను నిలబెడతాడు దానితో పాపం పిట్టలు, పక్షులు అన్నీ యిది ఎవరో మనిషే నన్న భయంతో చేనుదగ్గరకు రాకుండా పోతాయి అయితే మేసే జంతువులను ఈ దిష్టిబొమ్మ ఆపగలదా? లేదు, దిష్టిబొమ్మ వున్నచోటే నిలిచివుంటుంది, ఆ జంతువులు చేలో పడి బాగా మేసి వెళ్లిపోతాయి మరి ఈ యూనిఫారాలు ధరించే పోలీసు, భద్రతా

సిబ్బంది, లేదా భయబీభత్సాలు నెలకొల్పజూచే గూండాగాళ్లు అంతా యిలాంటి దిష్టిబొమ్మలవంటివారేనని గ్రహించుకోవాలి

నేను ఇటీవల ఏ సి సి ఫ్యాక్టరీ ఎదుట నిరాహారదీక్షకు కూర్చున్న సంగతిగురించి యిక్కడ కాస్త చెప్పుకోవాలి అప్పుడక్కడి గూండాలు నన్ను కొట్టిచంపడానికిసైతం తయారుగా వుండినారు దానితో కలెక్టరు, ఎస్ పి లే స్వయంగా "నియోగిజీ! మీరక్కడికి వెళ్లకండి, మీ ప్రాణాలకు ప్రమాదం!" అని నన్ను హెచ్చరించారు అంతకు ముందు ఆ గూండాలు మా సహచరులను అనేకమందిని కొట్టివున్నారు కూడ అయినా నేను వెనక్కు తగ్గకుండా, "మంచిది, చావాలనివుంటే చస్తాము లెండి ఆ మాటకొస్తే ఈ ప్రపంచంలో చావకుండా ఎవరైనా వుంటారా? నేడో రేపో మనమంతా చావవల్సిందే గదా అయినా ఇప్పుడు నేను బాగానే వయసుమళ్లి వున్నాను మన దేశంలోని సగటు ఆయుష్ప్రమాణానికి దగ్గరదగ్గరగా చేరుకునివున్నాను కనుక ఇంకా బతికి వుండాలనే వ్యామోహం ఏమీ లేదు నాకు ఇప్పటికే ఎంతోమంది కామ్రేడ్లు ఈ సమాజంలో జనశక్తి ప్రాబల్యంకోసం, ప్రజాధికార స్థాపనకోసం, యితర మంచి పనులకోసం తమ ప్రాణాలు బలిపెట్టివున్నారు నేనా మాత్రం చేయలేకపోయాను దేశభక్తి గీతాలు పాడుకుంటూ త్యాగాల బాటలో పయనించిన మన అమర సహచరుల వంటి జీవితం లభిస్తే యిక ధన్యుడినే అని నేను కలలుగంటూ వస్తున్నాను కూడ ఇంతకు మించిన పుణ్యం కేదార్‌నాథ్, బదరీనాథ్‌లకు వెళ్లినా దక్కుతుందా? కనుక మీరేం చేయాలో అది చేసుకోండి నేను మాత్రం ఎటుబడీ నిరాహారదీక్షకు అక్కడ కూర్చునేదే" అని ఖరాఖండిగా చెప్పేశాను ఆనక వెళ్లి ఏ సి సి ఫ్యాక్టరీ ముందే నిరాహారదీక్షకు కూర్చున్నాను అప్పుడుకూడ పశుశక్తి నాపై దాడికి వచ్చింది అయితే అప్పటికే అక్కడ జనశక్తి వెలకొనివుండింది ఏ సి సి కార్మికులు, ఇతర ప్రాంతాల కార్మికులు పెద్ద పెద్ద లారీలు చేతబట్టుకుని నాకు కాపలా కాయసాగారు తెల్లారుజాము 3 గంటలయినా వాళ్లలానే మేల్కొని వుండినారు, ఇళ్లకు వెళ్లిపోవడానికి యిచ్ఛగించలేరు కాని నేనే వాళ్లతో, "వెళ్లండి ఇప్పుడు ఇంకేమీ అవసరం లేదు. మీరు ఇళ్లకు వెళ్లండి ఇప్పుడు అన్యాయంవద్ద శక్తి ఏమీ లేదు న్యాయానికే, నీతికే బలం వున్నది నీతిని, న్యాయాన్ని

యిప్పుడు అన్యాయం ఎదిరించి పోరలేదు. నాకేమీ కాదులెండి. మీరే చూస్తారుగదా." అంటూ ఎంతో నచ్చజెప్పి అతికష్టంమీద వాళ్లను యిళ్లకు పంపించేసాను. అనుకున్నట్లే ఆ తర్వాత ఏమీ కాలేదుకూడ. కనుక పశుశక్తి అలాంటిదండీ. చేలలో ఊగులాడుతుండే దిష్టిబొమ్మలాంటిది. అది కేవలం పిరికిపిట్టల్నిమాత్రమే చెదరగొట్టగలదు. అయితే మనం ధైర్యం చేసి ముందుకువెళితే మాత్రం అస లీ గూండాలవద్ద శక్తి ఏమీ లేదని గమనించగలం. గూండాలేమిటి, పోలీసులవద్దనైనా ఏ శక్తి లేదు. ప్రజాబలాన్ని, జనశక్తిని ఎదిరించి గెల్వగల సత్తా ప్రపంచంలో ఏ శక్తికీ లేదు. అందుచేత మనం భయపడాల్సిన అవసరమేమీ లేదు. రొమ్ము విరుచుకుని ముందుకు నడవండి. రాయ్‌పూరులో మీటనొక్కితే కవర్థాగాని, నారాయణపూర్‌గాని, అవసరమున్న ప్రతిచోటికి జనశక్తి వెళ్లి తన ప్రాబల్యం వెలకొల్పుకునే రోజు వస్తుంది. మారణ తత్వాలను మనం రూపుమాపివేస్తాం, ఎన్నో విలువుల లోతులో పాతిపెట్టేస్తాం. జీవశక్తులు అప్పుడు రొమ్మువిరుచుకుని నిలబడతాయి. ఔనంటారా, కాదంటారా? ఔను, యిలాగే జరుగుతుంది. మన కందరికీ యిదే కోరిక, యిదే ఆశ, యిదే స్వప్నం. కనుక నేడీ విషయాన్ని ప్రచారం చేస్తూనే మనం గ్రామాల్లోకి వెళ్లాల్సివుంటుంది.

ఛత్తీస్‌గఢ్‌లో పశుశక్తికి కంచుకోట ఎక్కడుందంటారు? రాయ్ పూరులో వంటారా? కాదు, ఇక్కడ రాయ్‌పూర్‌లో ఏమీ లేదు. ఇక్కడ మీకు అఖిల భారత స్థాయి నాయకులెందరో - కాంగ్రెసువారు కావీండి, భా.జ.పా., జనతాదళ్ లేదా మరే యితర పార్టీవాళ్లు కానీండి - కనిపిస్తారు నిజమే. కాని వాళ్లంతా భిలాయి పెట్టుబడిదారుల దళారీ ఏజెంట్లు మాత్రమే. ఈ దళారీలే యిక్కడ పీఠంవేసి మేమే ఛత్తీస్‌గఢ్ నాయకులమని చెప్పుకుంటున్నారు గాని అసలు బలం అంతా భిలాయి వాళ్లవద్దే వుంది. పెట్టుబడులన్నీ వాళ్లవద్దే వున్నాయి. ఈ పెట్టుబడుదారుల ప్రాబల్యమే యిక్కడంతా వుంది.

కనుక ఛత్తీస్‌గఢ్‌కు చెందిన యువసహచరులారా, సాంఘిక కార్య కర్తలారా, మీరు మీగ్రామాలకు తిరిగివెళ్లేటప్పుడు ఈ సందేశాన్నే మోసుకుపోవాల్సి వుంటుంది. ఊళ్లలో జనాలు మిమ్మల్ని అడుగుతారు.

"రాయ్‌పూర్‌లో ఏం మాట్లాడుకున్నారు? ఏం నిర్ణయాలు చేసుకొచ్చారు?" అని. అప్పుడు ఈ విషయాన్నే మీరా గ్రామ ప్రజలందరికీ విడమర్చి చెప్పాలి.

ఇక్కడ మరోమాటకూడ చెప్పకుండా వుండలేకపోతున్నాను. లోక్ నాయక్ జయప్రకాశ్ నారాయణ్ ఒక మారు పాట్నాలో ఒక ఉపన్యాసం యిచ్చారు. ఆయన అపుడన్నారు గదా, "పాట్నాలో నేడు నియంతృత్వం రాజ్యమేలుతున్నది. అందుచేత బీహారు ప్రజలంతా దానిని ఎదిరించి గట్టిగా నిలబడవల్సిన అవసరం వుంది. వాళ్లు ప్రతి ఊరి నుండి ప్రతి ప్రాంతంనుండి, ప్రతి పట్నంనుంచి బయల్దేరి యిక్కడికి రావాలి. అంతావచ్చి యిక్కడ పాట్నాలో బైఠాయించాలి." అని. ఆయన ఈ మాట అనడంతో బీహారు అంతటా సమర శంఖం పూరించబడింది. దేశమంతటా నవ చైతన్యం అంకురించింది. ఈనాడు నేను మళ్లీ ఆ మాట మీకు గుర్తుకు తెస్తున్నాను. ఎందుకంటే,

ఛత్తీస్‌గఢ్‌లో జరిగే దోపిడీ, పీడనలన్నింటికీ మూలం యిక్కడి భిలాయి ఉక్కుపరిశ్రమ చుట్టూ అల్లుకునివుండే యాజమాన్య, మేనేజిమెంటు వర్గాలే. వాళ్లే, ఈ పెట్టుబడిదారీ వర్గాలే, ఛత్తీస్‌గఢ్‌లో దోపిడీవ్యవస్థను పెంచి పోషిస్తున్నారు. దానికి ఈ భిలాయి పట్టణం నుండే నాయకత్వం వహిస్తున్నారు. కనుక నేడు వాళ్ల కంచుకోటకు, ఈ భిలాయి పట్టణానికి, ప్రతి గ్రామం నుండి - నారాయణ్‌పూరు నుండి, అభన్‌పూరు నుండి, సర్‌గూజా నుండి, ప్రతి ప్రాంతం నుండి, ప్రతి పట్నం నుండి- రాయ్‌పూర్, బిలాస్‌పూరు, రాజ్‌నంద్‌గావ్, రాజ్‌హారాల నుండి -, మన సహచరులంతా రొమ్ము విరుచుకొని రావాలి. ఏదో ఒక రోజున ఈ సమస్యలన్నింటినీ తేల్చి పారేయాలి...

నాలుగు వేల గ్రామాలున్నాయి మన ఛత్తీస్‌గఢ్‌లో. ఊరికి యిరవై మందిచొప్పున వచ్చినా మొత్తం 80 వేలమంది అవుతారు. అక్కడ భిలాయిలో మన సహచరులు మరో 80 వేల మంది మీకు స్వాగతం చెప్పడానికి సిద్ధంగా వుంటారు. ఈ విధంగా లక్షలాది ప్రజల సంఘటిత శక్తి జనిస్తుంది. మహత్తర జనశక్తి ఆవిర్భవిస్తుంది. దానిముందు

పశుశక్తి తలెత్తుకుని విలవలేకపోతుంది. జనశక్తి ముందు పశుశక్తి తలవంచాల్సి వస్తుంది. తలవంచక తప్పదు. కనుక మనమిప్పుడు ఆ రోజు ఎప్పుడో, ప్రజాధికారాన్ని నెలకొల్పుకునే ఆ శుభదిన మెన్నడో నిర్ణయించుకోవల్సివుంది మన పంచాంగం చూసి ఆ పవిత్ర దినం ఎన్నడో నిశ్చయించుకోవాల్సి వుంది.

కనుక నేడు నలువైపులా, గ్రామగ్రామానా ఈ సందేశం వ్యాపింప జేయాల్సి వుంది ప్రతి ఊరినుండి మనుషుల్ని తీసుకురండి పదిమందిని పట్టండి, ఇరవైమందిని, ముప్ఫయ్‌మందిని తీసుకురండి అంటూ కోరాల్సి వుంది. వాళ్లలా వస్తారు కూడ అయితే ఆయా గ్రామాల్లోని మన యువసహచరులు ఎందుకు వస్తారంట? ఈ రోజు ఛత్తీస్‌గఢ్‌లో నిరుద్యోగమెంతగా ప్రబలివుందో చూడండి ఊరూరా నిరుద్యోగం వ్యాపించివుంది ఈ విషయంలో సి పి ఐ. వాళ్లు - భారత కమ్యూనిస్టు పార్టీ వారు - జనాన్ని, గ్రామప్రజల్ని మోసం చేస్తున్నారు. "రండి, మోంగ్రాడాము కట్టాలని అడగండి, డాము కట్టాల్సిందే," నని వాళ్లను ఎగదోస్తున్నారు ఎందుకంట? ఎందుకంటే అందువల్ల గ్రామాల ప్రజలకు పనులు దొరుకుతాయిగనుకనంట. అయితే దానివల్ల ఓ 200 గ్రామాలు మునిగిపోతాయే అంటే, 'ఆ, ఏమీ ఫర్వాలే'దని అంటారంట ఇంకా "యాంత్రీకరణ చేయాలి! చేయాల్సిందే!" ననే వివాదం యింకోటి ఎందుకంటే అందువల్ల మన నిరుద్యోగం అంతమయిపోతుందంట (అయితే అసలు నిజమేమిటంటే) కేవలం ఒక్క నెలపాటే యాంత్రీకరణ క్రమంలో పనులు ముమ్మరంగా దొరుకుతాయి ఆ తర్వాత అందరికీ ఉద్వాసనే గతి! చూడండి, ఈ సి పి.ఐ వాళ్లు యిలా బహుదుర్మార్గాలు (బద్మాషీ) చేస్తున్నారు ఇలా చెబుతూ ఈ కమ్యూనిస్టు పార్టీవారు ప్రజలవద్దనుండి చందాలు వసూలు చేసుకు తింటున్నారు. ఇలా మీ గ్రామాల్లో, బస్తీల్లో లక్షల రూపాయలు వసూలుచేసుకు తిన్నారు మనం యిలాంటి వారికి మొహం పగిలేలా గట్టి జవాబివ్వాలి. ప్రజలకు మనం చెప్పాలి! "సహచరులారా, రండి వెళదాం! నేడు మన ఛత్తీస్‌గఢ్ ప్రాంతంలో ప్రజాధికారం నెలకొల్పుకోవాల్సి వుంది ఈ మహదవకాశాన్ని మనం చేజారవిడుచుకోరాదు మనమంతా ఒక్కుమ్మడిగా కదిలివెళ్లి భిలాయికి చేరుకోవాలి జన శక్తి జెండాను

సమున్నతంగా ఎగరేయాలి సరేనా" అని ఉద్బోధించాలి

ఔను, ఛత్తీస్‌గఢ్‌లో ఆ సుదినం ఒక రోజు వస్తుంది. మన ఛత్తీస్‌గఢ్‌లో చెరువు లెన్ని వున్నాయి? ఊరూరా చెరువులు లేవూ. మరవన్నీ కలిపి ఒక పెద్ద సరస్సయితే! ఈబ్‌నది, అర్పానది, ఇంద్రావతి, శివనాథ్ , మహానది - యివన్నీ ఒక్కటయితే! ఎంత విశాల జలరాశి మన ముందుంటుంది! అది ఒక సముద్రమంత వుంటుంది. అందులోంచి పెద్ద పెద్ద అలలు రేగుతాయి. ఆ పెనుకెరటాలు విజృంభించి దోపిడీదుర్గంపై భీషణ ప్రహారాలు చేస్తాయి. పదే పదే తగిలే ఆ అలల తాకిళ్లకు ఆ దోపిడీ దుర్గం తట్టుకోలేక పోతుంది. అది బీటలు వారడం మొదలవుతుంది. అది మొదలే బలహీనమైన కోట - ఎందుకంటే అన్యాయం పునాదిపై నిలుచున్నది గనుక. ఆ కోట తప్పనిసరిగా పడిపోతుంది.

అయితే అందుకుగాను ఛత్తీస్‌గఢ్‌లోని సకల గ్రామాల్లోని చెరువు లన్నింటి నీళ్లు, ఈబ్, బాంగో, ఇంద్రావతి, శంఖిణి, మహానది మొదలైన నదులన్నింటి నీళ్లు కావాలి ఆ నీళ్లన్నీ కలిసి ఒక పెద్ద సముద్రమే కావాలి అప్పుడా కడలి గొంతుక నుండి ఒక బ్రహ్మాండమైన ఘోష వెలువడుతుంది "విప్లవం వర్ధిల్లాలి!" అనే మహా గర్జన వెలువడుతుంది అప్పుడది ఒక గుణాత్మక మార్పు తెచ్చేదిగా, నిజమైన విప్లవం తెచ్చే పరిణామంగా వుంటుంది. ఆపై ఒక యుద్ధం జరుగుతుంది. చావు బతుకుల పరస్పర సంఘర్షణ అది. చావు నెదిరించి బతుకు, జీవితాన్నెదిరించి మృత్యువు భీకరంగా పోరాడే ఈ భీషణ యుద్ధం జరిగితీరుతుంది. మరి ఈ యుద్ధం మీరే చేయాలి!

ఇక్కడ ఓ చిన్న కథ చెబుతాను ఇది ప్రాచీనకాలపు ఒక బానిసల తిరుగుబాటు గాథ స్పార్టకస్ అనే ఒక నాయకుడుండేవాడు పుచ్చుకోవడమే అలవాటయిన నేటి నాయకులవంటివాడు కాడాయన విముక్తి గీతాలు పాడుతూ, అశేష ధైర్యసాహసాలు ప్రదర్శించిన మహానాయకుడు బానిసల సంకెళ్లు తెగగొట్టడానికి పోరాడి, వీరోచితంగా ప్రాణాలర్పించిన త్యాగధను డా స్పార్టకస్ యుద్ధంలో స్పార్టకస్

చివరకు పట్టుబడిపోతాడు అయితే యుద్ధ ఖైదీలలో స్పార్టకస్ ఎవరో బానిస యజమానులకు గుర్తుతెలియదు. యుద్ధ ఖైదీలు అసంఖ్యాకంగా వుండినారు కనుక వాళ్లనే అడిగారు, "మీలో స్పార్టకస్ ఎవరు?" అని వెంటనే ఒకరు ముందుకొచ్చి "నేను స్పార్టకస్‌ను" అన్నాడు ఇంతలో మరొకరు దూసుకొచ్చి "కాదు, నేనే స్పార్టకస్" నన్నాడు! వెంటనే ఈమూలనుండి ఒక గొంతుక "కాదు, నేను స్పార్టకస్!" అంటే ఆ మూలనుండి మరో గొంతుక "నేనే స్పార్టకస్" నని అందుకుంది విచిత్రం అందరిదీ ఒకే గర్జన "స్పార్టకస్ నేనే!"నని. "నేనెవరిని? నేనే స్పార్టకస్!"

నేడు యిక్కడకూడ ప్రతిగ్రామంలో ప్రతిమనిషి యిలాగే ధైర్యంగా నిలబడాలి. జనశక్తి ప్రతిష్టించగోరే ప్రతి గ్రామస్తులూ, "నేను ఈ ఊరివాడిని," "నేను ఫలానా గ్రామస్తుడిని" అని సగర్వంగా చెప్పుకుంటూ రావాలి ఇలా ఛత్తీస్‌గఢ్‌లోని ప్రతిగ్రామం దృఢంగా నిలబడాలి ప్రతి కార్మికుడు - ప్రతి వీధికి, ప్రతి వాడకు, ప్రతి గుడిసెకు చెందిన కార్మికుడు - గట్టిగా నిలబడాలి గ్రామవాసులు, పట్నవాసులు భుజం భుజం రాసుకుంటూ ఒకే నినాదం "మాకు విముక్తి కావాలి" అనే నినాదం యిస్తూ సాగిపోవాలి "ఎవరికి విముక్తి కావాలి? " "మాకు విముక్తి కావాలి" అంటే ఎవరికి కావాలి? నారాయణపూరు వారికి కావాలి, సర్‌గుజావాళ్లకు కావాలి, మైన్‌పాట్‌కు కావాలి, బిలాస్‌పూరు వారికి కావాలి, రాయ్‌పూర్‌వారికీ కావాలి ఇలా ప్రతి చోటి ప్రతి రకం మనుషులకూ విముక్తి కావాలి. దల్లీ-రాజ్‌హారా కార్మికులకు కావాలి, చందీ డోంగ్‌రీ గనికార్మికులకు కావాలి. ప్రతి ప్రాంత కార్మికులకూ కావాలి - మనందరికీ విముక్తి కావాలి!

ఇక చూడం డప్పుడు! పశుశక్తి వద్ద యిక బలమేముంటుంది? పశుశక్తి వద్ద బలమేమీ వుండదు. అది చచ్చి తీరుతుంది. విజయం జనశక్తినే వరిస్తుంది. జీవితమే మృత్యువుకు గోరీ కట్టివేస్తుంది!

* * * * *

# 10. మన సంస్కృతి

కార్మికోద్యమం ఒక కవిత ఇదొక గీతిక ఈ కవిత, ఈ పాట ఉద్యమగాథ వెల్లడిస్తుంది కార్మికుల కడగళ్ళు వినిపిస్తుంది కొత్త కలలు చూపిస్తుంది, గెలుపు ఊహల్ని అలంకరిస్తుంది పోరాటంనుండి ఆవిర్భవిస్తుంది నూతన సమాజం ప్రజాపోరాటం నుండి అంకురిస్తుంది ప్రజా సంస్కృతి - ఒక నూతన గీతం, ఒక నూతన కవిత్వం, ఒక నూతన గాథ జనిస్తాయి ఏదో ఒక రోజు ఉద్యమం ముగిసిపోతుందిగాని దాని కథ మాత్రం చిరస్థాయిగా నిలిచిపోతుంది ఉద్యమంనుండి పుట్టుకొచ్చిన కవితలు, గీతాలు రాబోయే తరాల్ని పోరాటం దిశగా ప్రేరేపిస్తాయి అన్యాయం, అక్రమాలకు, దోపిడీ, పీడనలకు వ్యతిరేకంగా సాగే ప్రజా వుద్యమ గాధలు, కవితలు, పోరాటాలనుండి ప్రజలు పాఠాలు నేర్చుకుంటారు కామ్రేడ్ ఫాగూరామ్ యాదవ్ పాటలు యిలానే దల్లీ - రాజ్‌హారా కార్మికోద్యమం నుండి వెల్లుబికి వచ్చాయి. కాని , అవి నేడు భిలాయి కార్మికులకూ ప్రేరణ గీతాలయినాయి. ఫాగూరామ్ పేరణతో భిలాయి - ఉర్లా, కుమ్హారీ, టేడ్‌సరాలకు చెందిన అనేక ుంది కార్మిక సహచరులు కూడా పాటలు రాయడం మొదలుపెట్టారు ూతన సంస్కృతీ వికాసం యిలాగే జరుగుతూంటుంది

అయితే మన కళలకు, యితర వర్గాల కళలకు తేడా ఏమిటి? మన వినోద కార్యక్రమాలకు, యితర వర్గాల వినోద కలాపాలకు మధ్య తేడా ఏమిటో కూడా మనం అవగాహన చేసుకోవాలి ఎందుకంటే కార్మికుల్లో సైతం పెట్టుబడిదారీ ఆలోచనలు చొరబడగలవు గనుక

పెట్టుబడిదారీ సంస్కృతికి ప్రజాజీవితంతో సంపర్కమేమీ వుండదు అది (ఊహల) ఆకాశంలోకి ఎగిరిపోయే సంస్కృతి కాగా కార్మికవర్గ సంస్కృతి కార్మిక జీవిత యథార్థాలతో ముడివడివుంటుంది పోలీసుల దమనకాండ, ధరల పెరుగుదల, కార్మికుల జీవన పోరాటం, వర్గ

పోరాటం, నూతన సమాజానికి సంబంధించిన కలలు, కల్పనలు యిందులో భాగాంశాలై వుంటాయి దోపిడీదారులు ప్రజలను చంపగలరేమోగాని వారి కలలు, కల్పనల్ని అంతం చేయజాలరు

మన సంస్కృతి విరాశా నిస్పృహల్ని కలగజేయదు మనల్ని హతాశుల్ని చేయదు ఆశలు, విశ్వాసాలు వ్యాపింపజేయడం మన సంస్కృతి కర్తవ్యం సింప్లెక్స్ కార్మికుల్ని చూడండి వారికి గత 8 నెలలనుండి పనులు లేవు బస్తీలో పస్తులు, ఆకలిచావుల దుస్థితి నెలకొనివుంది అయినా ఈ కార్మికులు హతాశులు కాలేదు ఎందుకంటే వర్గపోరాట నియమం ప్రకారం అంతిమ విజయం తమదేనని, తమ సంకెళ్లు తెగిపడక తప్పవని, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు అవశ్యం లభించి తీరుతాయని వాళ్లకు తెలుసు ఎలాగంటే మన సంస్కృతి, మన కళలు ప్రపంచ చరిత్ర పాఠాలను ప్రజల వద్దకు తీసుకువెళతాయి ఆశా విశ్వాసాల భావవలు వ్యక్తం చేస్తాయి దోపిడీ, దమనకాండలను సహనం చివరికి అంచులదాకా సహించగల్గే ఓపిక, ప్రేరణల్ని మన కవితలు, మన పాటలు మనకు యిస్తాయి

మన గీతాలు కార్మికోద్యమంలోకి చొరబడ్డ దళారీలు, చెంచాగాళ్ల ముసుగుల్ని చీల్చివేస్తాయి మన ఉద్యమంలో ఏవైనా తప్పుడు ప్రవృత్తులు తలయెత్తితే వాటిని సైతం మనం మన పాటలు, కవితల ద్వారా ఎండగట్టాల్సి వుంటుంది

నూతన సమాజంగురించి, స్వేచ్ఛాసమానత్వాలనుగురించి ప్రశంసా గీతాలు రాయండి దోపిడీ దౌర్జన్యాలు లేని సమాజం గురించి ఆలోచనలు రేకెత్తించే, సమానత్వ బీజాలు ప్రజలలో నాటే పాటలు రాయండి

మానవత్వం, అమానుషత్వాల నడుమ సంఘర్షణలో మనది మొదటి పక్షమే మన సంస్కృతి కూడా మానవత్వ పక్షమే వహిస్తుంది.

*[భిలాయి కార్మికోద్యమ్య క్రమంలో తామే రాసి, తామే పాడి వినిపించే అనేకమంది కళాకారులు భిలాయి, పేడ్‌సరా, కుమ్హారీ, ఉర్లాల కార్మికుల్లోంచి పుట్టుకొచ్చారు. ఈ కళాకారుల కళల్ని నిష్ఠవాభిముఖం గావించే ఉద్దేశ్యంతో*

*1991 మే లో కా నియోగి వారికోసం రాజ్‌హేరాలో ఒక రెండు రోజుల శిక్షణ శిబిరం నిర్వహించారు శిబిరం చివరి రోజున కా నియోగి చేసిన ప్రసంగం సంక్షిప్త పాఠమే యిది]*

* * * * *

# 11. మార్క్సిజం మూలసూత్రాలు

[మార్క్సిజం ఒక శాస్త్రీయ ఆలోచనా ధోరణి ఈ ఆలోచనా విధానం, ఈ భావజాలం ఒక శాస్త్రీయ సైద్ధాంతిక ప్రాతిపదికపై గతితార్కిక చారిత్రక భౌతికవాద సూత్రాల ప్రకారం సాంఘిక , ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ స్థితిగతుల్ని విశ్లేషిస్తుంది ఒక నవీన స్వప్నసుందర సాంఘిక వ్యవస్థను భవిష్యత్తులో నెలకొల్పవచ్చని ఊహిస్తుంది అయితే ఈ ఊహలు శరద్రాత్రుల్లో నింగిలో దూది పింజల్లా ఎగిరిపోయే మబ్బుతునకలవలె దిశాహీనంగా గాని లేక వాస్తవికతలతో పొత్తులేని విచిత్ర కల్పనలుగా గాని వుండవు ఏ కల్పనను విశ్వసించి కోట్లాది ప్రజలు ముళ్ల బాటలలో నెత్తురోడే శరీరాలతో సాగిపోతారో, అడ్డంకులు, కష్ట నష్టాలన్నిటినీ అధిగమిస్తూ అంతిమ గమ్యం చేరుకోజూస్తారో అలాంటి మహత్తర కల్పన యిది

శాస్త్రీయ ఆలోచనలపై ఆధారపడిన కల్పన యిది హేమంతంలో చలికి వణుకుతూనే ఆషాఢంలో నైరుతి రుతుపవనాల ఆగమనంకోసం అర్రులు చాచడం వంటిదిది దక్షిణ సముద్రం ఒడిలో జనించి, ఒక జీవ రసాయన పరివర్తన ద్వారా నల్లని మబ్బు దండ్లతో భారత భూమినంతటినీ ఆవరిస్తూ వానలు కురిసి పోవడానికి ఆవేశంగా ఏదో ఒకరోజు రాక తప్పవు గదా ఈ నైరుతి రుతుపవనాలు!

18-19 శతాబ్దాల నాటి సంచలనాత్మక పారిశ్రామిక విప్లవ కాలంలో కొందరు శాస్త్రవేత్తలు కేవలం కాకతాళీయత (chance) లేక ఆకస్మిక దుర్ఘటనల ఆధారంగానే నూతన ఆవిష్కారాలు జరుగుతాయని అంతదాకా వ్యాప్తిలో వున్న సిద్ధాంతాన్ని తునాతునకలు చేశారు, శాస్త్రీయ పద్ధతి ప్రాతిపదికన ఒక నూతన ఆలోచనా ధోరణి కోసం అన్వేషించారు అలాంటి వారిలో కారల్ మార్క్స్ ప్రముఖుడు [ఆయన కుశాగ్రబుద్ధి, సునిశిత విశ్లేషణా ధోరణుల మూలంగా]

పరివర్తనాశీల ప్రపంచపు ఎల్లలు లేని కాలరేఖపై అతిదూరందాకా దిశానిర్దేశంగావించే శక్తిగా ఆయన ప్రబోధించిన యిజం - మార్క్సిజం - స్థిరపడి పోయింది.

*పెట్టుబడిదారీ విధానాన్ని దాని జన్మముహూర్తంనుండి విశ్లేషించడమే కాక, అంతకు ముందుండిన భూస్వామ్యవిధానం, దానికి పూర్వముండిన మానవుని ప్రాచీన నాగరికతపై మార్క్సిజం దుర్భిణీ నేత్రాలు దృష్టి సారించాయి. ఆపై పెట్టుబడిదారీ వికాస ధోరణిని గమనిస్తూ భవిష్యత్తులో అభివృద్ధి పథం ఏ పోకడ పోతోందోకూడా అంచనా వేశాయి. అంటే సప్తర్షి నక్షత్రాలను అనుసరించి ధ్రువ నక్షత్రాన్ని గుర్తించడంవంటిదన్నమాట. ఈ అంచనాయే సాంఘిక కార్యకర్తల హృదయాల్లో భావి సమాజం గురించిన స్వాప్నిక ఆదర్శమై వారి మానవతా చైతన్యం, జీవజవాల్ని పదే పదే ప్రేరేపిస్తూ వుండగలదు. మార్క్సిజం ఆధారంగా ఒక నూతన దోపిడీ రహిత, సుఖశాంతిభరిత సాంఘిక వ్యవస్థకు ఈ జీవశక్తులు జన్మనివ్వాలని వారు సదా కోరుకుంటూ వుండగలరు - శంకర్ గుహా నియోగి, 1991 ఏప్రిల్.]*

సాంఘిక మార్పు కావాలి, విప్లవం కావాలని నినదించే పార్టీలకు ఈ దేశంలో కొరత లేదు. దాదాపు అన్ని రాజకీయ పార్టీలు తమ అంతిమ లక్ష్యం ఒక దోపిడీరహిత సాంఘిక వ్యవస్థేనని చెప్పుకుంటాయి. వీటిలోనూ అనేక పార్టీలు ఈ లక్ష్య సాధనకై తాము మార్క్సిజం - లెనినిజం మార్గంలో పయనిస్తున్నట్లు కూడా చెప్పుకుంటాయి. మరి అంతిమ లక్ష్యం, ఆలోచనా ధోరణి, అనుసరించే మార్గం అన్నీ ఒకటే అయినప్పుడు మరిన్ని వేరు వేరు పార్టీలు వుంటం ఎందుకని సాధారణ ప్రజలకు బోధపడడం లేదు. బోధపర్చుకునే విధం కూడ వాళ్లకు తెలియకపోవడంవల్ల వాళ్లు విసిగి వేసారి దారి తప్పిపోతారు. చివరకు ఏమీ చేయలేని నిస్సహాయతతో గప్‌చుప్పుమని వుండిపోతారు.

అయితే మౌనంగా వుండడంవల్ల నైతే పరిష్కారం లభించదుగదా. నానాటికీ పస్తులు, ఆకలి చావులు పెరిగిపోతున్నాయి; నిరుద్యోగ సైన్యం పెరిగి పోతున్నది; ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. మరేం చేయాలి అంటే సరైన మార్గమేమిటో అన్వేషించాలి. ఏ మార్గంలో

ముక్తి లభిస్తుందో యోచించాల్సి వస్తుంది మరి సరైన మార్గం అన్వేషించడానికి ఉపాయమేమిటి?

ఒక కొబ్బరికాయ వున్నదనుకోండి మీరు దానిని చేతిలో పట్టుకుని ఇది 300 గ్రాముల బరువున్నదంటారు మీ భార్య దాన్ని పట్టుకుని చూచి 'కాదు, 250 గ్రాములే' నంటుంది మీ సోదరుడు 275 గ్రాములనొచ్చు; మీ స్నేహితుడు 325 గ్రాములున్నదంటాడు మరి ఎవరు సరిగా చెబుతున్నట్లు? నిజమేదో ఎలా తెలుస్తుంది? అప్పుడు మీరు తాసుతో తూచి చూస్తారు కొబ్బరికాయ బరువు 200 గ్రాములేనని తేలుతుంది

అంటే తూకం వేసేందుకు శాస్త్రీయ పద్ధతి త్రాసును ఉపయోగించడమే

అలాగే రాజనీతి, సమాజ విజ్ఞాన రంగాలకు చెందిన వివిధ విషయాలకు సంబంధించికూడ యిదే వర్తిస్తుంది ఏది సరి, ఏది కాదు; ఏది నిజం, ఏ దబద్ధం తేడా తెలుసుకునేందుకు వీటిల్లో కూడ ఒక త్రాసు - అంటే ఒక శాస్త్రీయ పద్ధతి వుంటుంది అదే మార్క్సిజం - లెనినిజమనే త్రాసు

ఈ ప్రపంచంలో రకరకాల ఘటనలు సంభవిస్తున్నాయి, సంభవిస్తాంటాయి కూడ మన మీ ఘటనల్ని విశ్లేషించలేక పోతాము గనుకనే నిరాశావిస్పృహలకు లోనవుతూంటాము కాని మనవద్ద మార్క్సిజం - లెనినిజం త్రాసు వుంటే అప్పుడు మనం నిరాశ చెందక మన సమస్యలకు పరిష్కారం కనుగొనగల్గుతాము

మనదేశంలో యింతమంది పెద్ద పెద్ద నాయకులున్నారే, వాళ్లకేమి మార్క్సిజం - లెనినిజం గురించి తెలియదా అని మీరు అడగవచ్చు ఆ సంగతి వాళ్లకు తెలుసో లేదో అనే విషయం కూడ మార్క్సిజం - లెనినిజం త్రాసు ద్వారా తెలిసిపోతుంది

మార్క్సిజం - లెనినిజంను అవగాహన చేసుకోవాలంటే మనం గతితార్కిక చారిత్రక భౌతిక వాదాన్ని అర్థం చేసుకోవాలి మార్క్సిజం శాస్త్రీయ భౌతికవాద తత్వధోరణి

(భౌతిక) వస్తువు అంటే ఏమిటి? దేనిని మనం చూడగలమో, లేక తాకగలమో లేక అనుభవించగలమో అదే వస్తువు. అంటే దేనికైతే అస్తిత్వం వున్నదో అదే వస్తువు.

వస్తువు (పదార్థం) నుండే ఆలోచన (భావం) జనిస్తుందనేది మార్క్సిస్టు భౌతికవాదుల సిద్ధాంతం భావవాదుల ఆలోచన యిందుకు విరుద్ధంగా వుంటుంది. ఆలోచన (భావం) నుండే వస్తువు (పదార్థం) జనిస్తుందని వారంటారు

ఒక విమానం తయారీ విషయమే తీసుకోండి భావవాదులు (పెట్టుబడిదారీ - భూస్వామ్య ఆలోచనా ధోరణులకు చెందినవాళ్లు) అంటారు గదా - మనిషి మొదట విమానం తయారు చేయాలని అనుకున్నాడు; ఆ తర్వాతే, ఆ ఆలోచనవల్లే విమానం తయారయింది అని కాని మార్క్సిస్టులు యిక్కడ ప్రశ్నించేదేమంటే - "విమానం ఎందుకు చేశారు? ఎగరడానికి గదా! మరి ఎగరాలనే ఆలోచన ఎక్కడినుండి వచ్చిందని?" అని వింగిలో మబ్బులు ఎగురుతున్నాయి; గాలికి చెట్ల ఆకులు ఎగిరిపోతున్నాయి; పక్షులు ఆకాశంలో ఎగురుతున్నాయి - ఇదంతా మనిషి రోజూ చూస్తూనే వున్నాడు. ఇదంతా చూచినప్పుడే తానుసైతం ఎగిరితే బాగుండుననే కోర్కె అతనికి కలిగింది. ఆపై వేల ప్రయత్నాల పిదప చివరకి విమానం సృష్టయింది

కాని యింత చెప్పినంకయినా యీ భావవాదులు మనం భౌతిక వాదుల మాట వింటారంటారా? లేదు సోదరా, వాళ్లు అంత తొందరగా తలవంచే ఘటాలేమీ కారు

మరో ఉదాహరణ తీసుకోండి ఎవరైనా మిమ్మల్ని, "అయ్యా, కాకి ఎలా వుంటుంది?" అని అడిగితే, "అరె, ఇదీ ఒక ప్రశ్నేనా?" అని నవ్వేస్తారు కాని ఎవరైనా మిమ్మల్ని, "అమెరికా దేశపు నైటింగేల్ పక్షి ఎలా వుంటుంది?" అని అడిగితే మీరు బిత్తరపోతారు ఎందుకంటే, మీరెప్పుడూ నైటింగేల్ పక్షిని చూచివుండలేదు గనుక ఇలాంటి వేలాది ఉదాహరణలద్వారా ఆలోచనకు ఆధారం వస్తువేనని నిష్కర్షగా నిరూపించవచ్చు

మీరేదైనా మంచి పని చేసివచ్చారనుకోండి అప్పుడు మీ గుండెల్లో ఆనందం, మనస్సులో ఉత్సాహం నిండివుంటాయి. సరిగ్గా అప్పుడే ఒక పిల్లవాడు ఆకస్మికంగా, మీ కళ్లముందే, రైలుబండి కిందపడి చనిపోతాడనుకోండి మరి యీ దుర్ఘటన చూచిన పిదప కూడ మీ మనసు యింకా సంతోషంగా వుంటుందా? ఉండలేదు ఎందుకు? ఆ పిల్లవాడలా రైలు కిందపడి చనిపోవడానికి ముందు మీలో వున్న ఆనందోత్సాహాలు ఆ తర్వాత దుఃఖ విషాదాలయినాయి ఎందుచేత? (ఎందుకంటే) వస్తువే [భౌతిక పరిణామమే] మీ మనస్సులోని ఆలోచనల్లో మార్పు తెచ్చింది కాని భావవాదులు ఈ శాస్త్రీయ సత్యాన్ని ఒప్పుకొనరు

కారల్ మార్క్సుకు పూర్వంకూడ ఎందరో భౌతికవాదులు వుండి వారు కాని, 'వస్తువే (పదార్థమే) ఆలోచనకు ఆధారం' అన్న సిద్ధాంతాన్ని కనిపెట్టి, స్థిరంగా పాదుకొల్పిన ప్రథమ వ్యక్తి కారల్ మార్క్స్ ఆయన రూపొందించిన ఈ సిద్ధాంతాన్నే 'శాస్త్రీయ భౌతికవాదం' అంటారు

మార్క్స్ యింకాకూడ యిలా చెప్పాడు· గతితర్క సూత్రంతోనే (అంటే విరుద్ధశక్తుల ఐక్యత - ఘర్షణ కారణంగానే) వస్తువు పరివర్తన చెందుతుంది; శక్తి పుంజుకుంటుంది; ఐక్యత సాధిస్తుంది అని ఆయన ఇంకా, 'ప్రతి వస్తువులోనూ విరుద్ధ శక్తులు వుంటాయి' అని కూడ చెప్పారు

విరుద్ధ శక్తుల ఉనికి వల్ల వస్తువు లోపల వైరుధ్యం (ఘర్షణ - పోరాటం) వుంటుంది వస్తువు బయటకూడా వైరుధ్యంవుంటుంది ఈ లోపలి, వెలుపలి శక్తుల పోరాటం వల్లే వస్తువు పరివర్తన చెందుతుంది వస్తువు అభివృద్ధికి మూల కారణం వస్తువులోని అంతర్గత వైరుధ్యం అయితే బాహ్యవైరుధ్యం వల్ల కూడ వస్తువుపై వివిధ రకాల ప్రభావా కలుగుతాయి అందువల్ల వస్తువు అభివృద్ధికి సంబంధించి కేవలం ద అంతర్గత ప్రధాన వైరుధ్యంపైనే శ్రద్ధ వహించి దాని వెలుపలి బా వైరుధ్యాల్ని విస్మరించడంకూడ పెద్ద పొరపాటే అవుతుంది

ఉదాహరణకు, ఒక కోడి గుడ్డునే తీసుకుందాం గుడ్డులోని అం

వైరుధ్యం మూలంగా దాన్నుండి పిల్ల పుట్టుకువచ్చే అవకాశంవుంటుంది గాని గుడ్డునుండి పిల్ల వెలికి రావాలంటే తగు వేడిమి వుండవల్సిన అవసరంకూడా వుంది. ఒక తెల్లని రాతిముక్క తీసుకొచ్చి దాన్ని ఎంత వేడిచేస్తే మాత్రం దాన్నుండి పిల్ల వెలికి వస్తుందా? అలాగే కేవలం (కోడి) గుడ్డు వున్నంత మాత్రాన పిల్ల వెలికివస్తుందా? రాదు, ఆ గుడ్డుకు తగినంత కాలం తగినంత వేడిమి లభించేవరకు పిల్ల పుట్టుకురాదు.

అస్తిత్వం వుండేదే వస్తువు. అంటే తడిమట్టికూడా ఒక వస్తువే. తడిమట్టిని మీరు కలపవచ్చు. మలపవచ్చు. చేత్తో తేలిగ్గా చితక చేయవచ్చు. అదే తడిమట్టిని మీరు తడి ఇటుకగా చేసి రోజంతా ఎండలో ఎండబెట్టండి. సాయంత్రం గనుక మీరు దాన్ని విరగ్గొట్టజూస్తే ఈ సారి అది అంత తేలిగ్గా సాధ్యం కాదు. పొద్దుటికంటే ఎంతో హెచ్చు శక్తి ప్రయోగిస్తేనే దాన్ని మీరు విరగగొట్టగల్గుతారు. ఎందుకంటే, పగలంతా ఎండ, మట్టి ఈ రెంటిమధ్య పోరాటం (అనే వైరుధ్య సూత్రం) ద్వారా తడిమట్టి ఎండుమట్టిగా మారి మరింత బలం పుంజుకుంది గనుక. అదే ఎండు మట్టి (ఇటుక) ని మీరు రాత్రంతా బట్టీలో కాలిస్తే అప్పుడు ఎండుమట్టి, నిప్పు వేడిమిల వైరుధ్యంతో ఆ ఎండుమట్టి మరింత బలపడి గట్టి యిటుకగా రూపొందుతుంది. ఆ ఇటుకను విరగగొట్టే ప్రయత్నం చేసి చూడండి. బహుశా వట్టి చేతుల్తో దాన్ని పగుల గొట్ట లేక పోతారేమో. ఇలా తడిమట్టినుండి ఎండుమట్టి, ఎండుమట్టినుండి ఇటుకగా మారే గుణం మట్టిలో వుందిగాని ఎండతో, నిప్పులతో (బాహ్య) వైరుధ్యం ఈ గుణాన్ని అభివృద్ధి చేసిందని గ్రహించాలి.

అలాగే పుట్టినప్పుడు మనమెవరమూ 3-4 కిలోలకుమించి బరువు లేకుంటిమి. కాని నేడు మనం 40-60 కిలోల బరువున్నాము. ఇదెలా సాధ్యమయింది? పుట్టుకతోనే మనం ఊపిరి పీల్చనారంభిస్తాము. కాళ్లు, చేతులు ఆడిస్తుంటాము. దానితో అలసట, ఆకలి కలుగుతాయి. దానితో మనం తిండి తింటాము, అప్పుడప్పుడూ నిద్రపోతాము. ఈ క్రమం అంతటిలోనూ మన లోపలి, వెలుపలి వైరుధ్యాలు నడుస్తూనే వుంటాయి. మనం పరివర్తన చెందుతూనే వుంటాము - బాల్యం నుండి

యువ్వనంలోకి, యవ్వనంనుండి వృద్ధాప్యంలోకి అడుగు పెడుతూంటాము. మన మెంతదాకా ఈ వైరుధ్యం లేక పోరాటం సాగించగల్గుతామో అంతదాకా మనం బతికి వుంటాము. అయితే ఎప్పుడైతే మన మీ పోరాటం సాగించలేమో అప్పుడు మనం చచ్చిపోతాము. అంటే సజీవ వ్యక్తి చచ్చిన మనిషిగా రూపాంతరం చెందుతాడన్న మాట.

ఇంకా కొన్ని సులభసామాన్యమైన ఉదహరణలు గమనిద్దాం. మీ చేతి చర్మం, మీ కాలిచర్మాలు రెంటిలో తేడా ఏమైనా వున్నదా, లేదా? కాలిచర్మం చేతి చర్మం కంటే మందంగా వుండడం మీరు గమనించగలరు. అదెందుకంటే దానికి (కాలి చర్మానికి) నితాంతం నేలతో, చెప్పులతో పోరాటం చేయవల్సివస్తుంది గనుక. అలాగే కలం పట్టి గీసే క్లర్కు బాబు చేతికీ, కమ్మరి సుత్తె పట్టి పనిచేసే కార్మికుని చేతికీ తేడా లేదంటారా? తేడా వుండితీరుతుంది. ఇదే విధంగా మన తల వెంట్రుకలకు, గడ్డం వెంట్రుకలకు మధ్యకూడ తేడా వుంటుంది. రోజూ బ్లేడుతో లేక మంగలి కత్తితో పోరాటం మూలంగా గడ్డం వెంట్రుకలు మరింత బలంగా అంటే మరింత మందంగా రూపొందుతాయి. ఈ ఉదాహరణలన్నింటిలోనూ అభివృద్ధికి వలసిన అసలుగుణం (మూలగుణం) మాంసంలో, చర్మంలో, వెంట్రుకలలో వున్నమాట నిజమేగాని, బాహ్యావైరుధ్యాలు అంతర్గత వైరుధ్యాలపై ప్రభావం చూపించి వాటి అబివృద్ధికి దోహదపడ్డాయి.

కనుక మన మీ నిష్కర్షకు రాగల్గుతాము: అభివృద్ధి క్రమాన్ని అర్థం చేసుకోవాలంటే మనం రెండు ప్రకారాల (అంతర్గత, బాహ్య) వైరుధ్యాలకూ అవసరానుగుణంగా ప్రాముఖ్యం యివ్వాల్సి వుంటుంది. రెండు పోరాటాల్నీ (వైరుధ్యాల్నీ) ఒకటిచేసి గందరగోళపరచడంవల్ల లాభముండదు. ఇదే మార్క్సిస్టు శాస్త్రీయ భౌతిక వాద సిద్ధాంతం.

ఈ (భౌతికవాద) పాఠాన్ని కొందరు ఒప్పుకుంటారు; మరి కొందరు ఒప్పుకోరు. కాని మార్క్సిజాన్ని ఒప్పుకోని వ్యక్తి అయితే మాత్రం అతని కాలిచర్మానికీ, చేతి చర్మానికీ తేడా వుండదా? తలవెంట్రుకలకు గడ్డం వెంట్రుకలకు తేడా వుండదా? తప్పక వుంటుంది. ఒకరు ఒప్పు కొంటారా లేదా అనే దానితో విజ్ఞానశాస్త్రానికి ప్రమేయం వుండదు.

ఎవరు ఒప్పుకున్నా లేకున్నా సత్యం సత్యమే. దానిలో తేడా ఏమీ వుండదు.

మన దేశానికిచెందిన ఎందరో రాజకీయ నాయకులు మార్క్స్ బోధనల్ని ఒప్పుకొనరు. మార్క్సిజం ఒక విదేశీ ఆలోచనా ధోరణి అని, అది మనదేశంలో అమలు కాజాలదని వాళ్లంటారు. కాని శాస్త్రవిజ్ఞానానికి ఒక దేశమంటూ వుండదు. శాస్త్రీయ సత్యాలు సకల దేశాలలో ఒకే తీరుగా చెల్లుతాయి.

సరే పదండి, మనం భౌతికవాద దృక్పథంతో రాజకీయ సమస్యలను గురించి చర్చిద్దాం. మన మే సాంఘిక వ్యవస్థలో బతుకుతున్నామో అదీ ఒక వస్తువే; ఎందుకంటే దానికి అస్తిత్వం వుంది గదా. ఈ సమాజంలో వ్యవస్థ, అవ్యవస్థ రెండూ వున్నాయి. అందుకే మనం రోజూ పోరాటం చేస్తున్నాము. వర్తమాన సమాజ వ్యవస్థ దోపిడీ పునాదిపై నెలకొనివున్నది. అందుకే దీన్ని దోపిడీదారీ సాంఘిక వ్యవస్థ అంటారు. ఈ సమాజ వ్యవస్థలోని ముడి సరుకులు ఏవి? ఇక్కడ ముఖ్యంగా రెండు వర్గాలున్నాయి. ఒకటి దోపిడీ వర్గం. దీని సంఖ్యాబలం చాల తక్కువ. రెండవది పీడిత వర్గం. దీని సంఖ్యాబలం చాల ఎక్కువ. మరి ప్రస్తుత వ్యవస్థ ఉద్దేశ్యం ఏమిటి? లాభం గడించడమే. ఒక వర్గం మరొక వర్గాన్ని దోపిడీ చేసి లాభం గడిస్తుంది. పీడిత వర్గం తన చెమట నెత్తురు లోడ్చి ఉత్పత్తి చేస్తుంది గాని ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం, అదుపు దానికి వుండవు. పోతే దోపిడీ వర్గం చేతుల్లోనే ఉత్పత్తి సాధనాల యాజమాన్యం, అదుపులు వున్నాయి. వీళ్లు స్వయంగా శ్రమ చేయరుగాని శ్రామిక ప్రజలు సృష్టించే సరుకులనుండి లాభాలు గడించే హక్కు వీరికి వుంటుంది. శ్రామికులకు కూలి (వేతనం) యిచ్చే యజమానులు వీరే.

పీడితవర్గం కఠినశ్రమ చేయకపోతే వరి, గోధుమలు, బొగ్గు, ఇనుము, ఉక్కు మొదలైన వస్తువులేవీ సృష్టికావు; వాటికి విలువ (ధర) అనేది ఏర్పడదు. కనుక యజమానులకు కూడ లాభం గడించే, కూలి యిచ్చుకునే వీలు, అధికారం వుండవు. దోపిడీ వర్గాలు

అనునిత్యం కార్మిక, కర్షక తదితర శ్రామికవర్గాలను జలగల్లా పట్టి నెత్తురు పీలుస్తున్నాయి దోపిడీ వర్గం, పీడిత వర్గాల నడుమ జరిగే అంతర్గత పోరాటమే (వైరుధ్యమే) ఈ సమాజాన్ని నడుపుతున్నది

వర్తమాన సమాజంలో పీడిత, పీడక వర్గాలమధ్య సంబంధమేమిటి? మీరు, మీ కార్ఖానా యజమానులు ఉభయులూ ప్యాంట్లు వేసుకుంటారు నడుముకు బెల్టులు చుట్టుకుంటారు మరి మీ ఉభయుల బెల్టుల్లో తేడా ఏమన్నా వుంటుందా? ఎందుకుండదూ? మీ యజమాని బెల్టు చుట్టుకొలత ప్రతి సంవత్సరం పెరిగిపోతూంటుంది ఎందుకంటే మీ యజమాని ప్రతి ఏడూ అంతకంతకూ బలిసిపోతూంటాడు కాగా మీ బెల్టు కొలత మాత్రం తగ్గిపోతూంటుంది ఎందుకంటే ప్రతిసంవత్సరం పస్తులు, పోషకాహార లోపాల వల్ల మీ పొట్ట కరిగిపోతూంటుంది గనుక అంటే మీరుభయులూ పరస్పర విరుద్ధ పరిస్థితుల్లో జీవిస్తున్నారు

దోపిడీ ఆధారంగా నెలకొన్న సమాజంలో రెండు పరస్పర విరుద్ధ (శత్రు) వర్గాలుంటాయి వాటిమధ్య శత్రుత్వం మూలంగా వాటి నడుమ పోరాటం చెలరేగడం అనివార్యమవుతుందని కారల్ మార్క్స్ మనకు బోధిస్తాడు ఈ వర్గ పోరాటం ఒక సందర్భంలో విప్లవంగా పరిణమిస్తుంది - అప్పుడు అధికారంలో వున్న వర్గాన్ని కూలదోసి మరో వర్గం రాజ్యాధికారాన్ని కైవసం చేసుకుంటుంది ప్రస్తుత కాలంలో అంటే పెట్టుబడిదారీ సమాజంలో కార్మికవర్గం వర్గపోరాట బాటలో పయనిస్తూ ఎప్పుడో ఒకప్పటికి దోపిడీ వర్గాన్నుండి రాజ్యాధికారం హస్తగతం చేసుకుంటుంది; సమాజాన్ని మార్చివేస్తుంది తదుపరి ఒక దోపిడీరహిత సమాజాన్ని అంటే అమిత సుఖశాంతులు లభించే ఒక నవసమాజాన్ని నిర్మిస్తుంది. కార్మికవర్గం రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకోవడమంటే అర్థం కార్మిక వర్గ ఆధిపత్యాన్ని (hegemony) నెలకొల్పడం కార్మికవర్గం దృఢనిశ్చయంతో తన ఆధిపత్యాన్ని నెరపినప్పుడే వర్గరహిత సమాజం ఏర్పడగల్గుతుంది మార్క్స్ చేసిన ఈ బోధనల్ని అంగీకరించేవాళ్లనే మార్క్సిస్టులని అంటారు

వర్తమాన సమాజం వర్గాలుగా చీలివుంది ప్రధానంగా రెండ వర్గాలు - దోపిడీ వర్గం, పీడిత వర్గం - వున్నాయి. ఈ రెండు వర్గా

పరస్పర విరుద్ధ ప్రయోజనాలు గలవి ఈ రెండు వర్గాల నడుమ వైరుధ్యం అంటే పోరాటం అనివార్యం వర్గపోరాటంలో బలప్రయోగమూ జరుగుతుంది. కాని ఈ బలప్రయోగానికి బాధ్యులెవరు?

దోపిడీ వర్గం తన దోపిడీ, పీడనల ఏర్పాట్లు భద్రంగా అట్టిపెట్టి వుంచడానికి గాను రాజ్యాంగయంత్రం [చట్టాలు, కోర్టులు, పోలీసు, సైన్యం వగైరాల] సాయం తీసుకొంటుంది ఆ బలంతోనే శ్రామిక వర్గంపై అణచివేత, దమనకాండలు అమలుచేస్తుంది దోపిడీవర్గం హింసాయుత అణచివేత, అత్యాచారాలకు తలపడినప్పుడు పీడిత ప్రజలు తమ్ముతాము రక్షించుకోవాలంటే వారికీ బలప్రయోగం వినా గత్యంతరం వుండదు

1967 జూన్ 20వ తేదీనాడు భిలాయి ఉక్కు కార్ఖానాకు చెందిన ఒక కార్మికుడిని అక్కడి భద్రతా జవాను అకారణంగా, అతి నిర్దాక్షిణ్యంగా చావచితగ్గొట్టాడు దానితో ఆగ్రహించిన సుమారు 40 వేల మంది కార్మికులు సంఘటితంగా కదలి జనరల్ మేనేజరువద్దకు వెళ్లి న్యాయం కావాలని డిమాండు చేశారు అప్పుడు కార్మికులపై తీవ్రమైన లాఠీచార్జి జరిగింది దానితో రెచ్చిపోయిన కార్మికులు హింసావిధ్వంసాలకు తలపడి, ఒకటి రెండు బస్సులు తగుల బెట్టారు మరి దీనికంతటికీ బాధ్యులెవరు?

రాయ్‌పూరు విద్యార్థులు ఒకసారి తమ 17 సూత్రాల డిమాండ్ పత్రంతో శాంతియుతంగా ఊరేగింపు జరుపుతూండినారు అయితే ఆ ఉద్యమాన్ని అణచివేయడానికి పోలీసులు ఘోర అత్యాచారాలు జరిపారు విద్యార్థులను పట్టుకుని ఇష్టమొచ్చినట్లు బాదడమే గాక, పట్టణంలోని షాపులు, ఇళ్లలోకి కూడ జొరబడి, దోపిడీలు, ఆడకూతుళ్లపై బలాత్కారాలదాకా కూడ జరిపారు మరి పౌరులు ఇదంతా చూస్తూ ఊరుకోగలరా?

అన్యాయానికి వ్యతిరేకంగా ప్రజలు (ప్రతి) హింసకు తలపడడం, దమనకాండకు రెచ్చిపోయి విధ్వంసకాండలకు పూనుకోవడం అసహజమేమీ కాదు ఒక వర్గం మరొక వర్గాన్ని అణిచివేస్తున్నంతవరకు యిదంతా వర్గ పోరాటపు వాడుక నియమాలలో ఒకటిగానే వుంటుంది కారణమునేది

లేకుండా ఏ ఘటన సంభవించదని, ప్రజల హింసాయుత కార్యకలాపాలకు దోపిడీ, పీడనలే ముఖ్యకారణమని మనం గుర్తుంచుకోవాలి కనుక ఎవరైతే దోపిడీ విధానాన్ని, ఆ ఏర్పాట్లను నెలకొల్పి, అట్టిపెట్టివుంచుతున్నారో వారే ఈ పరిణామాలన్నింటికీ బాధ్యులవుతారు

ఇకపోతే మార్క్సిజం ఒక విదేశీ ఆలోచనా ధోరణి, ఇది భారతదేశానికి వర్తించదు అని మార్క్సిస్టు వ్యతిరేకులు వాదిస్తుంటారు. అలాగైతే, చెట్లు, మొక్కలకుకూడ ప్రాణం వుంటుందని జగదీశ్ చంద్ర బోసు అనే మన దేశ శాస్త్రజ్ఞుడు ప్రపంచంలోనే మొట్టమొదటగా నిరూపించాడు జగదీశ్ చంద్ర బోస్ భారతీయుడు గనుక ఈ సత్యం రష్యా, జర్మనీ, చైనా మొదలైన దేశాలకు వర్తించదంటారా? పోతే కాగితాన్ని మొదట కనిపెట్టింది చైనావారు అందుకని మనం రాయడానికి కాగితం ఉపయోగించడం మానేస్తామా? అలాగే మార్క్సిజం - లెనినిజం మావో ఆలోచనావిధానంకూడా ఒక సమాజవిజ్ఞాన సత్యం గనుక మార్క్సిస్టులు దాన్ని ఆమోదిస్తారు

ఉదాహరణకు భారత దేశపు అగ్రపెట్టుబడిదారు బిర్లాను, ఆయన పరిశ్రమల్లో పనిచేసే వేలాది కార్మికులని తీసుకోండి వీరుభయులూ రెండు వేర్వేరు వర్గాలకు చెంది వాళ్లు బిర్లా దోపిడీ వర్గానికి చెందివుంటే, కార్మికులు పీడిత వర్గానికి చెందినవాళ్లు పెట్టుబడిదారీ సమాజంలో తప్పనిసరిగా రెండు విరుద్ధ వర్గాలు వుంటుంటాయి ఈ రెండు వర్గాల నడుమ గతితర్క సూత్రాల ప్రకారం అంటే వైరుధ్య సూత్రం ప్రకారం వర్గపోరాటం అనివార్యం ఈ వర్గపోరాట క్రమంలో ఒకానొక రోజు కార్మిక వర్గం పెట్టుబడిదారీ వర్గాన్ని పడదోసి రాజ్యాధికారం స్వాధీనం చేసుకుంటుందని, తద్వారా కార్మిక రాజ్యం నిర్మాణం, సోషలిజం వికాసాలు సంభవిస్తాయని కారల్ మార్క్స్ సిద్ధాంతాలు విశ్వసించేవారికి (మార్క్సిస్టులకు) తెలుసు మన దేశంలో కొందరు నాయకులు 'అహింసా పరమోధర్మః' అంటుంటారు కాని సమాజంలో రెండు పరస్పర విరుద్ధ ప్రయోజనాలుగల వర్గాలున్న వైనమే నిరంతరం హింసను సృష్టిస్తూనేవుంటుందని వారు గ్రహించరు అహింసావాదులు కమ్మని ప్రజలకు సలహాలివ్వడం శాస్త్రీయ విజ్ఞానం?

ఆధారపడిన చర్యేమీ కాదు పెట్టుబడిదారుల అక్రమ, అన్యాయ హింస వున్నంతవరకు ప్రజలు ఈ సలహాలను చెవిన బెట్టరు

ప్రజలు వివిధ వర్గాలుగా చీలివున్నారని, ప్రతి వర్గాన్ని దాని రాజకీయ పార్టీలు నడిపిస్తుంటాయని లెనిన్ మనకు బోధిస్తారు ఏ పార్టీ అయినా, ఏ పార్టీ నాయకుడయినా తమవర్గానికి దూరంగానైతే వుండరు ఫలానా నాయకుడు మంచివాడు, ఫలానా నాయకుడు చెడ్డవాడు అనే ధోరణిలో మార్క్సిస్టులు ఆలోచించరు వాళ్లు ఒక వర్గదృష్టితోనే నాయకులను గురించి ఆలోచిస్తారు మనం కార్మిక, కర్షక వర్గాల నాయకుల్ని ఆమోదించి, పెట్టుబడిదారీ లేక శ్రామికేతరవర్గాల నాయకుల్ని తిరస్కరించాలి మన దేశజనాభాలో దోపిడీ వర్గం 5 శాతం మాత్రమే వుండగా పీడితవర్గం దాదాపు 95 శాతందాకా వున్నది ఈ 5 శాతం ప్రస్తుత సమాజవ్యవస్థను యథాతథంగా అట్టిపెట్టివుంచాలని కోరుతుంటే 95 శాతంమంది ఈ వ్యవస్థను కుదముట్టించ గోరుతున్నారు 5 శాతంమందితో 95 శాతంమంది గోరాటం - అయినా 5 శాతంమంది అంటే పెట్టుబడిదారీ వర్గపు రాజ్యమే నడుస్తున్నది! ఎలా?

మీ బస్తీలో ఒక బక్కపల్చని నవ యువకు డున్నాడనుకోండి అతడికి, దారా సింగ్‌కు నడుమ కుస్తీ పోటీ పెడ్తామనుకోండి దారా సింగ్ అతడ్ని చూచి ఏమనుకుంటాడు? "ఓస్! ఈ పిలగాడు నాతో కొట్లాడుతాడా? వీడ్ని ఒక్కచేత్తో ఎత్తి అంతదూరం విసిరికొట్టేస్తా" నని అనుకుంటాడు. కాని అదే బక్కపలచని పిలగాడు దారాసింగ్‌పైకి దుముకబోతూ ఝట్‌మని ఒక పిస్తోలు తీసి గురిపెడితే? అప్పుడే మవుతుంది? దారాసింగ్ ఎంత బలాఢ్యుడైనా కావచ్చుగాని ఆయన గుండె గుభేలుమంటుంది ఎందుకు? ఎందుకంటే యిప్పుడు జగడం దారా సింగ్‌కు, మారణాయుధం చేతబట్టుకున్న పిలగానికి మధ్య గనుక నేటి పరిస్థితికూడా దాదాపు యిదేవిధంగా వుంది. పెట్టుబడిదారీ వర్గం తుపాకీబలంతో కార్మికవర్గాన్ని అణచివుంచుతోంది పెట్టుబడిదారీ వర్గం చేతి ఆయుధమేమిటి? రాజ్యాంగయంత్రం అంటే పరిపాలనా వ్యవస్థ, పోలీసులు, సైన్యం, కోర్టులు, జైళ్లు వగైరాలే ఈ విధంగా

5 శాతంమంది పాలనే 95 శాతంమంది ప్రజల్ని కొల్లగొడుతున్నది దోపిడీ ప్రాతిపదికన నెలకొన్న సమాజంలో ప్రభుత్వపాలన అంటే రాజ్యాంగ యంత్రం దోపిడీ ఆధారిత సమాజ చట్రాన్నే రక్షిస్తూంటుంది అదెన్నడూ పీడితవర్గం ప్రయోజనాలకు అనుగుణంగా వుండజాలదు దోపిడీ వున్నంతవరకు రాజ్యాంగ యంత్రం దోపిడీ వర్గాల చేతుల్లోనే వుంటుంది

నేటి ప్రపంచంలో చాలా దేశాల్లో దోపిడీ రహిత సమాజం నెలకొన్నది అక్కడి పీడితవర్గాలు, అంటే కార్మికులు, కర్షకులు, మధ్య తరగతి, దిగువ మధ్య తరగతి ప్రజల, విద్యార్థి యువజనుల సంఘటనలు, అక్కడి దోపిడీదారీ సమాజవ్యవస్థల్ని ధ్వంసంచేసి అక్కడ పోషలిస్టు సాంఘిక వ్యవస్థల్ని నెలకొల్పాయి

మనదేశంలో కమ్యూనిస్టులమని చెప్పుకునే కొన్ని బృందాలు (సి పి ఐ, సి పి ఎమ్. మొదలైనవి) నేటి నూతన పరిస్థితుల్లో వర్గపోరాటం అవసరం లేదని అంటున్నాయి నేటి పరిస్థితుల్లో పీడిత వర్గాలుఅంటే కార్మిక, కర్షక వర్గాలు మునుపటి కంటే ఎంతో బలవత్తరంగా రూపొందివున్నాయని, కనుక నేడు పోరాటం ద్వారా గాక శాంతి మార్గం [శాంతియుత పోరాటం] ద్వారా పీడితవర్గాలు దోపిడీ వర్గాల్ని కూలదోపివేయగలవని వాళ్లు చెబుతారు ఈ జనాలంతా వర్గపోరాట సిద్ధాంతాన్ని మార్చి [వదిలివేసి] వర్గ సహజీవన [సామరస్య] సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్నారు

పరిస్థితులైతే రోజూ మారుతున్నాయి మారుతాయి కూడా. కాని యిందువల్ల శాస్త్రీయ సిద్ధాంతం మారిపోతుందా? ప్రసవవేదన పడకుండానే తల్లి బిడ్డను కనగల్గుతుందా? ప్రసవ సమయంలో నెత్తురు కారకుండా వుంటుందా? దోపిడీదారీ పీడక వర్గాలున్నప్పటికీ హత్యలు, దోపిడీలు జరగకుండా వుంటాయా? మారిన పరిస్థితులను గాంచి పులులు, సింహాలు హృదయ పరివర్తన చెంది, మాంసం తినడం, నెత్తురు తాగడం మాని గడ్డిమేయడం మొదలుపెడతాయా? ఆహా, కమ్యూనిస్టు బోర్డులు తగిలించుకున్న ఈ సంస్కరణ వాదులు ఎంత తమాషా కబుర్లు చెబుతున్నారండీ!

వర్గపోరాట క్రమంలో విప్లవం రానంతవరకు, అంటే దోపిడీవర్గం చేతులనుండి కార్మిక, కర్షక వర్గాలు రాజ్యాధికారం గుంజుకోనంతవరకు దోపిడీ వర్గపు దోపిడీ, పీడనలు అలా సాగుతూనే వుంటాయి. కనుక ప్రప్రథమ ఆవశ్యకత యీ దోపిడీ వర్గాలను తుడిచిపెట్టడమే. వర్గపోరాట మార్గమే దోపిడీ, పీడనలనుండి విముక్తికి ఏకైక మార్గం. ఈ మార్గంలో నడవాలంటే ప్రజలు మార్క్సిస్టు శాస్త్రీయ భౌతికవాది ఆలోచనాధోరణి అలవర్చుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

*[సుమారు 22 ఏళ్ళక్రితం కా. నియోగి రాసిన వ్యాసం యిది. దీనికి ఆయన కొత్తగా 1991 ఏప్రిల్‌లో ముందుమాట రాసారుగాని నాటి పని తొందరవల్ల కాలానుగుణంగా వ్యాసంలో తనకు అవసరమనిపించిన మార్పులు చేర్పులు కూడా చేయలేకపోయారు. అంతలో 1991 సెప్టెంబరు 28వ తేదీనాడు దోపిడీ వర్గ గూండాల ఘాతుకానికి బలై అమరులైనారు. కా. నియోగి ఒక మార్క్సిస్టు. కార్మిక రాజ్యం అంటే సోషలిజం స్థాపనే ఆయన ధ్యేయం. అందువల్ల ఆయన కార్మికులకు, కార్మిక సంఘాలకు సదా ఈ మార్క్సిస్టు ఆలోచనాధోరణిని వివరిస్తూ, మార్క్సిస్టు భావాలతో వారిని ప్రేరేపిస్తూ వుండేవాడు.]*

* * * * *

# మా ప్రచురణలు

| | | రూ పై |
|---|---|---|
| 1 | ముస్లిం మతతత్వాన్ని ఎదిరించండి! | |
| | రచన హమీద్ దల్వాయ్, అను ఇంగువ మల్లికార్జున శర్మ | out of stock |
| 2 | పెట్టుబడి | |
| | రచన కార్ల్‌మార్క్స్, అను ఇంగువ మల్లికార్జున శర్మ | o s |
| 3 | రష్యా విప్లవం ; రచన - మల్లిక్ బాబు | 3-00 |
| 4 | కమ్యూనిస్టు కంచుకోటలు ఎందుకు బీటలు వారాయి? | o s |
| | రచన ప్రతాప రామసుబ్బయ్య, దుర్గా కృష్ణమూర్తి | o s |
| 5 | స్మృతులు; రచన దుర్గా కృష్ణమూర్తి | o s |
| 6 | సుడిగుండంలో భారతదేశం, రచన : ప్రతాప రామసుబ్బయ్య | o s |
| 7 | పోరాటపథంలో నేను (స్వీయ జీవిత చరిత్ర) | o s |
| | రచన ప్రతాప రామసుబ్బయ్య | o s |
| 8 | **Role of Revolutionaries in the Freedom Struggle** by I Mallikarjuna Sharma | (Paper Back) 48-00<br>(Hard Back) 144-00 |
| 9 | మార్క్సిజం-లెనినిజం నుండి వైదొలగిన గోర్బచేవ్ | |
| | రచన ప్రతాప రామసుబ్బయ్య | o s |
| 10 | బిస్మిల్ ఆత్మకథ; అను ఇంగువ మల్లికార్జున శర్మ | |
| | రచన అమరవీరుడు రామప్రసాద్ బిస్మిల్ | o s |
| 11 | అగ్నిపరీక్ష ఎదుర్కొంటున్న అంతర్జాతీయ కమ్యూనిజం | |
| | రచన ప్రతాప రామసుబ్బయ్య | o s |
| 12 | మన పరిస్థితులు - మన విధానాలు | |
| | రచన ఇంగువ మల్లికార్జున శర్మ | (సాదా ప్రతి) 20-00 |
| 13 | భారతదేశ ద్వితీయ స్వాతంత్ర్య సంగ్రామం | |
| | రచన డా భూపేంద్రనాథ్ దత్త | (సాదా ప్రతి) 20-00 |
| | అను ఇంగువ మల్లికార్జున శర్మ | (మేలి ప్రతి) 50-00 |
| 14 | **India Plunges into All-Round Chaos** | |
| | by Pratapa Ramasubbaiah | (Paper Back) 25-00 |
| 15 | కమ్యూనిజం మూలసూత్రాలు | |
| | రచన ఫ్రెడరిక్ ఏంగెల్స్ | (సాదా ప్రతి) 10-00 |
| | అను ఇంగువ మల్లికార్జున శర్మ | (మేలి ప్రతి) 30-00 |
| 16 | **Easter Rebellion in India** | |
| | **The Chittagong Uprising** | (Hard Back) 360-00 |
| | by I Mallikajuna Sharma | |

* * * * *

# మా లక్ష్యాలు

ఏ పార్టీకి, ఏ గ్రూపుకూ చెందని మేము కొందరు కమ్యూనిస్టులం ఈ మార్క్సిస్టు అధ్యయన వేదికను 1981 నవంబరు 7వ తేదీనాడు హైదరాబాదులో ఏర్పాటు చేసాము. మా ఆశయాలు, లక్ష్యాలు యివి:

1. వామపక్ష, ప్రజాతంత్ర్య ఐక్యత అవసరాన్ని గురించి ప్రచారం చేయడం; కమ్యూనిస్టు వుద్యమ సూత్రబద్ధ ఐక్యతకోసం పాటుపడడం.

2. కమ్యూనిజం, మార్క్సిస్టు సోషలిజాలకు సంబంధించిన మౌలిక రచనల్ని, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజాలకు దోహదపడే యితర ముఖ్యరచనల్ని, వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై పుస్తకాలు, కరపత్రాలను తెలుగులోను, ఇంగ్లీషులోను, వీలైతే యితర ప్రాంతీయ భాషల్లోను, ప్రచురించడం.

3. మార్క్సిజం ప్రచారం, సంరక్షణలకోసం, వివిధ జాతీయ అంతర్జాతీయ సమస్యలపై మార్క్సిస్టు విశ్లేషణకోసం గోష్టులు, సెమినార్లు, సమావేశాలు జరపడం.

4. పౌరహక్కుల వుద్యమంలోనూ, యితర ప్రజాస్వామ్య వుద్యమాల్లోనూ చురుకుగా పాల్గొనవల్సిందిగా వేదిక సభ్యులను, యితర ప్రగతిశీలురను ప్రోత్సహించడం.

## OUR AIMS AND OBJECTS

Marxist Study Forum, founded on 7 November 1981 at Hyderabad, professes the following aims and objects:

1. To conduct study and propaganda and encourage social action aiming at a broad left, democratic unity and a principled unity in the communist movement based on a comprehensive review of the world communist and socialist movements;
2. To publish basic works of socialism, marxism and communism, important works about various revolutionary movements and other valuable works contributing to the cause of social progress and human welfare; also to publish books, booklets and pamphlets on various national and international problems in English, Telugu and other regional languages;
3. To conduct seminars, symposia and meetings to further the cause of socialism and human welfare; and
4. To encourage the members of the Forum and others to actively participate in the civil liberties movement and other rational and just movements of the people.

**Welcome to join us!**



**I. Mallikarjuna Sharma**
Convener, MARXIST STUDY FORUM
6-3-1243/116, D. Sanjeevaiah Nagar,
Opp. Raj Bhavan,
**Hyderabad - 500 482.**

* * * * *

# Karmikodyama Karthavyalu

*Com. Sankar Guha Niyogi*

## కా౹మ్రేడ్ శంకర్ గుహ నియోగి తుది పలుకులు

మి౹త్రులారా, మాపై యిప్పటికే అనేక దాడులు జరిగాయి. రేపు రేపు మరింత ౹ప్రమాదకర దాడులు జరగవచ్చు. ఎందుకంటే యిక్కడి పారి౹శామిక ౹ప్రాంతాల కార్మికులు తమ డిమాండ్లు తీరేంతవరకు పోరాటం ఆపరు గదా. కనుక ఏంటే మీ రోమాలు నిక్కబొడుచుకునేంతటి భయంకర దాడి మాపై జరగవచ్చుకూడ.



సహచరులారా, అలాంటప్పుడు మీరంతా దృఢంగా లేచి నిలబడాలి. ఒకవేళ అదికూడ వీలుపడకపోతే, మా త్యాగాన్ని గుర్తు చేసుకుంటూ ఓ రెండు కన్నీటి చుక్కలైనా జారవిడవండి. ఎ౹ర దండాలు!

ఎరుపు - ఆకుపచ్చ జెండా జిందాబాద్ ! అమరవీరులకు జోహార్లు !

మీ శంకర్ గుహా నియోగి

Printed and Published by MARXIST STUDY FORUM,
6-3-1243/116, D. Sanjeevaiah Nagar, Opp. Raj Bhavan,
Hyderabad - 500 482.